శ్రీ

# హరిశ్చంద్రద్విపద

గౌరనమంత్రిప్రణీతము.



వేదము - వేంకటరాయశాస్త్రిచే

సటిప్పణముగా

స్వకీయ

జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలలో

ముద్రితము.



1912.

---

దీనివెల 12 ణ.

# విషయసూచిక.



| విషయము. | పుట. |
|---|---|
|  | 92 |

---

శ్రీ

# హరిశ్చంద్రద్విపద

## పూర్వభాగము.

---

## ఇష్టదేవతాస్తుతి.

శ్రీగిరిజాధీశు శ్రీగిరినాథు
నాగచర్మాంబరు నాగకేయూరు
బాణవత్సలుఁ బంచబాణసంహారు
వాణీశవినుతు గీర్వాణేశ వంద్యు
గంధర్వ కిన్నర గాంధర్వ లోలుఁ
గంధరశ్యామల కంధరోదారు

గిరిజా=పార్వతియొక్క. శ్రీగిరి=శ్రీశైలముయొక్క. నాగచర్మ అంబరుఁడు=ఏనుఁగు తోలు వస్త్రముగాఁగలవానిని. నాగకేయూరుఁడు=పాములు అంగదములుగాఁ గలవానిని. బాణవత్సలుఁడు=బాణాసురుని యందు అనుగ్రహము గలవానిని. పంచబాణ=మన్మథుని. వినుతుఁడు=స్తుతింపఁబడినవానిని. గీర్వాణ ఈశ వంద్యుఁడు=దేవతల దొరను అనఁగా ఇంద్రునికి వందనార్హుని. గాంధర్వ లోలుఁడు=సంగీతమునందు ఆసగల వానిని. కంధర=మేఘమువలె- శ్యామల=నలుపయిన- కంధర=కంఠము చేత- ఉదారుఁడు=గొప్పవానిని-త్రాగిన నల్లని కాలకూటము గొంతులో నున్నందున కంఠము నల్లగ నగపడును.

దారు ణాంధక దర్ప దళన ప్రచారుఁ
చారు జాంబూనదశైల కోదండుఁ
గారుణ్యజలధి గంగాధరు నభవు
శారదా చందన శారదాంభోద
మల్లికా కర్పూర మాలికా యశుని
మల్లికార్జునదేవు మహితప్రభావు
మాపాల నేపట్ల మ న్మేలువేల్పుఁ
బాపాలిఁ బాప సద్భక్తిఁ బూజించి;
పరమయోగీంద్ర హృత్పద్మసద్మముల
మరిగి క్రీడించెడి మాయాలతేఁటిఁ
గడు నొప్పు భ్రమరాంబికా మహాశక్తిఁ
దడయక వరములు దయసేయఁ గొలిచి;
సారంబుగా వేడ్క సమకొల్పు బీజ
పూరంబు వలకేలఁ, బొలుచు రత్నాల
హారంబు డాకేల, నాదిత్య మకుట
హీరంబు నెదఁ, గల్గు హేరంబుఁ బొగడి;

అంధక = అంధకాసురునియొక్క. దళన = చీల్చుటయందు- ప్రచారున్ = వ్యాపారము గలవానిని. చారు = సుందరమైన- జాంబూనదశైల = బంగారుకొండయే (మేరువే) - కోదండున్ = విల్లుగాఁ గలవానిని. జలధిన్ = సముద్రుని. అభవున్ = పుట్టుక లేనివానిని. శారదా = సరస్వతి. శారద అంభోద = శరత్కాలపు మేఘము. మాలికా = విరజాజి-వీనివంటి-యశునిన్ = కీర్తిగలవానిని. పాప ఆళిన్ = పాప సమూహమును. సద్మములన్ = గృహములందు. వలకేలన్ = కుడిచేత. బీజపూరంబు = మాదీఫలము. డాకేలన్ = ఎడమచేత. ఆదిత్య మకుట హీరంబున్ = సూర్యుని కిరీటమందలి వజ్రమణియు. ఎదన్ = ఱొమ్మున. హేరంబున్ = విఘ్నేశ్వరుని.

వల్లకీమృదుపాణి వరనీలవేణిఁ
బల్లవారుణపాణిఁ బరమకల్యాణిఁ
జారుహారశ్రేణి సైకతశ్రోణి
వారిజాసనురాణి వాణిఁ బ్రార్థించి;
యాకాళిదాసాదులగు మహాకవులఁ
జేకొని యభిమతసిద్ధికిఁ దలఁచి;
చెలఁగి ఋగ్వేదప్రసిద్ధుఁడై జగతి
వెలయు హరిశ్చంద్రవిభు పుణ్యచరితఁ
గవితాచమత్కృతిఁ గాంచి హర్షించి
కవు లందఱును శిరఃకంపంబు సేయఁ
బచరించి వీనులపండువు గాఁగ
రచియింతు.—మత్కుల క్రమ మెట్టి దనిన:—

—క వి వం శ ము.—

సింగన మాధవ క్షితిపాలమణికి
మంగళమూర్తికి మంత్రి యై జగతిఁ
బొగడొందు పెద్దన పోతరాజునకుఁ
దగిన తమ్ముఁడు యశోధనుఁ డెల్లమంత్రి
చెట్టఁ బట్టంగ నోఁచిన భాగ్యవతికిఁ
జొట్టాలసురభికి సుందరీమణికి
ఘనుఁడు వల్లభమంత్రి గంగాంబ కోరి
కనిన పోచాంబకు గారాబుసుతుఁడ;
ధరణి నమాత్యరత్నం బనఁ బరఁగు
ధరణిమంత్రికిఁ గూర్మితమ్ముఁడ ఘనుఁడ,

వల్లకీ=వీణియ. పల్లవ అరుణ పాణిన్ = చిగుళ్లవలె ఎఱ్ఱని చేతులు గలదానిని. సైకతశ్రోణిన్ = ఇసుకదిన్నెలవంటి పిఱుఁదులు గలదానిని. వారిజాసను=బ్రహ్మను. సురభికిన్ = కామధేనువునకు.

భూతనాయక పాద పూజాభిరతుఁడ,
గౌతమగోత్రుండ గౌరనాహ్వయుఁడ,
సరస సాహిత్య లక్షణ విచక్షణుఁడ,
బిరుదవిఖ్యాతిచేఁ బెంపొందువాఁడ.
శ్రీకరంబుగ విరచింప నేఁ గోరు
నా కథావృత్తాంత మది యెట్టు లనిన:—

—క థా వ తా రి క.—

గురుతపోబల *నఖాంకురముల నూఁది
దురిత మత్తేభ సందోహంబు నణఁచి
పొలుచు సన్మునిసింహములకు వసింప
వల నైన యాద్వైతవనములోఁ బ్రబలి
యెల్లకాలమును బెం పెసఁగెడు బాల
పల్లవంబుల లసత్ప్రసవ మంజరులఁ
బరిపక్వఫలములఁ † బారిజాతంపు
మురువున నెంతయు ముద మొదవించు
సహకార భూజంబు చల్లని నీడ
సహజన్ము లందఱు సద్భక్తిఁ గొలువ

భూతనాయక=శివునియొక్క. అభిరతుఁడన్ = ఆసక్తుఁడను. విచక్షణుఁడన్ = పండితుఁడను. నఖ అంకురములన్ = మొలకలవంటి (వాఁడు లైన యనుట) గోళ్లను. దురిత=పాపములనెడి - మత్తేభ = మదపుటేనుఁగులయొక్క - సందోహంబున్=సమూహమును. లసత్ ప్రసవ మంజరులన్=ప్రకాశించుచున్న పూగుత్తులచేతను. పారిజాతంపు మురువునన్ = కల్పవృక్షము చందమున. సహకారభూజంబు=తియ్యమామిడిచెట్టు. సహజన్ములు=తోఁబుట్టువులు.

* 'నఖాంకుశముల' † 'పారిజాతముల' అని కొన్ని ముద్రణముల నున్నది.

ననఘవర్తనుఁ డైన యాధర్మరాజు
మునులసద్గోష్ఠి నిమ్ముల నున్నవేళ,

## —ధర్మజ మార్కండేయ సంవాదము.—

గుఱుచకెంజడలు బాగుగ నెత్తి చుట్టి
మెఱవడిగా భూతి మెయినిండ నలఁది
చారు రుద్రాక్ష భూషణములు దాల్చి
సారంగచర్మంబు జాఱుగాఁ గప్పి
సురుచిరస్ఫటికాక్షసూత్రంబుఁ బుణ్య
సరిదంబుపూరితోజ్జ్వల కమండలువుఁ
గరముల విలసిల్లఁ గణ్వ కుత్సాది
వరమునీశ్వరు లిరువంకలఁ గొలువఁ
జనుదెంచు దీప్తవైశ్వానరతేజు
ననఘు మార్కండేయుఁ డను మునిచంద్రుఁ
బొడగాంచి; తాను దమ్ములు నెదు రేఁగి
పుడమిఁ జాఁగిలి మ్రొక్కి, పూజ లొనర్చి,
సమ్మదంబున సుఖాసనమున నునిచి,
యమ్మునీశ్వరు సేమ మంతయు నడిగి,
యుచితసద్గోష్ఠి మై నున్నయావేళ
సుచరిత్రుఁ డగుధర్మసూనుఁ డి ట్లనియెఁ:—
'బిన్నటనాఁటఁ బొంపిరివోవుభక్తిఁ
బన్నగకంకణుఁ బరఁగ మెప్పించి
మెఱుఁగుఁ గోఱలతోడి మృత్యువునోరు
తఱలక డాకాలఁ దన్ని దట్టించి

అనఘ=పాపరహితుడైన. సరిత్=నదియొక్క. వైశ్వానర=అగ్నియొక్క. పొంపిరివోవు=అతిశయించునట్టి. పన్నగ=పాములు.

మునులముత్తాతలై మూఁడులోకముల
వినుతి కెక్కిన తపోవృద్ధులు మీరు.
ముందు మీ రెఱిఁగిన భూతలాధీశు
లందు రాజ్యంబు నేనాఁడి క్రమ్మఱను
భుజవిక్రమంబున భూచక్ర మెల్ల
ప్రజలు సన్నుతిసేయఁ బాలించినట్టి
మనుజేశతిలకుని మహితచారిత్రు
ననురాగ మిగురొత్త నానతీవలయు.'
నని విన్నవించిన యాధర్మపుత్త్రుఁ
గనుఁగొని పలికె మార్కండేయుఁ డెలమి:—
ననఘాత్మ, నీవు నన్నడిగిన మాట
కొనర నుత్తరముగా నొకకథ వినుము:—

## —అయోధ్యాపురవర్ణనము.—

'శివుని కెంజడలలోఁ జెలఁగు జాహ్నవికి
సవతు సేయఁగఁ దగు సరయువు పొంత
ధరణిదేవికి ముఖదర్పణం బనఁగఁ
బరుల కసాధ్య మై పరఁగు నయోధ్య.
చెలు వొందు నందునఁ జిగురుమావులును
గలయఁ దెం పెసఁగు చెంగల్వబావులును
సోమరిగాలిచే సుడియు తావులును
ప్రేమఁ గాముకులు చరించు తావులును
దరుణ ప్రవాళ లతా వితానములుఁ
బరిఖాంబు సారస బహువిలాసములుఁ

జాహ్నవికిన్ = గంగకు. సవతు = సాటి. దర్పణము = అద్దము.
మావులు = మామిడిచెట్లు. సోమరి = మందమయిన. తావులు = చోట్లు.
పరిఖా = అగడ్తయొక్క. సారస = తామరలయొక్క.

జెన్నుమించిన మంచి చెఱకుఁదోఁటలును
మిన్నులతో రాయు మేటికోటలును
గమనీయవజ్రసంగత కవాటములుఁ
గొమరారు ముత్యాల కొలువుఁగూటములు
రాజితం బగు గృహరాజి మేడలును
భూజనంబులు మెచ్చి పొగడువాడలును
వేడుక మది కొదవించు వీదులును
నీడలు దోఁచు మాణిక్యవేదులును
గనకచిత్రిత పతాకా వితానములుఁ
జెనుపొందు మాగధబృంద గానములు
బహువిధ దేవతాప్రాసాదములును
మహనీయ తూర్య సమ్మద †వాదములును;
బరతత్త్వవిదు లైన బ్రాహ్మణోత్తములుఁ
బురుహూతుఁ బురుడించు భూపసత్తములు
నలకాధిపతికి జో డైన వర్తకులు
నలఘు నృత్యప్రౌఢి నలరు నర్తకులు;
మందారములు వోలె మను మహీజములు;
నెందుఁ బోఁ దలఁచిన నేఁగడు తేరు
లవిరళ మదగంధు లగు వారణములుఁ
బ్రవిమల రత్న దర్పణ తోరణములుఁ

వీదులు=వీథులు. రాజితంబు=ప్రకాశించుచున్నది. మాగధ=వంశావళిని పొగడువారియొక్క. తూర్య = వాద్యముల. పురుహూతుఁ=ఇంద్రుని. పురుడించు = పోలునట్టి. అలకాధిపతికిఁ = కుబేరునికి. మందారములు = కల్పవృక్షములు. వారణములు = ఏనుఁగులు. దర్పణ=అద్దములుగల. తోరణములు=గృహద్వారములు.

† 'నినాదములుఁ' అని కొన్ని ముద్రణములందు.

రవళించి దాఁటు సాంబ్రాణి తేజీలుఁ
దివిరి కే లెత్తినఁ ద్రెంపు జోదులును
బగఱ తూపుల గంట్ల బలుగాయ లోడలఁ
దగు భూషణము లైన దండనాయకులుఁ;
దెగువ మత్తేభముల్ దెమలించి తుండ
ముగలించి పైజోదు నణఁచు మాస్టీలు;
నరుదుగా రౌతును హయముఁ బల్లమును
దురమున వేటూఱు తునియలు గాఁగ
వడిగొని యడిదాన వైచి కండానఁ
దుడుము రౌతులుఁ; గత్తి డొంకెనఁ బొడిచి
పోటుగండ్లనె తూటి పోవు సద్భటులుఁ;
దాటించి కరి నైనఁ దఱుము మల్లులును;

—హరిశ్చంద్ర వర్ణనము.—

గలుగు నప్పుర మేలు కమనీయమూర్తి
నలరు హరిశ్చంద్రుఁ డను చక్రవర్తి
పరఁగ నీయుగములు పదునాల్గు వరుస
నరుగునంతకు భువి నంతయు నేలె;
హరి హర బ్రహ్మాదు లచ్చెరు వొంద
జరిపె సన్నుతి కెక్క సత్యవ్రతంబు;

రవళించి=ధ్వనించి-సకిలించి. సాంబ్రాణి తేజీలు=ఉత్తమము లైన గుఱ్ఱములు. తూపుల=బాణముల - గంట్ల = గాయములయొక్క. తెమలించి = పట్టిలాగి. మాస్టీలుఁ=శూరులును. పల్లమును = జీనును. వేటు=కత్తియొక్క దెబ్బకు. అడిదానన్ = కత్తితో. కండానన్=తమ గుఱ్ఱపుమూఁపుమీఁద. డొంకెనన్=వంకరయాఁకుఁగు గల యీఁటెతో. గండ్లనె=రంధ్రములలోనే. తాటించి = కొట్టి. మల్లులు = జెట్టులు.

నోజతో నమరముఖ్యులు పంపు సేయ
రాజసూయమహాధ్వరం బొనరించె;
వాజులఁ దన కదు రై పేర్చుకరుల
వాజుల సుభటుల వడిఁ దునుమాడి
రాజుల నుదయమార్తాండ ప్రచండ
తేజులఁ బఱపి మర్దించి కప్పంబు
లేర్పడఁ గైకొని యెల్లదీవులను
దర్పించి నిజజయస్తంభముల్ నిలిపి
యెన్నిక కెక్కి యీరేడులోకముల
వెన్నెలగతిఁ గీర్తి వెలిఁగించె. నట్టి
భానుకులాధిపుఁ బట్టపుదేవి
మానినీమణి చంద్రమతి యనులేమ.
కోర్కులు నిండించు కూరిమితనయుఁ
డర్కతేజుఁడు లోహితాస్యుఁ డన్వాఁడు
వార్త కెక్కిన మంత్రివరులలో నెల్లఁ
గీర్తింపఁ దగు సత్యకీర్తి ప్రధాని.
యిట్టి ప్రతాపంబు నిట్టి వైభవము
నిట్టి భాగ్యమును బెం పెసఁగ నారాజు
తల్లియుఁ దండ్రియు దాన యై ప్రజల
నెల్లఁ బ్రోచుచు నిల యేలుచు నుండె.

—ఇంద్రసభ.—

భానుకోటి ప్రభా భాసురం బైన
యానాకలోకము నం దొక్కనాఁడు

ఓజ=వరుస. పంపు=(హవిర్భాగముల) పంపకము. ఆజులన్=పోరులందు. మార్తాండ=సూర్యునివంటి. భాను=సూర్య. ఈరేడు=పదునాలుగు. లేమ=స్త్రీ. అర్క=సూర్యునివంటి. పోషించుచు. నాక=స్వర్గ.

పరమసమ్మదమునఁ బాకశాసనుఁడు
హరిచందనము మేన నలవడ నలఁది
సరి లేని రత్నభూషణములు దాల్చి
సరస మందారపుష్పంబులు దుఱిమి
పొసఁగ దివ్యాంబరంబులు లీలఁ గట్టి
యసమానశృంగార మలవడఁ జేసి;—
తళతళ మను పైఁడి తలుపులు, మించు
నెలఱాల తిన్నెలు, నీడలు దోఁచు
నీలాలకంబాలు, నిర్మలస్ఫటిక
సాలభంజికలుఁ, బచ్చలగవాక్షములుఁ,
బగడంపువామారుఁ, బద్మరాగముల
మొగడులు, వైడూర్యముల మందిరములు,
సలలిత శశికాంత చంద్రశాలలును,
వెలఁది ముత్యంబుల వెలయు వాకిళులు,
నవ పుష్యరాగ రత్నముల కుడ్యములుఁ,
బ్రవిమల వజ్రసోపాన మార్గములుఁ,
గలిగి, నానాధూప గంధబంధురముఁ
బాలు పొంద యవనికాభోగ భాసురముఁ
గర్పూర చందన కాశ్మీర మిళిత
దర్ప సారాంబు సిక్త ప్రదేశంబు

పాకశాసనుఁడు = ఇంద్రుఁడు. నెలఱాల = చంద్రకాంతశిలల. గవాక్షులు = కిటికీలు. సాలభంజికలు = బొమ్మలు. మొగడులు = ఇంటి నడికొప్పులు. శశి = చంద్ర. చంద్రశాలలును = పయిమేడలును. వెలఁది = నిర్మలము లైన. బంధురము = దట్టమైనది. యవనికా = తెరలయొక్క. ఆభోగ = విరవిచే. కాశ్మీర = కుంకుమముతోను. దర్ప = కస్తూరిచేత.

నై దిశావలిఁ బర్వ నతులితప్రభల
దేదీప్యమాన మై తిరముగా మెఱయు
నిరుపమ నిజ సభానిలయంబునందుఁ
బరఁగు చింతామణిభద్రపీఠమునఁ
దనర వాసీనుఁ డై; - తగుప్రియం బెసఁగ
ననల కృతాం తాదు లైన దిక్పతులుఁ
గిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగ సన్ముని ప్రవరులుఁ గొలువ,
రవల కంకణముల రవము లెసంగ
సవర నచ్చరలు వింజామర లిడఁగ,
నారద రణిత వీణా నినా దాను
కారి యై తుంబురుగాన మిం పెసఁగ,
వినుత రంభా నృత్య విభ్రమగతులు
కనుఁదమ్ములకును వికాసంబు నెఱపఁ,
బారిజాతోద్భవప్రసవమంజరుల
సౌరభంబులు వెదచల్లుచుఁ బొలయు
బాలానిలంబుచేఁ బలుమాఱుఁ గదలు
నీలాలకంబులు నెఱిని నటింప,
జతుర విద్యాధర సన్నుతు లెసఁగ
నతులితం బైన మహావైభవమున
నొనరంగఁ గొలువున నుండి సన్మునుల
కనియెఁ బ్రసంగోక్తి నపు డొక్క మాట:—

దిశా ఆవలిన్ = దిక్కులసమూహమున. అతులిత ప్రభలన్ = సాటిలేనికాంతులచే. సవరన్ = చక్కఁగా. రణిత = శబ్దింపఁబడిన. సౌరభంబులు = పరిమళములు. అనిలము = గాలి. అలకంబులు = కురులు.

* 'సరవి' అను పూర్వముద్రణముల పాఠమునం బ్రాసభంగము.

—దేవేంద్ర ప్రశ్న.—

'మూఁడు లోకంబుల మును మిడి మీరు
చూడని యట్టి రాజులు మతి లేరు,
వారక మును చన్న వారిలో నున్న
వారిలోఁ బుట్టెడివారిలోపలను 21
బలికి బొంకని మహీపాలుండుఁ గలఁడె?
తలపోసి చెప్పుఁ డిందఱు నట్టివాని.'
యని యిట్లు దేవేంద్రుఁ డాడినమాట
వినియును వినవట్లు విస్మయం బంది
చ్యవనుఁ డూరక యుండె, శార్ఙ్గరవుండు
నవుడుకొట్టెను, నీళ్లు నమిలెఁ గశ్యపుఁడు,
వామదేవుఁడు నేల వ్రాసె, మరీచి
సోమరి యై మీఁదు సూచుచు నుండె,
గౌతముఁ డత్రికి గను గీఁటె, నతఁడు
శాతాతపునివైపు సన్న గావించె, 22
నాతఁ డగస్త్యుని నల్లన గోఁకె,
నాతఁడు జమదగ్ని నదిమె హస్తమున.

—వసిష్ఠమహాముని యుత్తరము.—

నీవిధి నుత్తరం బీక యొండొరుల
నీవు నీ వని చూపి నిఖిల సన్మునులు
గుజగుజలాడఁ; గన్గొని సభవారి
గజిబిజిఁ జే యెత్తి కలయ వారించి
నిరుపమవిజ్ఞాననిధి వసిష్ఠుండు
పురుహూతుతోడ నద్భుతము గాఁ బలికె:—

మును మిడి=వరుస పెట్టి. నవుడుకొట్టెను=ఏమి తోఁపక ఉండెను.

'వినుము సురేంద్ర యీ విశ్వంబునందు
వినుతికెక్కిన మహావిక్రమోన్నతుఁడు
తనరు షోడశమహాదానవినోది
వినయభూషణుఁడు వివేకసంపన్నుఁ
డతులసత్కీర్తి మహాభాగ్యశాలి
వితత ధనుర్వేద విద్యాధికుండు
కరుణాపయోనిధి గాంభీర్యఘనుఁడు
దురితదూరుఁడు బుధస్తోత్రపాత్రుండు
సర్వశాస్త్రార్థ విచార కోవిదుఁడు
గర్వితరిపుగజ కంఠీరవుండు
వరుస నార్వురు చక్రవర్తులలోనఁ
దర మిడి మున్నెన్నఁదగు చక్రవర్తి
నిత్యప్రసన్నుండు నీతిపాలకుఁడు
సత్యసంధుండు త్రిశంకునందనుఁడు
నిరుపమ విజ్ఞాన నిధి భానువంశ
శరధిచంద్రుఁడు హరిశ్చంద్రుఁ డన్రాజు.
శోఁడిమి మదిఁ దలపోసి చూచినను
వాఁడె పో బొంకనివాఁడు దేవేంద్ర.'

## —విశ్వామిత్త్రుని యాక్షేపము.—

అనిన విశ్వామిత్రుఁ డంబుదధ్వనికిఁ
గనలి సింహము మాఱు గర్జించునట్లు

వినోది = క్రీడించువాఁడు. అతులసత్కీర్తి=సాటిలేని మంచి యశస్సు గలవాఁడు. రిపు గజ=శత్రువులనెడియేనుఁగులకు-కంఠీరవుండు =సింహమైనవాఁడు. తరము ఇడి=తారతమ్య మేర్పఱిచి. శరధి=సముద్రమునకు. అంబుద = మేఘము. కనలి= కోపించి.

లా వసిష్ఠునిఁ గోప మడర వీక్షించి
'యీవిధంబున మృష లేల వాక్రువ్వ?
నోజ దధ్యాజ్య శాల్యోదన మాంస
భోజనంబులు పరిపూర్తిగా మెసఁగి
మత్తులై వర్తిల్లు మానవేశ్వరులు
సత్తుగాఁ బొంకుట సత్య మెయ్యెడను.
జనపతు లే యూరు సత్య మే యూరు?
వినఁ గూడ దీమాట విడువుము చాలు.
నేడ హరిశ్చంద్రుఁ? డెక్కడి సత్య?
మేడ నమ్మెడి దిది? యినవంశజులకు
హితవు మీఱిన పురోహితుఁడవు గానఁ
శతముఖంబుల రేఁగి సన్నుతిఁ జేయు.
దభిమతం బింద్రున కైనఁ గానిమ్ము.
సభవారి కీమాట సమ్మతి గాదు.
దోషము వినఁగ నీ దుర్వాక్కు. ల' నిన,
రోషించి పలికె నరుంధతీవిభుఁడు:—

—వసిష్ఠుని సమాధానము.—

'అంతుగా నాఁబోతు అంకె వేసినను
గంతులు దక్కునే కంఠీరవంబు?
కల్లజంజాటంబు కౌశిక, యిచటఁ
జెల్లదు సుమ్ము, వసిష్ఠుఁ డుండంగఁ.
నురగకంకణుతోడ నూరజోగులను
సరి చేసి యెన్నిన చందాన నీవు

మృషలు=కల్లలు, ఓజన్=వరుసగా, దధి=పెరుఁగు-ఆజ్య=నేయి-శాల్యోదన=వరిబియ్యపుటన్నము. ఇన=సూర్య. కల్లజంజాటంబు=వట్టి యాడంబరము. ఉరగ=సర్ప.

నమలసత్యవ్రతుం డగుహరిశ్చంద్రు
సమముగా నృపపిశాచముల లెక్కింతు!
వామహారాజేంద్రు నఱకాలివ్రాలు
భూమిపాలుర ఫాలముల నైనఁ గలదె!
యెవ్వనిగాఁ జూచి తినకులేశ్వరునిఁ,
గ్రొవ్వి దూషించెదు కొలువు మధ్యమున?
నాసార్వభౌము ని ట్లాడిన నీకు
వాసి వచ్చెను వాని వన్నె యుడిగనో?
యట్టి సత్యవ్రతు నారాజచంద్రు
నట్టి తేజోధను నా హరిశ్చంద్రుఁ
దిఃరి పల్కాఱు నిందించెద వేని,
శివుఁ డెఱింగెడుఁ జామీ! చెప్పెడి దేమి?'
యనిన, విశ్వామిత్రు డలుక రెట్టించి
మనమునఁ బెనఁగొన మఱియు ని ట్లనియె:—

—.వి శ్వా మి త్రు ని ప్ర త్యా క్షే ప ము.—

'వలదు వసిష్ఠ, యీ వట్టిజగ్గరల
కలుగునే కౌశికుఁ డల్పుని రీతి?
దండడి డీకొని తగరు దాఁకినను
గొందల మందునే కులపర్వతంబు?
సొలయక నినుఁ బుత్రశోకాబ్ధి ముంచి
మలయంగఁ జేయుట మఱచితే నేఁటి?
కొకరాజకీటంబు నొకదుగ్ధదాంధు
నొకని నాముందఱ నొకకొండఁ జేసి

కొలువు=సభ. జగ్గరలకున్=బెదరింపులకు. వందడిన్=దొమ్మిగా. తగరు=పొట్టేలు. కొందలము=కలఁత. సొలయక=వెనుదివియక. అబ్ధిన్=సముద్రమునందు. మలయంగన్=తపించునట్లు.

పూని నీ వతనిపైఁ బూయనిపూఁత
లేనిసత్యంబు గల్పించి యెక్కించి
నలి రేఁగి వాని గుణంబులు గాఁగ
కలవి లేనివి గొన్ని కాఱులు సెప్పి,
యందంద వాకుది కతిచలం బెసఁగ
వంది చందమునఁ గైవారంబు సేసి
దంటు మాటలు గొన్ని తడవాటు వన్ని
గెంటక నోరార్చి గెల్వఁ జూచెదవు.
అక్కజంబుగ నబ్ధి నాపోశనముగఁ
గ్రుక్కగొన్నట్టి యాకుంభజాఁ డుండఁ,
బన్నగధరున కేర్పడ నలుకాలఁ
గన్నుచూపినయట్టి గౌతముఁ డుండ,
నలిననాభుని జగన్నాథు ముకుందు
నలిగి తన్నినయట్టి యాభృగుఁ డుండ,
దృష్టించి బ్రహ్మాదిదేవత లెఱుఁగ
సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసినయట్టి
యే నుండఁ, దక్కిన యీమును లుండఁ,
బూని నీ వెంతయుఁ బ్రోడయుఁ బోలె
నాకేశుతోడ మున్నాడి పల్కితివి.
మాకంటె నొక తపోమహిమాధికుఁడవె ?
నర సు రాసుర యక్ష నాగ గంధర్వ
వరులందు మఱియు నెవ్వారలయందుఁ

కాఱులు = ప్రల్లదములు. అతి చలంబు = ఎక్కువమత్సరము. కైవారము = స్తోత్రము. దంట = నేర్పు. తడవాటు = అడ్డము. నోరు ఆర్చి = బూకరించి. అక్కజంబు = ఆశ్చర్యము. కుంభజాఁడు = అగస్త్యుఁడు. ముకుందుఁ = మోక్ష మిచ్చువానిని.

బొంకనివారలఁ బొడ గాన మేము,
శంకరునాన! ముజ్జగములయందు.

—వసిష్ఠుని ప్రతిసమాధానము.—

ననిన వసిష్ఠుఁ డి ట్లనియె నాతనికిఁ:—
'జనదు గా కాత్మప్రశంసఁ గావింప,
నంభోరుహాక్షుండు, హరుఁడును, గమల
సంభవుండును, దగు సాక్షులు గాఁగఁ
బరఁగంగ మన తపో బలముల కొలఁదిఁ
బరమేష్ఠి నిర్ణయింపఁడె మొట్ట మొదలఁ?
దడవినమాటకుఁ దగిన యుత్తరము
నుడువక ప్రాజ్ఞుండు నూరత్తుకొనునె?
యల రెండువేలజిహ్వాలవాని కైనఁ,
కొలఁదె హరిశ్చంద్రు గుణములు వొగడఁ,
దను వెల్ల సత్యంబు, తలఁ పెల్లఁ గరుణ,
పను లెల్ల ధర్మంబు, పలు కెల్లఁ బ్రియము,
బొంకు నాలుకకుఁ జేర్పుట కానివావి.
యింక నిన్నియుఁ జెప్ప నేమి కారణము?
వారిజగర్భునిప్రాఁత దప్పినను,
వారిజాప్తుఁడు తూర్పువంకఁ గ్రుంకినను,
మేరువు గ్రుంగిన, మిన్ను వ్రాలినను,
ధారుణీచక్రంబు తలక్రిందు వడిన,
వారిధు లింకిన, వజ్రాయుధంబు
ధార దప్పిన, మాట దప్పఁ డారాజు.'

అంభోరుహాక్షుఁడు=విష్ణుఁడు. ప్రశంస=స్తుతి. పరమేష్ఠి=బ్రహ్మ. నుడువక=చెప్పక. వారిజగర్భుని=బ్రహ్మయొక్క. వారిజాప్తుఁడు=కమలమిత్రుఁ డైన సూర్యుఁడు. వారిధులు=సముద్రములు.

నావుడు; నమ్మునినాథునిశ్చయము
భావించి క్రమ్మఱఁ బలికెఁ గౌశికుఁడు:—

—.వి శ్వా మి త్రు ని పూ ని క.—

‘మేలు నీమాటలు మెచ్చి రందఱును!
జాలుఁ, బురే! రిత్త సంవాద మేల?
విన్నమాటల మాకు విశ్వాస మొదవ
దన్నరేంద్రుని సత్య మరసినఁ గాని.
యేయుపాయముల నే నిటమీఁద వాని
మాయలఁ గుదియించి మాటల నొంచి
యుల్ల మంత గలంచి యూఁచముట్టుగను
గల్ల లాడించినఁ గలదె పన్నిదము?
నిక్కమింతకుఁ జాలి నిలిచెద నేను
జక్కఁగా మున్నె విచార మేమైనఁ
గలదేని వానికిఁ గఱపి నీ పూన్కి
వెలయఁ దిరంబు గావించి రమ్మ' నినఁ;—
జెలువవ్వ నవ్వి వసిష్ఠుఁ డాగ్రహము
మెఱయఁ గౌశికసంయమికి నిట్టు లనియె:—

—.వ సి ష్ఠు ని శ ప థ ము.—

‘సన్నుతం బగునట్టి సత్యవ్రతంబు
వెన్నతో నిడిన దా విభునకు మున్నె.
కఱపెడి దేమి? యక్కమలాప్తకులుని
తెఱఁ గెఱుంగక పూని దేవేంద్రుతోడ
నటిమటి వే మించ నాడంగ నేమి?
చిఱుత వే యిఁక నిన్ను చెప్ప నేమిటికి?

పురే = బళి. ఊఁచముట్టుగఁ = నిశ్శేషముగా. కఱపి = నేర్పి.
అటిమటిఁ = సంభ్రమముతో.

నీ వొకండవె కావు నీవంటి మునులు
వేవురు గూడి వేవేలచందముల
మాయలు పన్నిన, మరులు కొల్పినను,
బాయని యిడుమలపాలు సేసినను,
జననుతుం డగు హరిశ్చంద్రభూవిభుఁడు
మనసున వాక్కున మఱి చేఁతలందుఁ
గలలోన నైనను గలవరింతలను
నలఁకువ వచ్చిన నవ్వుల కైనఁ,
గులసతిఁ బాసినఁ, గొడుకు వోయినను,
దలమీఁద వచ్చినఁ, దాలిమి దూలి
మఱచి తా నాడినమాట బొంకినను,
మఱి నీవు నవ్వ బ్రాహ్మ్యమునకుఁ దొలఁగి,
తపమును వేద శాస్త్రములును మఱచి,
యుపవీతసూత్రంబు లొగిఁ బుచ్చి వైచి,
జపమును సంధ్యాదిసత్క్రియ లుడిగి,
వపన మై, యధ్యాత్మవాసన మాని,
విపులవల్కలములు విడిచి, నెన్నుదుట
నపవిత్ర మైనట్టి యంకంబుఁ దాల్చి,
ఘనగార్ధభము నెక్కి, కష్టమానవుని
పునుకలో మద్యంబుఁ బోసి త్రాగుచును,
జను లెల్ల నేవగించఁగఁ, దల వాంచి
కొని, దక్షిణాభిముఖుండ వై చనుదు.'

మరులు=వలపు. నలఁకువ=రోగము. బ్రాహ్మ్యమునకున్ = బ్రాహ్మణత్వమునకు. ఉపవీత సూత్రంబులు = జందెములు. సంధ్యా= సంధ్యావందనము. ఒగిన్=క్రమముగా. వపనము=క్షౌరము. కష్ట=పాప. ఏవగించఁగన్=రోఁతపడునట్లుగా.

నని వసిష్ఠుఁడు పల్కునతుల ప్రతిజ్ఞ
విని కౌశికుఁడు క్రోధ వివశుఁ డై పలికెః—

—విశ్వామిత్త్రుని శపథము.—

'అనిమిషవల్లభుఁ డాదిగా సురలు
మునివరు లింక నాపూనిక వినుఁడు.—
సాధించి యా హరిశ్చంద్రభూవిభుని
క్రోధకాళికి బారిగొఱియగాఁ జేసి,
పలుకుపంతము చెల్లుబడి గాఁగ నతనిఁ
జలపట్టి బొంకింపఁ జాలక యున్న,
సిద్ధ చారణ ముని సేవితం బైన
సిద్ధాశ్రమంబున శివుని నేఁ గూర్చి
గాలి యాహారంబుగాఁ గ్రోలి యొక్క
కా లూఁది యూర్ధ్వముఖంబుగా నిలిచి
రెండుచేతుల నెత్తి ఱెప్పలు విచ్చి
చండాంశుపై దృష్టి చక్కఁగా నిలిపి
యెన్నంగ బెక్కు వే లేండ్లు తపంబు
మున్ను చేసినయట్టి పుణ్యంబులోన
సగ మిచ్చి, భువన ప్రశస్తంబు గాఁగ
యుగములు నాలుగు నొగిఁ బదునాల్గు
వరుసలు వర్తింప వసుధ నేలింతు.
మఱి చతుర్దశమహామన్వంతరమున
నింద్రుని సరిగద్దె నీ స్వర్గమందుఁ
చంద్రకళావాళి సాక్షిగా నునుతు.'

అనిమిషవల్లభుఁడు = దేవేంద్రుఁడు. క్రోధ కాళికి = కోపము అనెడి కాళికాదేవికి. బారిగొఱియ = బలికొఱకైనగొఱ్ఱె. చలపట్టి = చలము వహించి. చండాంశు = సూర్యుని. భువన = లోకములందు.

వని భయంకరముగా, నమ్మహామునులు
చెనఁటిప్రతిజ్ఞలు సేసిన బెదరి
పన్నగేంద్రుని వేయిపడగలుఁ గ్రుంగ,
మిన్ను బిట్టదర, నిమ్మేదిని దిరిగ,
జలధులు గలఁగ, నక్షత్రముల్ రాలెఁ,
గులగిరు లగలె, దిక్కులు వ్రక్క లయ్యెఁ,
బెల్లుగాఁ గావిరి బెరసి యద్దంపు
బిల్లపోలికి రవి బింబంబు దోఁచె,
గుండె జల్లనఁ జేతి కులిశంబు వైచి
పండెఁ బొమ్మని దేవపతి కొల్వు విచ్చె,
జున్ను రేఁచినరీతి సుర లెల్ల బెదరి
కన్నవా రేఁగిరి కన్నత్రోవలకు,
నుదరి తాపసు లెల్ల నొండొరుఁ గడవఁ
'బద పదం డిదె మహాప్రళయంబు వచ్చెఁ!
జిఱిమి వసిష్ఠ కౌశికుల కోపాగ్ని
లుఱక లోకంబు లాహుతి గొను.' ననుచు
జడలు వీడఁగఁ గశాసములు విదిల్చి
మడిచి చంకల నిడి, మరలి చూచుచును
జనిరి దిగ్గన నిజాశ్రమముల. కట్లు
చనిరి వసిష్ఠ విశ్వామిత్రులు. అంతఁ

—వసంతమున హరిశ్చంద్రుని రాజసూయము.—

దొలఁగ హిమంబు, చంద్రుఁడు మెఱుఁగెక్కి
వెలిఁగెఁ, దియ్యనివిల్లు వెస నెక్కువెట్టి

బిట్టు=మిక్కిలి. మేదిని=భూమి. అగలెన్=పగిలెను. కావిరి=నలుపు. బెరసి=వ్యాపించి. రవి=సూర్యు. కులిశంబు=వజ్రాయుధము. జున్ను=తేనెపట్టును. చిఱిమి=చెలరేఁగి. కశాసములు=అజినములు.

మెలఁగఁ గంతుఁడు, నుబ్బు మీఱ నల్లడలఁ
జెలరేఁగి కోయిలల్ చెలఁగ, జొమ్మనుచు
మ్రోసెఁ దుమ్మెదలు, గుంపులు గట్టి ఱంతు
చేసె రాచిలుకలు, చెలు వగ్గలముగఁ
గ్రాలె జక్కవలు, చెంగల్వదీర్ఘికల
వ్రాలె నంచలు, ముద్దువగ గ్రొత్తనలు
దోఁచెఁ, బొన్నలఁ దటితో, నట మున్నె
పూచె మోదుఁగువృక్షములు, విఱ్ఱవీఁగఁ
గాచెఁ జూతంబులు, కమ్మనై మలసి
వీచె సోమరిగాలి, విరహులఁ బెదరఁ
బొలుచు నమ్మధుమాసమున నొక్కక్రతువు
వెలయ హరిశ్చంద్రవిభుఁ డొనరించి,
భూరి వెట్టెడువార్త బోరన మ్రోయఁ
గ్రూరచిత్తుఁడు కౌశికుఁడు విని యుబ్బి,
'కలిగెఁ బో సందు నా కడఁగిన పనికి, !
వలఘు సత్యవ్రతుం డగు హరిశ్చంద్రుఁ
దలము దప్పిన యట్టి ధనరాశి వేఁడి,
కలఁచి బొంకించెదఁ గాక' ని పోయి

—విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని ధన మడుగుట.—

మేదినీవిభుఁ గాంచి, మేల్మి యక్షతలు
వేదమంత్రముల దీవించి యిచ్చుటయును,

కంతుఁడు = మన్మథుఁడు. ఱంతు = కలకలధ్వని. అగ్గలముగన్ = మిక్కుటముగా. దీర్ఘికలన్ = నడబావులయందు. ననలు = పూవులు. తటితోన్ = కాలమున. క్రతువు = యజ్ఞము. తలము తప్పిన = శక్తికి మించిన.

నమ్మునిచంద్రున కర్ఘ్యపాద్యమ్ము
లిమ్ములఁ గావించి, యిలఁ జాఁగి మ్రొక్కి.
‘ ఘనతపోవైభవ, గాధేయ, నీవు
నను బ్రీతి మన్నించి, నాయాగమునకు
శ్రీ విలసిల్ల వేంచేసితి గాన
భావింప నీయాగఫల మబ్బె నాకుఁ.
బంపుఁ డేపనికైనఁ బరఁగఁ గావింతు,
నింపార మీమన సభీష్ట మెయ్యదియొ?’
యనిన, విశ్వామిత్రుఁ డా రాజుఁ జూచి—
‘ యనఘాత్మ, నీ కసాధ్యంబు లే పనులు?
కల్పవృక్షముకాయ క్రయ మడ్గినట్లు
లల్పదానం బొకం డడుగ వచ్చితిని.
అది చెప్పెదను విను, మధ్వరం బిపుడు
విదితంబుగాఁ జేయ వేడుక పుట్టెఁ.
బురుషుఁ డేనుఁగు నెక్కి పొడవుగా నిక్కి
వరరత్న మెగసి పోవైచిన పొడవు
ధనము రాశిగఁ బోసి దాన మిచ్చినను
జననాథ కొదవ లేక సాగ, నాయజ్ఞ
మ’ నినఁ, ‘గృతార్థుండ నైతి, నీయిష్ట
ధనమిత్తుఁ గొ మ్మ’ న్నఁ, దల యూఁచి యప్పు
డొడుపు దప్పినయట్టి యురగంబ పోలెఁ
దడయక వచ్చిన తనపూన్కిఁ దప్పి
‘ మనుజేశతిలక, నీమన సొత్తి చూడ
విన విస్మయంబుగా వేఁడితిఁ గాక,

ఇమ్ములన్ = చక్కఁగా.

నీవంటి గుణరత్ననిధి మాకుఁ గలుగ,
నేవేళ ధనరాసు లేమిటఁ గొదువ?
యింక మా యుత్తరం బిచ్చిన, నీకు
శంకరు నాన, త్రిశంకుని యాన.
పోయి వచ్చెద. నింక భూపాలచంద్ర,
యాయురారోగ్యంబు లయ్యెడి నీకు.'
ననుచుఁ గా లూఁదక యచ్చోటు వాసి
చనియె నమ్ముని నిజాశ్రమమున. కంత
నాహరిశ్చంద్రుండు నంతరంగమున
నూహించి, 'యిటమీఁద నొప్పమి పుట్టు.
వెసఁ బాముఁ జంపి పై వేసినరీతి,
మసలక పోయె, నమ్మలఁకల తపసి.
యాఁప నెవ్వరివశ? మమ్మహామహుఁడు
శాపించె నేని ముజ్జగములుఁ గాలుఁ.
బోయినజగడంబు పోవనిమ్మ'నుచు
నాయతశక్తి రాజ్యము సేయుచుండె.'

—.వింత ఘాతుక జంతువులు ఉప్పతిల్లుట.—

నట నంత నొక యుపాయంబు చింతించి,
కుటిలవిచారదక్షుఁడు గాధిసుతుఁడు,
చిత్రవర్ణంబులు చిత్రరూపములు
చిత్రలంఘనములు చిత్రసత్త్వములు
గల మహామృగముల ఘనపక్షితతుల
బలువడిఁ బుట్టించి, పంచిన, నవియు

మలఁకల=కపటపు నడతల. కుటిల = కపట. గాధిసుతుఁడు = విశ్వామిత్రుఁడు. లంఘనములు = దాఁటులు. సత్త్వములు = దేహ బలములు. బలువడిన్ = అతివేగముగా.

నొండొండ గదుపులై యుఱవడిఁ బఱచి
పండిన చేలెల్ల బయలుగా మేసి,
కొమ్ములఁ గట్టలు గ్రుచ్చి కోరాడి
చిమ్మి తటాకముల్ చెడ నవియించి,
మేటికాల్వల మిట్టమిఱ్ఱుగాఁ ద్రవ్వి,
తోఁటలఁ జెఱకుఁ దుత్తుమురుగాఁ జేసి,
మదమునఁ జెలరేఁగి మందలఁ బాఁడి
మొదవులఁ దిని, వృషముల బెట్టు విఱిచి,
పల్లెల మనుజులఁ బట్టి చెండాడ.—
హల్లకల్లోల మై యఖిలభూజనము
లడరి కూయుచు వచ్చి యా హరిశ్చంద్రుఁ
బొడ గాంచి, యందంద భువిఁ జాఁగి మ్రొక్కి,

—ప్రజలు హరిశ్చంద్రునితో మొఱ యిడుట.—

'భూమీశ, నీ రాజ్యమున నేఁటిదనుక
నేమార్గమున నెగ్గు లెఱుఁగ మెన్నండు,
నిల నవగ్రహదోష మెన్నఁడు లేక
వలసిన యప్పుడు వానలు గురియు,
మున్ను రాలిన ధాన్యములు మఱి మొలచి
పన్నుగా దున్నక పండు సస్యములు,
గోవులు పిదుకక కురియుచు నుండు
నేవేళ నైనఁ బాలేఱులు గాఁగ,

కదుపులై=గుంపులై. ఉఱవడిన్=వేగముగా. అవియించి=తెగఁ గొట్టి. తుత్తుమురు = మిక్కిలిచిన్నతునుకలు. మొదవులన్=ఆవులను. బెట్టు=మిక్కిలి. చెండాడన్=ఖండింపఁగా. హల్లకల్లోలము = తాఱుమాఱు, ఎగ్గులు=చెఱుపులు. అవగ్రహము=కఱవు.

జార చోరులు నవాచారులు లేరు,
మారి సంకటములు మరణముల్ లేవు,
విరసంబు తిరిపంబు వెఱపును లేమి.
మఱి యిప్పు డొదవిన మాపాటు వినుఁడి ;
యిన్ని చెప్పఁగ నేల? యిపు డొకలాగు
వన్నెల పులుఁగులు వాత్రైకంబులును
వీక్షింప వెఱపును వెఱఁగును గాఁగ
లక్షలు రెండేసి లక్షలుఁ గూడి,
మడి తోఁట కళ్లంబు మందప ట్టనెడి
యడియాసఁ బోకార్చి, యంతటఁ బోక
మసలి పల్లెలఁ జొచ్చి, మనుజులఁ బట్టి
మెసఁగఁ జొచ్చిన, నిండ్ల మెదలంగ వెఱచి,
వెసఁ గాఁపురంబులు విడిచి వచ్చితిమి.
వసుధేశ, రక్షింపవలయు ను. మ్మ'నినఁ,
గరుణామృతము చిల్కు కడగంటి చూపుఁ
బరఁగ వారలమీఁదఁ బరఁగించి పలికె.

## —హరిశ్చంద్రుఁడు ప్రజలకు అభయం బిచ్చుట.—

'నీపాటిపనికిఁ గా నేల భీతిల్ల?
రేపు మాన్చెద నంత ప్రేఁగును మీకు.'
నని మహీప్రజ నెల్ల నాదరం బెసఁగఁ
జనుఁ డని వీడ్కొల్పె జననాథుఁ. డంత

మారి=మసూరికారోగము. తిరిపంబు=బిచ్చము. వాత్రైకంబులు=అడవిపక్షులు. అడియాసఁ = ప్రత్యాశను. పోకార్చి = పోఁగొట్టి. పరఁగించి = నిగిడించి. ప్రేఁగును=కష్టమును.

## —రాత్రివర్ణనము.—

భవ చండతాండవ భ్రమణ వేగమున
దివినుండి పడిన యందియరయముఁ బోలెఁ
గిరణజాలంబుల కెంపు సొం పెసఁగ
నరుణబింబము పశ్చిమాంబుధిఁ గ్రుంకెఁ.
గొమరారు నభ మను కొలనిలో విరియు
కుసుమ జాలంబు బాగునఁ జుక్క లెసఁగె.
సురుచిర లీలమై సురరాజుదేవి
ధరియించు కర్పూర తాటంక మనఁగ
మెల్లనై నవ లొత్తు మించులఁ బొదలి
చల్లనై ప్రాచిన చంద్రుండు వొడిచె. 540
మనసిజుం డనియెడు మటుమాయ దొంగ
జనులపై మంత్రించి చల్లిన యట్టి
మోహన భస్మంబు మురువున విరహి
దాహక మై పర్వెఁ దళుక్కు వెన్నెలయుఁ.
బదపడి యుడురాజుపై దిననాథుఁ
డదె వచ్చె నని చెప్ప నరుదెంచురీతి

భవ = శివునియొక్క. చండ = ఉద్భటమైన. దివి = ఆకాశము. కెంపు = ఎఱుపుయొక్క. అరుణ = సూర్య. కొమరుఆరు = అందము మీఱుచున్న. సు రుచిర లీలమై = మిక్కిలిసొగ సైన విలాసముతో. సురరాజుదేవి = ఇంద్రభార్య యగు శచీదేవి. తాటంకము = కమ్మ. నవలు ఒత్తు = మొలకెత్తుచున్న. మించులన్ = కాంతులతో. పొదలి = వర్ధిల్లి. మనసిజుండు = మన్మథుఁడు. మోహనభస్మంబు = చొక్కుపొడి. విరహిదాహకము = విరహులనుకాల్చునది. పర్వెన్ = వ్యాపించెను. ఉడురాజు = చంద్రుఁడు.

వేగువాఁడునుబోలె వేగుఁజుక్క
బాగుగాఁ బొడిచినఁ బలపల వేగ.

—.సూర్యోదయము.—

నలిఁ దమం బనెడు దానవుమీఁద నలిగి
జలశాయి వ్రేసిన చక్రమో యనఁగఁ
కలువలు మూయ నక్షత్రము ల్మాయ
జలజము ల్వికసింప జను లుత్సహింపఁ
దఱుచు మెఱుంగులు తళతళ మనఁగ
నెఱిఁ దూర్పుఁగొండపై నిలిచె నాదిత్యుఁ.

—.వేఁట.—

డట మున్న మేల్కాంచి యా చక్రవర్తి
తటుకున నిత్యకృత్యము లెల్లఁ దీర్చి,
పాటించి కన్నులపండువు గాఁగ
వేఁట సింగారంబు వెలయఁ గావించి,
తనయుండు మంత్రియుఁ దనకూర్మిసతియుఁ
దనతోడఁ గూడి రాఁ దగు రథం బెక్కి,
చోఁఅమీసలును జాంజాఱుఁగొప్పు బిరుసు
వాలెడు మేనులు బరడుఁ బిక్కలును
జేవవిండ్లును నెఱ్ఱసెరల కన్నులును
జేవురుబొట్లును జిల్లకోలలును
మొల నీలికాసెలు మోటకత్తులును
దలముళ్లు బదనిక దండకడెంబుఁ

జలశాయి=విష్ణువు. చోఁఅమీసలు=చొఱ్ఱచేఁపమీసములవంటి మీసలు. బరడు=గఱుకులైన. సెరల=రేఖలుగల. చిల్లకోలలును=ఈఁటెలును. మోటకత్తులు=మడ్డుకత్తులు. తలముళ్లు = వేఁటకానిసాధనవిశేషము. బదనిక = చెట్టుమీఁద మొలచెడు నోషధి.

గలిగి, భయంకర కాలకింకరుల
పోలుపున గర్జించు పోలపర్లు గలసి,
కోదమసింగముఁ బోలు కుక్కలఁ దెచ్చి
కుదియించి బంగారుగొలుసులఁ బట్టి,
కడఁగి సింహము మీఁదఁ గవిసిన నయిన
నడుగు దీయక గుండె లవియ మోఁదుదుము.
పులి నైనఁ బైఁ బడి పొట్టేటివలెను
బలిమి మైఁ బొరలించి పట్టి వే యీడ్తు.
మెగసి మిన్నులఁ బాఱునిఱ్ఱుల నయిన
నిగిడి కూడఁగఁ బట్టి నేలకు నైతు.'
మని బంటుపంతంబు లాడుచుఁ గొల్వఁ,
జనియె నాతఁడు వింధ్యశైలంపుఁద్రోవ.
భల్లాతకీ పారిభద్ర మధూక
సల్లకీ కురవక సాల హింతాల
కుటజ కుచందన కుంభీ పలాశ
వట పీలు పాటలీ వజ్రి ఖర్జూర
ఖదిర శమీ బిల్వ కకుభాశ్వకర్ణ
బదరి తిందుక శింశుపా నక్తమాల

కాల=యము. పోలపర్లు=జాడలెఱింగినవారు. కుదియించి=మరలించి. భల్లాతకీ=జీఁడి - పారిభద్ర=దేవదారువు - మధూక=ఇప్ప-సల్లకీ=అందుగు - కురవక=గోరంట - సాల=మద్ది - హింతాల=గిఱకతాడు - కుటజ=కొండమల్లె-కుచందన=బుజపత్రి-కుంభీ=పినగుమ్ముడు-పలాశ=మోదుగు-వట=మఱ్ఱి-పీలు=గోలుగు - పాటలీ=మొక్కపుఁజెట్లు-వజ్రి=ఆకుజెముడు - ఖర్జూర=పేరీఁదు-ఖదిర=చండ్ర-శమీ=జమ్మి-బిల్వ=మారేడు - కకుభ = ఏఱుమద్ది - అశ్వకర్ణ = ఇనుమద్ది - బదరి=రేఁగు - తిందుక=తుమ్మికి - శింశుపా=ఇరుగుడు - నక్తమాల=కానుగు -

పాటలా తింత్రిణీ ప్రముఖవృక్షముల
గాటపుటడవులఁ గలసి రాఁ బ్రబలి,
మొల్లతీఁగెల నంటి ముడివడి యిసుకఁ
జల్లిన రాలక చల్లగాఁ బ్రబలు
వాకఁజప్పరములయం దినరశ్మి
లేక చీఁకటు లగ్గలించుచు నెఱయఁ,
* బోరుగాన నరిగిన పొలపరి దక్కఁ
బరు లెఱుంగని యొకపాటి కాఱడవి
నురవడిఁ జొచ్చి, బిట్టుతిమినక్రితి
మునువున శింజిని మ్రోయించి విభుఁడు,
పిడుగులకంటెను బెడిదంబు లైన
వెడఁదవాతులు గల్గు వివిధబాణముల
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు గొనఁగఁ
గటి గటిఁ గఱవ నొక్కట చేయుటయును;
బగలు భేరుండముల్ పదుశరభములుఁ
దెగుసింగములు జిఱ్ఱఁ దిరుగ నేనుఁగులుఁ
దూలుగండకములుఁ దునియు బెబ్బులులుఁ
గూలు నెల్గులుఁ దన్ను కొను మహిషములుఁ

పాటలా = కలిగొట్టు- తింత్రిణీ = చింత - ప్రముఖ = మొదలయినవి. గాటము = దట్టము. చప్పరములయందుఁ = పందిరులయందు. ఇనరశ్మి = సూర్యకిరణము. అగ్గలించుచుఁ = అతిశయించుచు. శింజినిఁ = అల్లె త్రాటిని. బెడిదంబులు = ఘోరములు. వెడఁద వాతులు = విశాలము లైన ముఖములు. గటి = ఒకయాలుగు జెక్క. కఱవఁ = తగులునట్లు. శరభములు = ఎనిమిదికాళ్ల మృగములు.

* 'పారిగాను నఱు గన్న పులుఁగులు దక్కఁ' అని పూర్వ పుస్తకములందు.

బోరలుదుప్పులు ధూళి బుఱ్ఱింగునిట్టులును
దెరలుసూకరములుఁ ద్రెళ్లు సివంగు
లొఱగుజింకలును బిట్టొఱలుమన్బిళ్లు
ముఱుఁగుగవయములు మఱియు నేఁదులును
నడఁగుజంబుకములు నై, యట్ట పొట్ట
దొడ మెడ బరి కాలు దోరంపుఁ జెవులు
గొరిసె వాలము మోర కొమ్ము లెమ్ములును
బరికించి వాడ నేర్పఱుపంగ రాక
కత్తులపచ్చడి గాఁ జేసినట్లు
తుత్తుమురై రూపు దోఁపక కలసి
నెత్తురు మడుఁగుల నెఱిఁ దేలి యాడ;
నత్తఱి గోఁతయు నలసట వొడమ,
వేఁటఁ జాలించి యా విపులాధిపుండు
వేఁటకాఁడ్రను జేరఁ బిలిచిన; నార్చి
వలలోనఁ బడఁ దార్చి వడి వధియించి
కలయ ఖండించియుఁ గాఁడ నేసియును,
లోవలు వెడలక లోఁగిన వాని
లోవక చొచ్చి లోలోనఁ గ్రుమ్మియును,
సురుఁగఁగఁ నడుగులచొప్పునఁ దగిలి
యురవడిఁ గుక్కల నుసికొల్పి కొల్పి
సందు గొందులఁ దప్పి చను మెకంబులను
బందిపోటులఁ బాటు పఱిచియుఁ; మఱియు

తెరలు = పలాయితములగు. త్రెళ్లు = కూలు. బిట్టు ఒరలు = మిక్కిలి కూలు. అట్ట = మొండెము. బరి = ప్రక్క. తోరంపు = పెద్ద. కాఁడన్ = నాటునట్లు. లోవక = వెనుదిరియక. సురుఁగఁగ = కనఁబడక పోఁగా. బందిపోటులన్ = దారియడ్డగించుటలచేత.

జాలె డేగల మంచిజావడంబులను
సాళువంబుల మంచి జలకట్టియలను
బెద్దసారణముల బెట్టుగా విడిచి
గ్రద్ద యులూకంబు కాకంబు కొఁజా
కొక్కెర బెగ్గురు కొంగ రాపులుఁగు
కక్కెర యాఁడేలు కన్నియలేడి
వెలిచెలావుక యాది వేర్వేఱుజాతి
పులుఁగుల నన్నిటిఁ బొరివుచ్చి; తనిసి
వేఁటఁ జాలించి, యుర్వీవల్లభునకు
మేటిపంతములును మేటిజల్లులును
గిరి వరాహ జ మౌక్తికములుఁ గస్తూరి
పసఁగ నిచ్చినఁ దనభామిని కిచ్చి,
పరువడి వారికిఁ బసదనం బొసఁగి;
సరసంబుగాఁ దనసచివునిఁ జూచి

—వ సి ష్ఠ స ం ద ర్శ న ము.—

'యరుదైన యీమహావ్యసనంబు కతనఁ
దర మిడి యంతయు దవ్వు వచ్చితిమి.
యిదె జాహ్నవీనది; యీచెంతఁ దపము
వదలక యొనరించు వరతపోధనుని
గురుని వసిష్ఠునిఁ గోరి దర్శించి
మరలి పోదము గాక మనపురంబునకు.'
ననుచు నజ్జననాథుఁ డా మంత్రివరుని
యనుమతితోఁ గూడి యచ్చటి కేఁగి,

జల్లులును = చామరములను. పసదనము = ఇనాము. సచివునిఁ = మంత్రిని. తరము ఇడి = మితి మీఱి.

యమ్మునివరుఁ గాంచి యడుగుల కెఱఁగి
సమ్మదంబునఁ గరజలజముల్ మొగిచి
యున్న. నారాజేంద్రు నుచితసత్కృతుల
మన్నించి మునిశిఖామణి యిట్టు లనియె
'ననఘాత్మ, పతి కతివ్యసనంబు వలదు.
మనువంశమునఁ బుట్టి మఱతురే నీతిఁ?
క్రూర మృగ వ్యాళ ఘోర నిశాట
భేరుండ సంచార భీకరం బైన
గహనభూములఁ గులకాంతయు నీవు
విహరించు టిది యవివేక మింతయును.
బురి కేఁగు. మిం కొక్క బుద్ధిఁ జెప్పెదను:
ఘోరము మెన్నఁడు గాధిసుతు తపోవనము.
జడలు గట్టుట వృథా శాంతి యాతనికి.
సుడుగక ముక్కున నుండుఁ గోపంబు.'

## —. కౌశికుని మాయామృగము. —

ననుచు వీడ్కొలుప.—విశ్వామిత్రుఁ డెఱిఁగి
మనుజేశు నలయించు మార్గ మూహించి,
తన తపోమహిమచేఁ దత్క్షణంబునను
మునిశిఖామణి జగంబుల లేనిదాని
ముత్తెంపుఁజిప్పల మురళించు మోము
క్రొత్తనీలపురంగు గులుకుకన్దోయి
పగడంపు నునుఁగెంపుఁ బచరించు చెవులు
ధగధగ మను పైఁడితళుకులమేను

వ్యాళ=పాములయు. నిశాట=రాక్షసులయు. గాధిసుతు = విశ్వామిత్రునియొక్క. అలయించు = శ్రమపెట్టు. మురళించు = తిరస్కరించు. పచరించు = ప్రసరింపఁజేయు.

దఱుచుమద్రజములతోఁ దడఁబడుతోడలు
మెఱుఁగుఁబచ్చలడాలు మీఱుగోరిసెలు
నెఱపువెన్నెలఁ గాయు నుదరంబుఁ గలిగి,
వెఱచిన గతి దిశల్ వీక్షించికొనఁగఁ,
జెలువును బలుపును జిగియును బిగియు
బలమును జలమును బటులంఘనములఁ
దత్తఱమును మేనితళుకును బెళుక
నుత్తమమణిరుచి నొప్పెడిపాదలు
మురువును బరువును ముదమును మదము
మురిపెంబు నొఱపును ముద్దును వింత
ఖచరంబు నచరంబు గబ్బును నుబ్బుఁ
బచరింప, వన్నెల పైఁడి మృగంబు
నలవడఁ బుట్టించి, 'యాహరిశ్చంద్రు
నెలయించి చయ్యన నిందుఁ దె. మ్మ'నుచుఁ
బంచిన; నిజదేహ భాసురప్రభలు
ముంచి దిక్కులఁ బర్వ మురియుచు నేఁగి
యాచిత్రమృగరత్న మమ్మహారాజు
లోచనోత్సవము గా లోలత నిలిచె.
నిలిచినఁ గనుఁగొని నివ్వెఱ వొంది
తల యూఁచి మెచ్చులు దలకొన, విభుఁడు

డాలు=కాంతి. జిగి=కాంతి. చలము=పట్టు. పటులంఘనములు=పెద్దదాఁటులు. మురువు=ఒప్పును. పరువు=పరుగెత్తుటయు. ముదము=ఉబ్బు. మురిపెంబు = ఒయ్యారము. ఒఱపును=సొంపును. ఖచరంబు=ఆకాశగతి. అచరంబు=చలింపకుండుట. గబ్బు=గర్వము. ఉబ్బు = ఉత్సాహము. ఎలయించి = ఆకర్షించి. మురియుచున్=కులుకుచు. లోలతన్=ఆసక్తితో.

'నియొప్పు గలదీని నిటు చూచి చూచి
యేమఁ బూనఁగఁ జేతు లేగతి నాడుఁ?
వేయుఁ దెలంగుల వెనుకొని పట్టి
యీయిట్టి నిచ్చెద నీకొమారునకు.'
ననుచు సారథిఁ జూచి 'యీపైఁడి మృగము
మనసు లోఁబడునట్టి మతముఁ జింతించి,
క్రిందట గాలిగాఁ గేడించి రథము
నందుపాటుగఁ దోలు. మ'నుచుఁ దోలించి
కదియఁ బోవుటయు; నక్కపటమృగంబు
బెదరి పట్టీక కుప్పించి బిట్టెగసి,
చెరలాడు, జిరకొట్టుఁ, జెలఁగి పేరెంబు
దిరుగుఁ, బర్విడుఁ దీఁగె దీసినరీతి,
గిరగిర మై ద్రిప్పుఁ, గొరలు నల్గడల,
ఖురముల నౌదలఁ గోఁకి కేడించు,
బరులతీటకుఁ దరుపంక్తితో నొరయు,
మరిగిన గతిఁ జేరి మలయు నంతంత,
నెఱిఁ గల్వరేకులు నెఱపినపోల్కి
వెఱపునఁ దవనీడ వీక్షించి దాఁటుఁ,
గుఱుచవాలముఁ ద్రిప్పుఁ, గొమ్ముల బయలు
చిఱిమి చిత్రములు గాఁ జిమ్ము. నీరీతి
నెడపక నారాజు నెలయించికొనుచు
వడిఁ గౌశికుని తపోవనము సొత్తెంచి

కేడించి=తొలఁగించి. జిఱకొట్టున్=జిఱ్ఱునఁ దిరుగును. పేరెము=పరుగు. ఖురములన్=గొరిజలతో. ఔదలన్=నెత్తిని. బరుల=ప్రక్కల. వాలము=తోఁక. సొత్తెంచి=ప్రవేశించి. మోసపుచ్చి.

కనుఁబ్రామి పోఁ జూచు కపటమృగంబు
మనుజేశుఁ డలుక నెమ్మనమునఁ గదురఁ,
గోదము నాగముఁ బోని కోల మిణుఁగుఱులు
చెదరంగఁ దొనఁ దీసి శింజినిఁ దొడిగి
తెగ గింగు రనఁ బాపి దృష్టి సంధించి
తెగ నేయుటయు; దానఁ దెగక యామృగము
వడి నెత్తుటను దోఁగి వడఁకుచు గాధి
కొడుకు ముందటి కేఁగి గొబ్బున నడఁగె.
నప్పార్థివేంద్రుండు నమ్మాయమృగము
ద్రిప్పల నడవులఁ ద్రిమ్మరి యలసి,
వదనపద్మంబు కైవ్రాలంగ, దప్పి
గదిరి, చల్లనినీటికందువ నరసి,

—. కౌశికుని యాశ్రమము. —

పని చని, ముందటఁ జంపకంబులను
బనసల నిమ్మలఁ బాటలంబులను
సురుగుల్ల మాఁకెల్లఁ జూతపోతములఁ
గురవకంబులఁ గేదఁగుల నశోకములఁ
బొగడలఁ బొన్నలఁ బోఁకమ్రాఁకులను
బొగ డొందు ఖర్జూరములఁ జందనములఁ
బల్లమామిళ్లఁ గర్పూరభూజముల
నల్లనియరఁటుల నారికేళములఁ
గమ్మరేఁగులను బ్రేంకణముల నలరుఁ
గొమ్మలఁ బెనఁ గొన్న కొదమద్రాక్ష

కనుఁబ్రామి=మాపును. కోలన్=బాణమును. తెగ=ఆకర్షణము. తోఁగి=తడిసి. కైవ్రాలంగన్=సోలఁగా. గాధికొడుకు=విశ్వామిత్రుని. చూతపోతములన్=మామిడిగున్నలచేత. అలరు=పూవు. కొదమ=లేఁత.

తీఁగెల గురివెందతీఁగెల జాజి
తీఁగెల మిరియంపుఁదీఁగెల నాగ
వల్లీల నైలా లవంగాది లతల
మల్లికాలతల సంపద లొప్పు పొదలఁ
జల్లని నీడల జాతివైరంబు
లెల్లను విడిచి పేరెలమితోఁ బొదలి,
కొదమ సింగములను గోరి తుండముల
ముదమున నొయ్యనఁ బుడుకు నేనుఁగులు,
వాని చెక్కుల తీట వక్ర నఖాళిఁ
బూని గీఁకుచు నున్న పులులును, వాని
కూనలకును జన్నుఁ గుడిపెడు లేళ్లు,
వానితోఁ జెలులాడ వచ్చు రేఁచులును,
వానితోఁ గ్రీడించి వలులు ముంగిసలు,
వానితోఁ బ్రాఁకెడు వర పన్నగములు,
వానికి నీడగా వ్రాలు నెమళ్లు,
వాని వీఁపుల మీఁద వచ్చు పిల్లులును,
వాని ప్రక్కలఁ గూర్కు వర మూషికములు,
వీనుల కెంతయు విన నింపు గాఁగ
సామగానంబులు సలుపు కోయిలలుఁ,
గామించి మినుకులఁ గఱపు చిల్కలును,
గలయఁ గమ్మని యాజ్యగంధముల్ మేన
నొలయంగ వెదచల్లు హోమధూమములుఁ;
గలుగు విశ్వామిత్రు ఘనతపోవనము

పొదలన్ = పొదలయందు. మినుకులన్ = వేదములను. కఱపున్ = నేర్పెడు. కలయన్ = అంతటను. ఒలయంగన్ = వ్యాపించునట్లు.

* 'సామంబు లలవడఁ జదువు కోవెలలు' అని పూర్వపాఠము.

వల నొప్పఁ జొచ్చి; యా వనమధ్యమునను
గమనీయ విలసిత కమల కల్హార
కుముద నీలోత్పల కుసుమ సుగంధ
మధుకర మిథున సమ్మదకర మృదుల
మధుతర సంగీత మహిత తరంగ
లలిత డోలాకేళి లాలస చక్ర
కలహంస బక బిసకంఠికా క్రౌంచ
సరసటిట్టిభ మదసారస ప్రముఖ
వర జలఖగ కుల స్వనములు పెంపెసఁగ,
సార లామజ్జక జలద కర్పూర
సౌరభ వాసిత సలిలమై చైత్ర
దర్పిత వనదేవతా కర స్ఫటిక
దర్పణంబును బోలెఁ దనరారుచున్న,
కొలను గనుంగొని; కువలయేశ్వరుఁడు
లలనయుఁ దాను నల్లనఁ దేరు డిగ్గి,
కరతలంబున మంత్రి కర మూఁదుకొనుచు
సరసిలోపలఁ జొచ్చి, జలములు గ్రోలి,
యవగాహ మొనరించి, యాతీరభూమి,

కల్హార=ఎఱుపు తెలుపు కలిసిన కలువలు. కుముద=తెల్లగలువలు. ఉత్పల=కలువలు. మధుకరమిథున = తేఁటిదంపతులయొక్క. మధుతర=తేనెను మించిన. డోలా=ఉయ్యెల. లాలస=ఆసక్తమైన. చక్ర=చక్రవాకములు. బక=కొంగలు. బిసకంఠికా = పెంటికొక్కెరలు. టిట్టిభ=లకుముకులు. సారస=బెగ్గురు. ఖగ=పక్షులయొక్క. స్వనములు=ధ్వనులు. లామజ్జక=వట్టివేళ్లు. జలద=ముస్తెలు. దర్పిత=గర్వించిన. దర్పణ=అద్దము. కరతలంబునఙ్=అఱచేతితో. సరసి = చెఱువు. గ్రోలి=త్రాగి. అవగాహము = స్నానము.

నవకంపుఁ బొన్నల నడుమఁ జెన్నారు
సురుఁగులతోఁ బ్రాఁకి చుట్టు రాఁ బ్రబలి
పరపైన గురివెంద పందిటి క్రింద,
నొఱపైన చిగురాకు లొనరించి తీర్చి
పఱచిన మృదువైన పానుపుమీఁదఁ,
దిలకించి చంద్రమతీదేవి తొడలు
తలఁగడ గాఁగను దగ విశ్రమించి;
మరువంపుఁ గొనల నమర్చినయట్టి
సురఁటి వట్రువ గాలి సుడియంగఁ ద్రిప్పు
తన మంత్రివరు మోముఁ దప్పక చూచి,
'కనుఁగొంటివే యిందుఁ గల విశేషములు?
వెఱఁగును వెఱపును వేడ్కయుఁ బెనిచి
వఱలు; నేముని తపోవన మొకో?' యనుచు
ననఁగఁ; బండ్లను గోయ నచ్చోటి కొక్క
మునికుమారుఁడు వచ్చి మునిసింహుఁడైన
యా గాధినందను నాశ్రమం బనిన;
వేగంబ వదనంబు వెలవెలఁ బాఱి,
'యేడ వన్నెల మృగం! బెక్కడి వేఁట!
యీడకు వచ్చితి! మిది మోస మయ్యె!
* గురుఁడు వసిష్ఠుండు గురుమతి నాకుఁ
బరఁగంగఁ జిలుకకు బలె బుద్ధిఁ జెప్పి
పొమ్మన్న, నూరికిఁ బో నేరనైతి
మిమ్ముల? విధి దాఁట నెవ్వరివశము?

సురుగులతోఁ = సురిగితీఁగలతో. పరపు = విరివి. ఒఱపు = అందము.
తిలకించి = చూచి. సురఁటి = వట్రువవిసనకఱ్ఱయొక్క.

* 'గురుమతి నాకులగురు వసిష్ఠుండు' అని పూర్వపాఠము.

పలుకు లేటికి? మహాప్రళయంబు వచ్చెఁ!
దలఁగ మైతిమి వేఁటతమకంబు కతన!
నేమి సేయుదు! మింక నేది విచార!
మా మహామునివరుఁ డలుగక మున్నె
పొడగాంచి మ్రొక్కంగఁ బోదమో? లేక,
వెడలి పోదమొ కడు వేగమె పురికి?'
నని యిట్లు చింతింప నా సత్యకీర్తి
తన నేర్పు మెఱసి భూధవున కి ట్లనియె:—
'నేల యీ తలపోఁత లినకులాధీశ?
పోలించి చూడుమీ బుద్ధిఁ గార్యంబు.
మనసులు చల్ల నై, మదమత్సరములు
మునుపడ దిగనాడి, మోహంబు విడిచి,
పొగడినఁ దెగడిన ముదముఁ దాపంబు
నిగుడక, నడవుల నిలిచి యెం తేని
కూరలు గాయలుఁ గూడు గాఁ గుడిచి
వారక తపసు లై, వర్తించునట్టి
వారికి మనతోడ వైరంబుఁ బూని
పోరాడ నేధనంబులు పొత్తు వోవు?
సంతాప మంద విశ్వామిత్రుఁ డకట!
యింతకు మున్న మీ కె గ్గేమి సేసెఁ?
జన భవజ్జనకుఁ ద్రిశంకు భూపాలు
ననుపఁడే బొందితో నమరేంద్రు పురికి?
వలదు మీ కిది లేని వట్టి దుశ్చింత ;
దలఁకక యొక్కింత తడవు నిద్రింపు.'

తమకంబు=ఆసక్తి. తలఁగము=తొలఁగము. మునుపడఁగా=ముందుగా. పొత్తులు పోవు=పాలు పోవు. తలఁకక=భయపడక.

మని కార్య మేర్పడ నాడిన మంత్రి
వినుత వాక్యంబులు విని సంతసిల్లి,
కలఁగిన చిత్త మొక్కటిగా సమర్చి,
యెలమి కఙ్ మోడ్చి యొక్కింతయుఁ గూర్కి;

—. హరిశ్చంద్రుని చెఱుకల.—

చెప్ప నూఁకొన వినఁ జింతింపఁ జాల
నొప్పని కలఁ గాంచి, యులుకుచు లేచి,
విన్న నై దిక్కులు వెదకి వీక్షించి,
కన్నీరు దొరఁగ నంగము గంప మొంద
మానక వడఁకు నమ్మనుజేంద్రుఁ జూచి,
మానినీమణి చంద్రమతి సంభ్రమమునఁ
దరుణ పల్లవ కాంతి దఱుకొత్తు ముద్దుఁ
గరమునఁ జెలు వొందఁగా వీఁపుఁ జఱచి,
నూత్న మయూఖ మనోహరం బైన
రత్నకంకణ మూడ్చి రక్షగాఁ గట్టి,
'యిది యేమి! నాథ, నీ వెన్నఁ డెఱుంగ!
వదరి మేల్కొని వెఱఁ గందెద విట్టు!
లంతకుం డఱు ద్రొక్కి యదిమినయట్టి
జంతువు నైనను సత్కృపఁ గాచు
పరహిత రతుఁడవు, భాస్కరవంశ
శరనిధి పూర్ణిమా చంద్రుండ, వసమ
దుర్వార బల గర్వ దుష్టవిరోధి
పర్వత వజ్రి వై బాహుదర్పమున

తరుణపల్లవ= లేఁతచిగురుయొక్క. నూత్నమయూఖ=క్రొత్తకిరణములచే. అంతకుండు=యముఁడు. అఱు = మెడను. భాస్కర=సూర్య. శరనిధి = సముద్రమునకు. వజ్రివి = వజ్రాయుధముగల యింద్రుఁడవు.

సర్వసర్వం సహా చక్ర మంతయును
నిర్వక్రముగ నేలు నీ కేల వెఱవ?'
నని తన్నుఁ దెలిపెడి యాపువ్వుఁబోఁడిఁ
గనుఁగొని యా రాజకంఠీరవుండు
'కలకంఠి కొఱగాని కల గంటి నిపుడు.
తెలియఁ జెప్పెదఁ దాని తెఱఁ గెల్ల: నేను
గోమ రొప్పఁగాఁ బెద్ద కొలువుఁ గూటమున
రమణులు వింజామరంబులు వీవఁ
గొలు వున్నతఱిఁ, గోప ఘూర్ణిత నేత్రుఁ
డలఘు తేజో ధనుఁ డగు విప్రుఁ డొకఁడు
తడయక వచ్చి నా తల కిరీటంబుఁ
బుడమిపైఁ బడఁ గోపమున బిట్టు దన్నెఁ;
దన్ని యంతటఁ బోక తలఁ బట్టి యీడ్చి
నన్ను నుద్ధతిఁ ద్రోచె నగరంబు వెడల.
నది యాది గా దైన్య మడరి యందంద
పొదవు నాపదలచేఁ బొక్కి క్రమ్మఱను
నిటలాక్షు కరుణ ననేక కాలంబు
పటుతర రాజ్యవైభవ మందఁ గంటి.'
నని యిట్లు దుస్స్వప్న మధిపతి సెప్ప,
విని చాల వెఱచియు వెఱవని రీతి,
"నిచ్చను జింతింప నేటికి మీకుఁ?
జెచ్చెరఁ గల విప్పి చెప్పెద, వినుఁడి.

సర్వంసహా=భూ. ఘూర్ణిత=సుడివడుచున్న. బిట్టు= మిక్కిలి. ఉద్ధతిన్=గర్వముతో. అడరి=కలిగి. పొక్కి=దుఃఖించి. నిటలాక్షు కరుణన్=శివునికృపచేత.

యాలుకమై వచ్చిన యా విప్రవరుఁడు
తెలపోయఁగా గాధి తనయుఁ; డాతండె
మఱి నేలఁ బడఁ దన్నె మకుటంబుఁ గానఁ
జెఱిచి యాతఁడు మనసిరిఁ దొలఁగించు;
నది కారణంబు గా నలజడి నొంది
పదపడి మనరాజ్య పదవి నొందెదము.
గావున నెటువంటి ఘనులకు నైన
భావింప నిత్యసంపద లెట్లు గలుగు?
'ధర్మ మెయ్యెడ నైనఁ దనుఁ గాచు' ననెడి
నిర్మల వాక్యంబు నీ బుద్ధి నిలిపి,
సత్యంబు దప్పక చరియింపు; మవని
నిత్యంబు లన రాదు నిఖిల సంపదలు.''
అని చంద్రమతి తన యాత్మేశుచింత
ననునయించుచు నుండె నచ్చట. నంత

—. మాతంగకన్యలు .—

మఱియుఁ గౌశికుఁ డొక్క మతముఁ జింతించి,
నెఱి నంద మై నల్ల నెఱసిన కురులుఁ,
గొఱనెలయొఱపుఁ గై కొన్న ఫాలములు,
జెఱకు సింగిణి వింట్లఁ జెనకెడు బొమలు,
బేడిస తళుకుల బెడఁగుఁ గన్నులును,
దాడిమీ బీజ సుందర దంతములును,
నిరుపమ తిలపుష్ప నిభ నాసికలును,
సురుచిర బింబ విస్ఫురి తాధరములు,

అలజడి=కష్టము. అనునయించుచుక్ = ఊఱడించుచు. నెఱసిన = నిండిన. కొఱనెలయొఱపు = అర్ధచంద్రునియందమును. బెడఁగు= అందము. బింబ=దొండపండువలె.

మించు టద్దములతో మెఱయు చెక్కిళ్లు,
మంచి వెన్నెల వంటి మందహాసములు;
సలలిత శ్రీకార సదృశ కర్ణములు,
నలరు శంఖముల బాగలవడు మెడలు,
బిసకాండములఁ దలఁపించు బాహువులుఁ,
గిసలయంబుల సొంపు గెలుచు హస్తములుఁ,
గరి కుంభముల చెన్ను గల చన్నుఁగవలు,
నరు దారఁ బిడికిట నడఁగు మధ్యములు,
సుడులకుఁ దెరువులు సూపు నాభులును,
గడఁగి సైకతములఁ గడచు పిఱుందు,
లనఁటి కంబముల గయ్యాళించు తొడలు,
ననవిల్తు శరధుల నగెడు జంఘలును,
బయలుఁదామరలఁ గీడ్పఱచు పాదములు,
నయ మారఁ గల్గి క్రొన్నన విలుకాని
మరగించు మోహన మంత్రదేవతల
మురువునఁ ద్రైలోక్య మోహిను లైన
తరళలోచనల మతంగకన్యకల
నిరువురఁ బుట్టించి; యి ట్లని పలికె:—
'మీరు విభ్రమములు మెఱయంగ నేఁగి,
సార్వభౌము హరిశ్చంద్రునిఁ గాంచి,

శ్రీకార = శ్రీయను నక్షరమునను. బాగు అలవడు = సొంపు గల. బిసకాండముల = తామరతూండ్లయొక్క. కిసలయంబుల = చిగుళ్ల యొక్క. కరి = ఏనుఁగు. సైకతములన్ = ఇసుకదిన్నెలను. కడచు = అతిక్రమించు. ననవిల్తు శరధులన్ = మన్మథుని యమ్ములపొదులను. క్రొన్ననవిలుకానిన్ = మన్మథుని. మరగించు = ఆసగొల్పునట్టి. తరళ = బెళుకుగల. మతంగ = మాల. విభ్రమములు = విలాసములు.

యాటలఁ బాటల నమృతంబు లొలుకు
మాటలఁ దేటల మరపి మెప్పించి,
యీరాని వస్తువు లే మైన వేఁడి,
కారించి, తాలిమిఁ గలఁచి, బొంకించి,
చనుదెందు.' నావుడు; సంభ్రమం బెసఁగఁ
బనిఁ బూని, కౌశికు పదముల కెరఁగి,
కలికి రాచిల్కలో, కాయజు నల్ల
గలువ పూఁదూపులో, కవ గూడి మెలఁగు
నీలంపు బొమ్మలో, నెఁత లై మించు
లాలిత తాపింఛ లతికలో, యనఁగ,
మదహంస గతులను మఱపించు నడలఁ
గదలు మట్టెలు తాళగతులకుఁ దాఁక,
రతి నాయకుని యాజ్ఞ ఱంతుగాఁ జాటు
గతి నందియలు గల్లు గల్లున మ్రోయ,
మొలనూళ్ల గజ్జెల మ్రోఁతకు రత్న
కలిత కంకణములు గమకంబు సూప,
దంత కుందంబుల తళుకులు మెఱసి
వింతగాఁ జెక్కుల వెన్నెలల్ గాయ,
రాజిల్లు నునుఁ బట్టు ఱవికల మీఁదఁ
దేజామై నాణి *ముత్తెపుఁ బేరు లమరఁ,
దెలిమోము లర దోఁపఁ దిగిచిన కావి
జిలుఁగు ముసుంగులోఁ జెంగల్వ రేకు

మరపి = మరగించి. కారించి = బాధించి. తాపింఛ = చీఁకటిమాని. ఱంతుగాక్ = బిగ్గరగా. అర = సగము. తోఁపక్ = కనఁబడ.

* 'ముత్యపు' అని పూర్వముద్రణముల పాఠము.

లాసపరిగా దోఁపి యున్న కల్హార
కుసుమ గంధంబు లాగుబ్బఁగా నోలయఁ,
మృదుల గోరోచన మృగనాభి సంకు
మద విమిశ్రిత వక్త్ర మలయజ తిలక
నవ ఘుసృణకణముల నఖరాంకురముల
నివురుచు, సాంజన నేత్రాంచలముల
సోలపునఁ బోవుచు, సోలి యంతంత
నిలుచుచుఁ, జను దెంచి, నృపవరుఁ గాంచి;
'రాజ, హరిశ్చంద్ర, రాజ దేవేంద్ర,
రాజీవహిత కులార్ణవ పూర్ణచంద్ర,
దిక్కులవా రెల్ల దేవరకీర్తి
వెక్కసంబుగఁ జెప్ప విని, చూడఁ గోరి,
పని విని నేఁడు మా భాగ్యంబు కతనఁ
గనుఁగొంటి మిటు భవత్కళ్యాణమూర్తిఁ.

—. మాతంగకన్యలు వీణ వాయించుట .—

దివిరి మీకృప నేర్చితిమి వీణె మీట.
నవధారు నృప; చిత్త, మవధారు దేవ.'
యని సన్నుతించుచు, నా కళావేది
మనసు వేడుక గని, మాతంగ సతులు

అగుబ్బఁగాన్ = అధికముగా. ఒలయఁగాన్ = వీవఁగా. మృగనాభి = కస్తూరితోను. సంకుమద = జవ్వాజితోను. మలయజ తిలక = చందనపుఁబొట్టుయొక్క. సాంజన=కాటుకతోఁగూడిన-నేత్ర=కనులయొక్క - అంచలముల = కొలుకులయొక్క - సోలపునన్ = పారవశ్యముతో. రాజీవహితకుల = సూర్యవంశమునెడి. పనివిని = వచ్చి. అవధారు = చిత్తగింపుము. కళావేది = సంగీతాదివిద్యలు తెలిసినవానియొక్క.

పవడంబు గల మంచి పసిఁడి వీణియల
గవుసెనల్ వెడలించి, కాంతి రాఁ దుడిచి,
బాగుగాఁ గుచములపై మోపి, తగిన
రాగసంగతులకు రా సారె లొత్తి,
తుదగోటికొనలఁ దంత్రులు గూడ మీటి,
ముదమున జీవాళి మొఱయఁ బట్టించి,
నవరత్నకాంతులు నన లొత్తు క్రొత్త
రవల కంకణముల రవగవ లెసఁగ
నలరు నంగుళుల నల్లార్చుచు, వీణె
వెలయ వాయించి ప్రవీణతఁ జూపి;
మఱి మయూరాదులు మహి నెలుఁగింపఁ
బరఁగు షడ్జాది సప్త స్వరంబులును,
గ్రామత్రయమును, మూర్ఛనలు ముయ్యేడు,
నా ముప్పదియు రెండు నైన రాగములుఁ,
వాని మిశ్రంబులు వాని భేదములు
వానికి వేళలు వరుసతోఁ దెలిసి,
తగ మంద్ర మధ్యమ తార మానముల
మొగియు గాయక దోషములు దొలఁగించి
యాలాపములు సేసి, యా రాజుమీఁది
సూళాదు లింపులు సొగయఁ బాడుటయు;
నా నవ్య మైన గీతామృత లహరి
నూని మహాశ్చర్య మొదవె నవ్వేళ,
మురయుఁ వీణాదండమును జిగు రొత్తె,
నిరుపమ హార మాణిక్యముల్ గరఁగె,

సారెలు=మెట్లు. జీవాళి=జీవాళము. మయూర=నెమళ్లు. సొగియఁగా=చొక్కునట్లు. నవ్యము=అపూర్వము. లహరి=ప్రవాహమును.

పలఁకుల వ్రాసిన వన్నె చిత్రములు
దలలు గదల్పఁ * జైతన్యముం బొరసి;
క్షోణీవిభుండును క్షుధ దీఱినట్లు
రాణించుటకు ననురాగంబు నొంది,
వేయు భంగుల రసావేశంబు దాల్చి,
'మాయురే!' యని పలుమాఱును మెచ్చి,
మరకత నీల నిర్మల పుష్యరాగ
వర వజ్ర విద్రుమ వైడూర్య లలిత
కురువింద మౌక్తిక గోమేధికములఁ
గర మొప్పు సొమ్ములఁ గనకాంబరములఁ
జెలువారు నునుఁబట్టుఁజీరలు జీబు
వలువలు వీడెంబు వన్నె పుట్టములు
బుగబుగ వలచు కర్పూరంబుఁ బునుఁగు
నగరుగందముతో సమస్తంబు నిచ్చి,
యాదరం బెసఁగఁ బొమ్మనుటయు; నవ్వి,

—. మాలెతలు రాజును వలపింపఁ గడంగుట. —

మేదినీవిభునకు మెలఁత లి ట్లనిరి.—
'ఈరత్నభూషాదు లేటికి మాకు
నీరువ ట్టాఱునే నెయి ద్రావికొనిన!
నింగితం బెఱుఁగని దే జాణతనము!
మంగళ శృంగార మహిమావతార,
దండి తేజమున మార్తండ మండలము
మండుచున్నది నభో మధ్య భాగమున;

పొరసి=పొంది. పలఁకులఁ=దిక్కులందు. మాయురే=సెబాసు. జీబువలువలు=కట్టుకోకలు. ఇంగితంబు=మొగముజాడ.

* 'జైతన్యతం బొదలి' అని పూర్వపాఠము.

మిట్టించి వేఁడిమి మిటమిటఁ గాయఁ
గట్టెం డతాఁకునఁ గములె దేహంబు;
లడుగులఁ జెఱుపొక్కు లడరె; వాతెఱలఁ
దడి లేదు; మేనులఁ దాపంబు వొడమె;
నడచిన నొడలఁ బ్రాణము లుండ వింక;
గొడు గిచ్చి రక్షింపు కువలయాధీశ;
యుచితసవాలకు లొం డొల్ల మేము;
పచరణ గాదు, మీ పాదంబు లాన.'
యని పల్కఁ; మనసు * దిగ్గని విగ్గి రోసి
మనుజేశుఁ డా మాల మగువల కనియె: —
' మును సిరి వచ్చిన మోఁకాలి నొగ్గు
ననువున నాత్యాగ మందక మీరు
పొం దెఱుంగక వేఁడఁ బోలునే? † పొసఁగ
దందనిఫలముల కట్టుంలు సాఁప.
నొనర మహారాజ యోగ్యంబు లైన
వినుత వస్తువు లేడ? విద్యవా రేడ?
లేరా విద్యలవారు? లేరా భూనాథు?
లీరీతి వేఁడిరో? యిచ్చిరో తొల్లిఁ?
గోరెడివారికిఁ గొఱఁత లెం దుండు?
నీ రాని వస్తువు లీ రాదు. గానఁ
దనుతాపములు మాన్పఁ దని మైన వానిఁ
గొనుఁ, డిత్తు, నీ వెలిగొడుగును దక్కఁ.'

మిట్టించి = ఎగిరిపడి. వాతెఱలఁ = పెదవులందు. పచరణ = నటన. దిగ్గు - అనుకరణశబ్దము. తను = దేహ.

---

* 'నెగ్గని' † 'పొసఁగ నందని' అనియు ఖా. ము. పా.

ననుటయు; — నా మాట కలరి యారాజుఁ
గనుఁగొని మాతంగ కన్య లిట్లనిరి. —
'కమలినీ మలయజ కర్పూర హార
కమనీయ కల్హార కదళీ మృణాళ
హిమజల వాలుకా హిమకర కాంత
కుముదాప్త చందన కుధర సమీర
ధారాగృహాదులఁ దనువునఁ గొంత
వారింప వచ్చు దివాకరు వేఁడిఁ;
దిరముగాఁ గరసానఁ దీడిన వాఁడి
మరుని పూఁదూపుల మర్మముల్ గాఁడి
విరవిరఁ బోవుచు విరహాగ్నిఁ గుందు
కరిగమనలకు నీ కౌఁగిటిపొందు
గళ కలరవ రవ గతులకు విందు.
బలియు తాపము డిందు పడ నదే మందు.
నృపవర, సూనృతనియతిఁ బెం పొందు
తపమున మముఁ బొందు; నీ కిదే సందు.' —
అనిన వీనులు మూసి యమ్మహీవిభుఁడు
గనలుచు నా నీచకాంతల కనియె. —

కమనీయ = మనోజ్ఞమైన. కల్హార = ఎఱుపు గలిసిన తెలుపు గల కలువలు. మృణాళ = తామరతూండ్లు. హిమజల = పన్నీరు. వాలుకా = ఇసుక. హిమకరకాంత = చంద్రకాంతశిలలు. కుముదాప్త = చంద్రుఁడు. చందన కుధర సమీర = మలయ పర్వత మారుతము. కాఁడి = గ్రుచ్చుకొని. గళ కలరవ రవ గతులకున్ = కంఠమందలి పావురపు ధ్వనుల (మణితముల) ప్రచారములకు. విందు = బంధువు. డిందు పడన్ = తగ్గుటకు. సూనృత = సత్య. కనలుచున్ = కోపగించుచు.

* 'గళ కలరవ గతి గతులకు' అని పూ. ము. పా.

‘ విద్యావారని మిమ్ము విడనాడ కున్న,
మద్యపానమున నైన మఱచి పల్కెదరు!
మిముఁ జూడఁగా రాదు, మిము ముట్టఁ గాదు,
మిముఁ బొందు మన నెట్లు మీకు నోరాడె!
నడుగ వచ్చిన నంద మణుమాత్ర మైనఁ
బొడమదు మీయందు బుద్ధి నూహింపఁ.
గరుణనైన నీ తప్పుఁ గాచితి; నింక
నరుగక దుర్భాష లాడితి రేని
వాలిన కిన్కనైన వాలు నీ వాఁడి
వాలున జిహ్వలు వాలుతు.’ ననినఁ;—
జందనగంధులు చలము రెట్టింప
మందె మేలమున నమ్మునిఁ జేరుఁ దున్న
సురపొన్న నీడను బ్రక్కకు డాసి,
సరస కేళీ సరోజములఁ ద్రిప్పుచును,
గివిరి క్రేగన్నుల దీప్తులు నిగుడ
శ్రవణ భూషణములఁ జక్కఁ ద్రోయుచును,
కమనీయ కక్ష భాగ ద్యుతు లెసఁగఁ
గొమరారు మొగలి రేకులను జెక్కుచును,
మెఱుఁగుఁ జన్నులు దోఁప మించుఁ బయ్యెదల
చెఱఁగులు దీసి లేఁజెమరు లార్చుచును,
వాలారుఁ గొనగోళ్ల వన్నెలు నిగుడ
నీలాలకంబుల నెఱులు దీర్చుచును,

పొడమదు = లేదు. వాలిన = అతిశయించిన. కిన్కమైన్ = కోపముతో. వాలునన్ = కత్తితో. వాలుతున్ = వాలఁ జేయుదును. మందెమేలమునన్ = చనవుతో. వాలారు = వాఁడి. నీల అలకంబులు = నల్లని ముంగురులయొక్క - నెఱులు = వంకరలను.

జిందులు ద్రొక్కుచుఁ జెలఁగి నవ్వుచును,
గ్రందుగాఁ గరతాళగతుల నాడుచును,
బహువిధ విభ్రమ భంగు లేపార
మహనీయ యౌవనాస్వాదమ్ము దనర
నరి గ్రమ్మి మఱియు ని ట్లనిరి.—'నరేంద్ర,
గిఱికొన్న ప్రేమ భోగినులఁ గామంబు
వెలయంగఁ గైకొని వివిధసౌధములఁ
జెలువారుచున్న పసిండి యుయ్యెలలఁ
బరఁగ నాగర కూర్మ పద్మక ప్రముఖ
సురత బంధంబుల సారిదిఁ బెనంగి,
కళ లున్న గుఱుతులఁ గరఁచి చొక్కించి,
వెలలేని సుఖముల వేడ్కఁ గై కొనుఁడీ.
ఈతడ వేటికి? నీకీఁగయింటి
కేతేర నిది వేళ, యేల రా? వ' నుచు,
వర మణిముద్రికా వలయ కేయూర
సురచిరం బగు మహీశుని వలకేలిఁ
బల్లవ కోమల పాణిపద్మముల
నల్లనఁ దెమలింప నాస సేయుటయుఁ;—

—. రాజు మాలెతలను దండింపఁ గడంగుట.—

దెలిదమ్మిరేకులఁ దెగడు నేత్రములఁ
జిలుఁగుఁ గెందమ్ముల జిగి తొంగలింప,
సైరణ దొలఁగి పిసాళి మాలెతల
వారింతు, నని పూని, వసుమతీ విభుఁడు

క్రందుగాఁ=ఎడలేకుండ. భంగులు=ప్రకారములు. అరిగ్రమ్మి = అడ్డగించి. గిఱికొన్న=స్థిరమైన. భోగినులఁ=భోగమువారమైనమమ్ము. పెనంగి=కూడి. ముద్రికా=ముద్దుటుంగరము. పిసాళి=టక్కుల.

బాలనాగమువోలెఁ బరఁగు పసిండి
కీలుసమ్మెటఁ గేలఁ గీలించి, సతుల
తనువులు జర్జరితములుగా వ్రేయఁ
ఘన సంభ్రమంబునఁ గదియ; నాలోనఁ
చే పట్టి సమ్మెటఁ జెలసి రాఁ దిగిచి
పో వైచి, కార్యంబు బుద్ధి నూహించి,
క్షితినాథుతో సత్యకీర్తి యాత్రితని
చతుర వాక్య ప్రౌఢి సందిల్లఁ బలికె.—
సాహసో! నరేంద్ర! నీ కుచితమే యిట్టి
సాహసకృత్య మిా సతులపైఁ బూనుప?
వరసి మైఁ దూఁగు నీ వెలఁదుల జడలు
బెరయు విరోధుల పీలిజల్లెడెలె?
నెఱిమించు వీరల నెలవంక బొమలు
మెఱయు నరాతుల మేలి సింగిణులె?
పరఁగ నీయింతుల పటు కటాక్షములు
పరులు నీ పై నేయు బాణజాలములె?
గరిమతో వీరల కర్ణపత్త్రములు
సరవిఁ ద్రిప్పెడు రిపు చక్రాయుధములె?
వలపులు గుల్కు నీ వనితల మెడలు
వెలయు విద్వేషుల విజయశంఖములె?
పెరిఁగి క్రొవ్విన వీరి బిగిచన్నుఁగవలు
పరఁగ నీశత్రులు పాటించు గిరులె

చెలసి = ఒడిసి. బెరయు = వ్యాపించు. పీలి జల్లెడెలె = పికిలిపిట్టల కుంచెల చామరములా. నెలవంకబొమలు = చంద్రునివలె వంకరలైన కనుబొమలు. అరాతుల = శత్రువుల.

* 'గని' మూ. పా.

సడలి తూఁగాడు నీ సతుల పయ్యెదలు
బెడిదంపు మార్తుర బిరుదుఁ డెక్కెములె?
యాఁఘు వీఁగల నాభు లయులు నీ కెగ్గు
లొనరించు నభిచార హోమకుండములె?
మిసమిస మను వీరి మెఱుఁగుఁ బెందొడలు
గని మసంగెడు వైరి కరటి తుండములె?
రూపింప వీరి వట్రువ చిఱుదొడలు
నీపరిపంథుల నీలికాహాళులె?
యడరు నీ పడఁతుల యందెల మ్రోఁత
దొడరు నీపగతుర దుందుభిధ్వనులె?
యర్థులు గాని ప్రత్యర్థులు గారు.
పార్థివేశ్వర వీరిపైఁ గోప మింక
వల. దని చెప్పి మావంతుఁ డేనుఁగును
మలఁగించుగతి మంత్రి మరలించె విభునిఁ.
దలఁపులోఁ బాయక దలకొన్న * యలుకను
దెలుపుచుఁ జంద్రమతీదేవి పలికె.—
‘ ఇది యేమి, నాథ! నీహృదయంబు లోన
వెదకి కార్యంబు వివేకింపఁ జూడ?
వాఁపైఁడిమృగ మేడ? నడియాస లేడ?
నీపుష్పవన మేడ? నెలనాగ లేడఁ?
గలుగునే మాతంగకన్యల కిట్టి
లలిత విభ్రమ నవ లావణ్య మహిమ

కసిఁ = కోపముతో-మసంగెడి = విజృంభించు. కరటి = ఏనుఁగుల. పరిపంథుల = శత్రువుల. కాహాళులె = సన్నాయిలా. దుందుభి = భేరి. అర్థులు = యాచకులు. ప్రత్యర్థులు = శత్రువులు. అలుక = భయము.

* 'యలుకఁ' అని పూ. ము. పా.

యే యుపాయంబుల? నిది నమ్మరాదు!
మాయురె! కౌశికు మాయ గాఁబోలు.
గురునివాక్యము తలకూడెనో యేమొ?
సారిది నూరక చూడఁ జూడ నెల్లెడఁ
బనిగొని బహు మహోత్పాతంబు లౌదవె.'

— మాలెతల కొండెములు. —

ననుచుండ;— నబ్బోటు లచ్చోటు వాసి;
నెరసిన యలకల నెఱులుఁ, జిక్కొదవి
విరిసిన జడలును, విన్ననై మురువు
వాడిన మోములు, వన్నెయుఁ దూలి
వీడిన వలువలు, విరవిరఁ బోయి
తూలెడు మేనులుఁ, దునిసి ముత్యములు
రాలెడు సరులును, రాగంబు దొఱఁగి
వ్రేలెడు పెదవులు, విభ్రమం బెడలి
సోలెడు చూపులు, జొబ్బిల్లఁ గరఁగి
కలఁగిన పూఁతయుఁ, గంపు సొం పేది
నలఁగిన విరులును, నలిఁ గపోలముల
వడిసిన కన్నీరు, వడియు నెత్తురులఁ
దడిసిన యవికలుఁ, దాముఁ, జూపఱకు
జొత్తు పాపలఁ బోలి, శోకంబు నిగుడ
నత్తఱి నేడ్చుచు, నరిగి; కౌశికుని
యడుగులఁ బడి, మేను లందంద వడఁక
నుడుగక వగచుచు, "సర్వేశుఁ డలిగి

నెరసిన = వ్యాపించిన. నెఱులు=వంకరలు. విరిసిన = వీడిన. రాగంబు=ఎఱుపు. జొబ్బిల్లన్=బురదయగునట్లుగా. కంపు=పరిమళము యొక్క. ఏది=కోల్పోయి.

వరవుల వడిచిన వసువున నేఁ
బోరలఁ జేతులకసి వోవంగ నడిచి,
'దిక్కెవ్వ రటఁ జెప్పి తెం డ' న్న మాట
దిక్కు నీ వని చనుదెంచితి. మ'' నిన;—

—. కౌశికుఁడు రాజును తర్జించుట .—

నలుకమై మిట్టి మీనై పడి కెరలి
వలచేతి జపమాల వసుధపై వైచి,
ముఱముఱ మని బొమల్ ముడిపాటు గదురఁ,
జాఱమఱ నిప్పు లక్షుల నుప్పతిల్లఁ,
పాటపాటఁ జెమట మైఁ బొడమ, నాసికయుఁ
బుటపుటఁ గటములుఁ బొరిఁ బొరి నదర,
మొగమున జేవురు మురువు నటింప,
బుగబుగ నిగుడు నూర్పులఁ బొగ లెగయఁ,
గటకటఁ బడి, యోడు గఱచి, హుమ్మనుచుఁ,
దటముఁ దాటించి చిందఱ రేఁగినట్లు, (?)
వేఁడివేలుపు డిగి వెచ్చి ద్వీపంబు
లే డేర్చురీతి, నింతిం తన రాని
పటురౌద్ర రేఖ చూపడ, ముడి వీడి
కుటిలజటావలి గునిసి తూఁగాడ,
బ్రమసి యచ్చటి ముని ప్రవరులు వడఁక,
తిమిరి దండము కేలఁ ద్రిప్పుచు లేచి,

వరవులన్=ఊడిగపుస్త్రీలను. అడిచిన = కొట్టిన. కెరలి = విజృంభించి. కటములు=చెక్కులు. జేవురు = ఎఱుపు. ఓడు=క్రింది పెదవి. తటమున్=గట్టును-తాటించి=పగుల్చుకొని. చిందఱ=ఆవేశ. వెచ్చి=మండి. ఏర్చు=కాల్చు. తిమిరి=విజృంభించి.

ఘాల నేత్రాభీల పావక జ్వాల
లోలిఁ గ్రాలఁగ శూల ముద్ధతిఁ బూని
ధూళి గా భువనపంక్తులఁ గాల్పఁ గడఁగు
కాలరుద్రుఁడో లయకాలుఁడో యనఁగ,
మూఁడగ్నులను మునిమూర్తిఁ దైనట్లు,
వాఁడితేజముతోడ వచ్చుకౌశికుని
కనలేదు తెంపు మొక్కలమును జలముఁ
గనుఁగొని చిత్తంబు గలఁగి భూవిభుఁడు,
'ముప్పుగ రాజ్య మిమ్మునిచేత మనకుఁ,
దప్పదు బ్రహ్మశతం బడ్డపడిన.'
ననుచుఁ, దేవియుఁ దాను నతిభీతి నెదురు
నని, బహు రత్న పుష్పములఁ బూజించి
మ్రొక్కిన, దట్టించి మునినాథుఁ డతనిఁ
దక్కక దల వట్టి తన్నెఁ. దన్నుటయు;
నదరక బెదరక నాత్మలోఁ దాల్మి
వదలక వగవక వనజాప్తకులజుఁ
'డనఘాత్మ, నీకోమలాంఘ్రిపద్మము
ఘన వజ్రమనుట సంగత మైన యట్టి
నా మస్తకంబు మిన్నక సోఁకి నొచ్చె.
నేమి తప్పాదవె నా యెడఁ? జెప్పు. మ'నిన;—
గిటగిటఁ బండ్లను గీటి, కౌశికుఁడు
చిటచిట మిడుఁగుర్లు చెదర వీక్షించి,
మ్రొక్కులఁ జిక్కులు మొఱఁగులు నక్క-
తక్కులు నీ వట్టి తానకంబులును

ఆభీల=భయంకరమైన. పావక=అగ్ని. మొక్కలమును=మోటుఁదనము. అంఘ్రి=అడుగు. తానకములు=దండప్రణామములు.

గొలుపవు మాయెడఁ గుటిలవిచార.
తలపోయ, నొక పాదతలమున నేల,
కలయంగ నిఖిలాంగకంబులు నొచ్చెఁ
దలువ, నీ చేసిన దుండగంబులను.
విచ్చలవిడి వేఁట విపినభూములను
వచ్చి పోవరె తొల్లి వసుమతీవిభులు?
చలమున మునుల యాశ్రమములు సొచ్చి
చెలఁగి యి ట్లుపహతి సేయరు గాక.
వదలక బంగారువంటి నాయిష్టి
నవటు దూలఁగ నేసి, యరిగాఁపుతోఁట
మఱగి చొచ్చినయట్లు మ త్తపోవనము
సుడఁగక చొచ్చి, * కాసుగ నన్నుఁ గొనక,
నా పెంపుఁగూఁతుల నళినలోచనల
నీ పోఁడిమగువల నీ పువ్వుఁబోఁడ్ల
నడుగ వచ్చినవారి నక్కటా! యనక
కడు నగ్గి గజిబిజి గాఁగ మోఁదితివి!
మెచ్చు మిఁగిత మన్న మేకొని పోరి
మచ్చికంటుల నేఁచు మగఁటిమి యేల?
బలిమి మై నార్చి నీబలములు పేర్చి
యలబలంబుగఁ జొచ్చి యరఁటులు ద్రచ్చి,
రావులఁ గొట్టి వారణములఁ గట్టి,
మావులఁ బట్టి క్రొమ్మావులఁ గట్టి,

ఉపహతి = ఉపద్రవము. అరిగాఁపుతోఁటన్ = పన్నుగట్టువాని తోఁటను. పోఁడిమగువలన్ = అందకత్తెలను. మేకొని = పూని. ఏఁచు మగఁటిమి = బాధించు పరాక్రమము.

* 'కాసుకు' అని వ్రా. ము. పా.

యుటజ సంస్థలఁ జొచ్చి యూపముల్ ద్రొచ్చి,
కటముల మొట్టి తీవల నూఁగఁ గట్టి,
తలిరుల గాల్చి, పత్త్రంబుల దుల్చి,
పూలరుల నొల్చి, కాయలఁ జెడ నుల్చి,
ఫలరసంబులఁ గ్రోలి, బావులఁ దేలి,
కలయ జొన్నల రేఁపి, ఖగములఁ బోఁపి,
కలయఁ గ్రేపులఁ బాఁడి కపిలల వీడి,
లలిఁ ద్రొవ్వి కందమూలంబులఁ ద్రవ్వి,
పలుగాకు లై బహుభంగుల నిట్లు
పులుగాకు లొనరింపఁ బోలదే మాన్య?
బలు గాలియును జండభాను రశ్మియును
బొలయ లేఁగదు మత్తపోవనంబునకు.
నోపి నీ వెక్కడనుండి వచ్చితివో?
భూపకీటమ! వేరుపురుగ వై తీవు.
ఎటిఁగను గాక నేఁ డింక నాకొలఁది.
కొలఁది నొరుల నోఁకికొంటివి ద్రొవ్వి.
నీ వేమి చెప్పిన నీవ నిచ్చకము
గా వినుతించుచు గడుపుఁగూటికిని
బాయక నీయింట బడుగ వై పనులు
సేయుచు నుండ వసిష్ఠుండఁ గాను.
నీమిట్టిపాటును నీ రాజసంబు
నీమదంబును నుబ్బు నేలతోఁ గలయు.

ఉటజ = పర్ణశాల. యూపములు = యాగస్తంభములు. పులుగాకులు = ఉపద్రవములు. చండ భాను రశ్మి = సూర్యకిరణము. పొలయక = వ్యాపించుటకు. భూపకీటము = రాచపురుగా. బడుగను = అశక్తుఁడను.

నలి మృత్యుముఖ మైన నా దృష్టివీథిఁ
బొలసితి; విం కెట్లు పోయెదు బ్రతికి?
యలవు మై నీకు సహాయ మై వచ్చు
బలములఁ దోలుదోల్త భస్మీకరింతు.
నది విని తా నడ్డ మై వచ్చె నేని
కుదియింతు పిదప నీగురునిదర్పంబు.
నా మునికై పూని యరుదెంచె నేని
తామరచూలికిఁ దలఁకుఁ బుట్టింతు.
నా విరించికి బాసటై నిల్చె నేని
గోవిందు బీరంబుఁ గొల్ల లాడింతు.
నా సరోజాక్షునికై రేఁగె నేని
వాసుకికంకణు వశము గావింతుఁ.
గా దని నీ విట్లు గారింప మఱియు
మీఁదు గల్గినవారి మ్రింగుదు.' ననుచు,
విలయ కాలమునాఁడు వెలయు సూర్యులకుఁ
గల ప్రతాపంబును, గాల కూటమున
బలిసిన చుఱుకును, బడబాగ్ని శిఖలఁ
దలకొన్న వేఁడియు, దంభోళి ధారఁ
గలిగినవాఁడియుఁ, గాలదండమున
నలరెడు బెడిదంబు, నల వీరభద్రు
ఘనతర రౌద్ర రేఖయు, నైక్య మంది,
ముని రూపమునఁ బేర్చి, మూఁడు లోకములఁ

పొలసితివి=వచ్చితివి. అలవుమైౝ=శక్తితో. తామరచూలి = బ్రహ్మ. తలఁకు=భయము. బాసట=తోడు. బీరంబు=పరాక్రమము. వాసుకికంకణుౝ=శివుని. దంభోళిధారౝ = వజ్రాయుధపువాదర యందు. కాల=యముని. బెడిదంబు=భయంకరత. పేర్చి=విజృంభించి.

బెదరించి, పొంపిరి గాఁగఁ బెడచేత వ్రేయ
మొనసి, హుమ్మనఁగ మోమున మంట లెగయ,
నున్న విశ్వామిత్రు నుగ్రతేజమునఁ
గన్నుల మిఱుమిట్లు గవిసి, దిమ్మెసఁగి,
వారక తలపోయు వాక్రువ్వఁ జాల
నేరక, జాతవేల్పు నిలిచిన రీతి
నిలిచిన భూపాలు నివ్వెఱపాటుఁ
దెలియుట, 'సుచితోపదేశంబు సేసి
హితవు గావింప నా కిది వేళ' యనుచు,
మతిలోన నూహించి మంత్రి యి ట్లనియె:—
'జగదీశ, నీ వొక జనుని చందమున
గగనంబు పైఁ గూలఁ గాఁ దలంచెదవు.
నెగు లొందినప్పుడు నెఱిఁ దూలపోక,
వగవక, విద్యలు వదలక, తన్ను
మఱవక, వెఱవక, మాట వాతప్పి
తఱలక, విసువక, తాలిమి గలిగి,
యోపిన రీతిఁ బ్రియోక్తుల నెఱి
కోపము వదలించి, కుశలంబు మీఱ,
నేచిన యాపద నెరియక, తన్నుఁ
గాఁచుకోఁ దగు; దైవగతి యటుమీఁద.
స్ఫుటరోష శేషాహి ఫూత్కార ఘోర
చటుల విషానల జ్వాలలకంటెఁ

పొంపిరి=మొత్తము. మొనసి=ఉద్యుక్తుఁడై. దిమ్మె=భ్రమము. జాతవేల్పు=జాతిదేవుఁడు. గగనంబు = ఆకాశము. నెగులు = బాధ. నెఱి=పాడి. తఱలక=తొట్రుపడక. ఏచిన=విజృంభించిన. ఎరియక=మండక. అహి=సర్పము. అనల=అగ్ని.

కుపిత కౌశిక పటు కుటిల కఠోర
విపుల శాపాగ్నుల వేఁడిమి ఘనము.
కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగ రాక్షస పతు లిఁక దన్ను
జలదరింపుదు. రుర్వి జను లన నెంత?
పలుకుల కెడ లేదు. ప్రార్థింపు మనినఁ,
దెలి వొంది, మదిలోని దిమ్ముఁ బో విడిచి,
వెలయఁ జేతులు మోడ్చి, విభుఁ డిట్టు లనియె:—
'దీనవిధేయ గాధేయ, నీ కిన్క
మాని నాదెసఁ గృపామతిఁ జూడు మింకఁ.
జెలికి బ్రహ్మాస్త్రంబు పిచ్చుకమీఁద
నురవడి సంధింప నుచితమే యకట!
ఖేదంబు మనసునఁ గీల్కొన్న వేళ
నీదృష్టిపథమున నిల్చి భాషింపఁ
గమలారిధరుఁడనో? కమలనేత్రుఁడనొ?
కమలసంభవుఁడనొ? కమలమిత్త్రుఁడనో?
తనయుండు చేసిన తప్పొనగూర్చి
జనకుఁ డేగతి నైన సైరింప వలదె?
సురుఁగక వంటయిల్ సొచ్చిన శశముఁ
గరుణ సేయక నూరగా వండఁ దగునె?

కుపిత = కోపగించిన. విపుల = గొప్ప. ఎడ = అవకాశము. విధేయ = వశ్యుఁడా. కమలారిధరుఁడనో = శివుఁడనో. కమలనేత్రుఁడను = విష్ణువను. కమలసంభవుఁడను = బ్రహ్మను. కమలమిత్త్రుఁడను = సూర్యుఁడను. ఒనగూర్చి = దిద్ది. సురుఁగక = పోతిపోక. శశము = కుందేలు.

పఱతెంచు నీ శాపభద్రకాళికిని
వెఱచి నిన్న భయంబు వేఁడుచున్నాఁడ.
శరణంబుఁ జొచ్చినయట్టిశత్రువు నైనఁ
బరికించి కావంగఁ బంత మెయ్యెడల.
నెఱుఁగక చేసితి నెల్లతప్పులను,
మఱచి లోఁగొని నన్ను మన్నింపు. మ' నుచు,
సోలిఁ బుత్త్రుఁడు దాను నువిదయు నేల
లీలఁ జాఁగిలి మ్రొక్కి, లేవక, 'నీవ
దిక్కు మా క' నుచుఁ బ్రార్థింపఁ బ్రార్థింప,
నెక్కొన్న కోపంబు నెపమునఁ దాల్చి
గడఁగి మాటాడక, కరమునఁ దోలఁగ
జడియు మత్తేభంబు జాడ వత్తపసి
చే చాఁచి యారాజుశిర మెత్తి లేవఁ
ద్రోచి, వెండియు వానితోడ నిట్లనియె: —
'నీచెయ్వు లన్నియు నీకు సిద్ధించె,
నే చేటు పాటు మా కసఁగిన నేమి?
చేకొని మ్రొక్కంగఁ జేతులు గోయ
రాక గదా నిన్ను రక్షింప వలసెఁ.
దప్పు గాచినమీఁదఁ దగ దెగ్గు లెన్నఁ.
జెప్పెద నొక మాటఁ జేసెద వేని.
నా ముద్దుఁగూఁతుల నలినలోచనల
నీ మాలమగువల నిచ్చితి నీకుఁ;

శాపభద్రకాళికిన్ = శాప మనెడి భద్రకాళికాదేవికి. కరమునన్ = తొండముతో. జడియు = త్రోయు. చెయ్వులు = చేసినకార్యములు. ఎగ్గులు = తప్పులు.

ప్రేమ మీఱంగ వీరిఁ బెండ్లి యై వివిధ
కామోపభోగసౌఖ్యంబులఁ బొందు.
మీ చన విచ్చిన నినకులాధీశ,
మా చిత్తమున నున్న మంట చల్లారు.
నోడక నీధైర్య మొత్తి చూచుటకు
నాడినమాట గా. దని యిట్లు తన్ను
వేఁడిన యాపల్కు వేఁడి యై కొఱవిఁ
జూడిన యట్లు గా, గ్రుక్కి, భూభర్త,
'యేవిధంబున నింక నీ నేల గడచి
పోవ నీఁ డీ పలుపోకల తపసి.
తొలఁగునె నా కన్న దుస్స్వప్నఫలము
కళకళించిన? నని కౌశికుఁ జూచి
'నీచపిసాళి యీ నెలఁతల నేలి,
యేచిన రతికేళి నేప్రొద్దుఁ దేలి,
నగుఁబాటు నకుఁ జాలి, నమ్మిక దూలి,
తగవులు వోఁ దోలి, ధర్మంబు మాలి,
యొలయుబాధల ప్రీలి, యొండొండ సోలి,
వలవంత గా నోలి, వలవ దీ జాలి.
తను నియ్యకొనఁ దగు తన వైనఁ గాని,
తనునె నా కీ మాలతన నియ్యకొనఁగ?'
ననిన విశ్వామిత్రుఁ డనియె నాతనికి:—

చనవు = చెల్లుబడి. చూడిన = కాల్చిన. కళవళించినఁ = కలఁత పడిన యెడల. నీచపిసాళి = నీచమైన టక్కులుగల. ఏచిన = అతిశయించిన. తగవులు = న్యాయములు. ప్రీలి = పగిలి. ఓలిఁ = వరుసగా. వలవంత = మదనదుఃఖము. కాఁ = కలుగునట్లుగా.

'మనమునఁ దలపోయ మానవేశులకు
దారుణ నరక బాధలు వింత గావు
వారక మున్నింవాతరికి నైన
నవతారములు గన్న. ననురాగ మొదవఁ
దవిలి యీ వెలివాడ తలిరాకుఁబోండ్ల
మన్నించి, సకల సామ్రాజ్య భోగములఁ
జెన్నొందు నొప్పు నా చెప్పిన చొప్పు.
అంతకుఁ బై వేఱె యంతకుఁ డెవ్వఁ?
డింత విచారింప నేటికి? కిచ్చోటఁ
బరలోక సౌఖ్యానుభవ మెన్నఁ డొదవు?
నురుతర భోగంబు లొల్లక చెనుటు
యడరు నజ్ఞ్గభయంబునఁ గూను
విడిచి యూరక చచ్చు వెంగలి విధము.
నీతి విచారింప నేరవు నీవు.
భూతలాధీశ, దుర్బుద్ధులు మాని
కా నిమ్ము. నీకు నీ కరకరి యేల?
భూనుతం బగు మత్తపోవనంబునను,
మందార మంజరీ మంజు మరంద
నంద దిందిందిర నందనారామ
కమనీయ వికసిత కనకారవింద

వారక=తప్పక. వెలివాడ = మాలవాడ ఒప్పు = సొంపు. అంతకు పైఁ = నామాటపై. అడరు = కలుగునట్టి. కానిమ్ము = నామాట జరుపుము. కరకరి = చిత్తకాఠిన్యము. మందార = కల్పవృక్షముల - మంజరీ = పూగుత్తులయొక్క - మంజు = మనోహరమైన- మరంద= తేనెచేత - నందత్ = సంతోషించుచున్న - ఇందిందిర = తుమ్మెదలు గల - నందన ఆరామ = నందన వనమందలి.

కమలినీ తట లతాగార లతాంత
రచిత శయ్యాతల రతిరయ గళిత
కచభర సురపుర గణికా కపోల
కలిత ఘర్మోదక కణ గణ మిళిత
మలయ సమీర కోమల కంపితాగ్ర
మహిత చిత్రధ్వజ మాలా సహస్ర
సహిత చింతామణీ సౌధ పాళికల,
నందంద డెందంబునందు నెయ్యంబు
పొం దొంద నీ యిందుముఖులతోఁ గూడి
వేడుక సలిపెద వేని, నీ బొంది
తోడనే నిన్ను నింద్రునిపురి కనుతు.
నీక్షితి నీమేర కింతకు మున్న
సాక్షి మీతండ్రి త్రిశంకుభూనాథుఁ.
డ'నిన; సజ్జననాథుఁ డమ్ముని కనియెఁ:—
'గనుఁగొని నీపెంపు గణుతింప నరిది!
తెలిసి చూడఁగఁ దల్లిఁ దెగ నమ్మి దాసిఁ
బిలిచి *పాలించిన ప్రియము చింతింప
నల యల్పసుఖమున కై పాలవంటి
కులము మాలగఁ జేసికొని మను చుంట.

కమలినీ=తామరకొలనియొక్క - తట=దరియందలి-లతా అగార=తీఁగయిండ్లయందలి- లతాంత=పువ్వులచేత. రతి=కామకేళియొక్క-రయ=వడిచేత. సురపుర = స్వర్గ- గణికా = వేశ్యలయొక్క -కపోల = చెక్కిళ్లయందు. ఘర్మ = చెమట. చింతామణీ = ఈవి మాణిక్యముల- సౌధపాళికలన్ = మేడల సమూహములందు. సలిపెద వేని = సలుప నిచ్చగింతువేని. అరిది=అశక్యము.

---

* 'పాలిచ్చిన...' అని పా.

చలదళ పల్లవాంచలమున వ్రేలు
జలకణ భాతి నాశ్చర్యంబు గాఁగ
నెడల నూటాడు నాయువు నమ్మి మాల
పడఁతులతోఁ గూడి బతిమాలి పడయు
సుమహిత సామ్రాజ్య సుఖము నే నొల్ల,
నమరలోకం బొల్ల, నమరత్వ మొల్ల;
బుద్ధి యొండొకత్రోవఁ బోవదు నాకు,
వృద్ధరాజులు సన్నవిధిని బోయెదను.
వేయుఁ జెప్పినఁ జెప్ప; విడువఁ గులంబు,
నా యేలు రాజ్య మైనను విడ్తుఁ గాని.'
యనినఁ;—'దథాస్తు. మా కంతియ చాలుఁ.
జననాథ, విడువు నీసకల రాజ్యములఁ.
నిల నేడు దీవులు నేలెడు వేడ్క
గల దది; మాకు నీ కతన సిద్ధించె.
వరుసఁ దోరణ గట్టి వఱియు, మాశిష్య
వరులఁ బంపెదము, నీ వల కేలి వ్రేలి
ముద్రయుంగర మిచ్చి పుచ్చుము. నీకు
భద్ర మయ్యెడు. మ' ని పలికెఁ గౌశికుఁడు.
పలికిన;— 'నాకు నీపంపు గావింపఁ
గలుగుట మిగుల భాగ్యము గాదె తలఁప?
వినుత తపో రాజ్య విఖ్యాతి నెసఁగు
మునుల రాజవు నీవు మున్న నీ వేలి
నది గాదె యీ సక లావనీ వలయ?

చలదళ = రావి - పల్లవ = చిగురుయొక్క - అంచలమునన్ = కొనయందు. భాతిన్ = వలె. ఊటాడు = ఊఁగులాడు. తోరణ = తోరణము. ముద్ర = పేరు చెక్కిన. అవనీవలయము = భూమండలము.

మిది నీవు నొసఁగ నే నెంతటివాఁడ ?
మాట పందులు వట్టి మన సొత్తి చూడ
నేటికి?' యనుడు; న య్యినకులాధీశుఁ
జూచి నవ్వుచు గాధిసుతుఁ డిట్టు లనియె:—
"నీ చతురోక్తుల కేమి కారణము?
'రాచయీవుల నమ్మ రాద' నుమాట
యీ చందమున నిల్చె. నిప్పటికిపుడు
తప్ప నాడెదవు. సత్యవ్రతుం డనుచుఁ
జెప్పుదు రెందుఁ బ్రసిద్ధిగా నిన్ను.
మెచ్చితి నీ లాగు. మేలు! మే! లింక
నిచ్చి లే దన్నఁ బో నిత్తునే యేను?
నొక వేద తపసిఁగా నూహించి నన్నుఁ
దకపిక లాడింపఁ దలఁచితివేని,
క్రూరాత్మ, మద్ఘన ఘోర శాపాగ్ని
నీ రాష్ట్రమును నిన్ను నీఱు గావింతుఁ.
గా దేని యీ యిఱుకటములు మాని
'లేదు బొంకితి న'ని లె. మ్మ'' ను నంత;
ముని శాప భయమున మునిఁగి యొం డాడ
నొనయక యీఁకొట్టి మ్రొక్కుచు నున్న
సారవర్తను హరిశ్చంద్రునిఁ గదిసి
ధీరతఁ జంద్రమతీదేవి పలికె:—
'నిలలోనఁ గౌశికు నింద్రజాలంపు
వలవు లో నైతిమి వసుధాతలేంద్ర.
గొనకొని వడిపెట్టు కోక చందమునఁ
బని లేని నెఱసులు వట్టఁ దొడంగె.

నీఱు = నిగుఱు. వడిపెట్టు = మెలిపెట్టిన. నెఱసులు = తప్పులు.

నేమి కారణ మింక నీ ప్రతిభాష?
కే మాట సందున నెసఁగునో బొంకు?
ఎనయ నిద్ధర నెల్ల నేలిన నృపులు
గొని పోయిరె నేలఁ గొణిదెఁ డం తైన?
నీ నిఖిలోర్వియు నిమ్మునీంద్రునకు
దాన మి మ్మిఁకఁట. సత్పాత్రంబు దొరకె.'
నని తన చిత్తంబునందలి తెగువ
కనుకూల మైన పల్కు నతివ నీక్షించి,

—హరిశ్చంద్రుఁడు కౌశికునికి రాజ్యమునిచ్చుట.—

మంగళోదకములు మసలక హేమ
భృంగారమున నతిప్రీతిఁ దె మ్మనుచుఁ,
దెప్పించి, 'దేవ భూదేవ మాన్యములు
దప్ప సప్తద్వీప ధరణి సమస్త
మష్ట భో గైశ్వర్య మవి మీకుఁ గలుగ
నిష్ట మేర్పడ, దాన మిచ్చితి.' ననుచు,
ధారుణీపతి గాధితనయు హస్తమున
దార వోసిన; జలధారను మున్నె
తొరఁగెఁ బువ్వులవాన; తోడనే మ్రోసె
సుర దుందుభులు; ముని స్తుతులు సెలంగె;
'గలిచె వసిష్ఠుఁ. డంకిలి లే. ద' టంచు
నల నొప్ప నాకాశ వాణి భాషించె.
నా వేళఁ గౌశికుఁ డా హరిశ్చంద్రు
దీవించి 'నేఁ డింకఁ దీఱదు మాకుఁ

కొణిదెఁడు=పుడిసెఁడు. హేమ భృంగారమునన్ = బంగారు బుంగలో. భూదేవ = బ్రాహ్మణుల. అష్టభోగ=జలనిధి తరు పాషాణాదులైన యెనిమిది భోగ్యములతోడ. అంకిలి = అడ్డి.

బోయి వచ్చెద నెల్లి ప్రొద్దున, నుచుఁ
బోయె. భూవిభుఁడును బురి కేఁగె. నంత
మఱునాఁడు సంధ్యాది మహిత కర్మములు
దెఱఁ గొప్ప వేవేగ దీర్చి కౌశికుఁడు,
బహుశిష్య గణములు బలసి తన్గొల్వఁ,
గుహక బుద్ధులను దా గుణియించు కొనుచు,
వడి నయోధ్యకుఁ జని, వనజాప్తకులునిఁ
బొడ గని దీవింపఁ; బొడమిన భీతి
వడఁకుచు నెదురుగా వచ్చి యారాజు
పుడమిఁ జాఁగిలి మ్రొక్కి పూజ లొనర్చి,
కొని వచ్చి తన పెద్ద కొలువున రుచులు
నన లొత్తు సింహాసనంబున నునిచి,
దొరల భృత్యుల నమాత్యులను రప్పించి,
యురు దాగ వారితో నంతయుఁ జెప్పె.
'నాకు మీకును భువనములకుఁ బూజ్యుఁ
డీ కౌశికుఁడు. భక్తిని మునిచంద్రు
చరణాంబుజములు నిచ్చలును సేవించి,
పరిణామ మెసఁగ మీ పనుల పై బ్రదుకుఁ.
డేను బుత్త్రుండు నీ యింతియుఁ గూడి
కానన భూమికిఁ గదలి వే పోదు.'
మనిన;—గొబ్బునఁ గ్రమ్ము నశ్రుపూరముల
ననయంబు నెప్పల నప్పళించుచును,
వసుధేశు పదముల వ్రాలి, చిత్తమున
నొసఁగు శోకముల వా రేడ్చుచు ననిరి.—

ఎల్లి = రేపు. కుహక = కుత్సితపు. రుచులు = కాంతులు. నిచ్చలును = సదా. పరిణామము = పెంపు. కానన = అడవి.

'వరుస నిక్ష్వాకు భూవరు నాఁటనుండి
పరిణామ మెసఁగ మీ పదముల చెంతఁ
జల్లగా మహి నెల్ల చనవులు మాకుఁ
జెల్లఁగా నుంటిమి. చెల్లఁబో! నేఁడు
మది లోన నిటు దయ మాలి, మ ముయ్యెడఁగ
వదలక, యీ ముని వ్యాఘ్రంబు వాతఁ
బాడివి త్రోచెదు పశుపుంజంబ పోలె.
మదిమది నుండి సామ్రాజ్య వైభవము
పో నేల? విపినభూముల కేఁగ నేల?
యీ నేల తపసికి నీ నేల నేల?
గడిఁగి పేరడవులఁ గాయ పం డేరి
కుడిచి వర్తించు వెక్కురు తాపసులకుఁ
బాడలక కౌసంబొ, భూదిబొక్కణము
బడిలో, రుద్రాక్షులో, సంపద లేల?
తోలుత వేఁదుఱు గన్న దుష్టమర్కటము
సొలయుక భూతంబు సోఁకిన రీతిఁ
జెనఁటి మూర్ఖున కిట్టి సిరి వచ్చె! నింకఁ
జెనకి యెవ్వరి నేమి సేయునో రేఁగి?'
గజిబిజి నొంది యిక్కడఁ దల్లి లేని
ప్రజల మై బాములఁ బడఁ జాల మేము.
వత్తుము మీ వెంట. వల దంటి రేని
చత్తుము మీ పాదజలజంబు లాన.'—
యనిన హరిశ్చంద్రుఁ డాపురజనులఁ

మదిమదిఁ = నెమ్మదిగా. వెక్కురు = వికారపు. ఏలకఁ = ఏలుటకు. కౌసంబొ = అజినమో. భూదిబొక్కణము = విభూది సంచియో. వేఁదుఱు = వెఱ్ఱి. బాములఁ = బాధలను.

గనుఁగొని మది నిర్వికారుఁడై పలికె.—
'ఘనపుణ్యుఁడైన యీ గాధేయు పెంపు
విని యెఱుంగని యవివేకుల మిమ్ముఁ
గనుకనిఁ దెలుప శక్యము గాదు నాకుఁ.
గనలు శూలముఁ జంద్రకళయును దాఁచి
మునివేసమున నున్న ముక్కంటి యితఁడు
కినుకమై నిమ్మునికేసరి యిపుడు
కనుఁగవ నునుఁగెంపు గదుర నొక్కింతఁ
గనుఁగొన నొక్కటఁ గమరు లోకమ్ము.
లెదిరి యొద్దారింప నెవ్వరివశము!
బ్రతికెద లేని దుర్భాషలు మాని
సేవింపుఁ డీతని స్థిరబుద్ధి. మీకు
భావింప నిహమును బరమును గల్గు.
తలవని అవ్వ! యెవ్వరి నేమి చేసె
నలిగి యమ్మునిచంద్రుఁ? డదియును గాక
నాఁకలి ఘనమైన నదరి సింహంబు
మేఁకలఁ బొరి వుచ్చి మెసవునే? మఱియు,
నడిగినఁ బ్రాణంబులైన నిచ్చుటయు,
నొడివి క్రమ్మఱఁ దప్ప నొడువ కుండుటయు,
శరణన్నఁ గాచుట శత్రువునైనఁ,
గర మొప్ప మత్కులాగత వర్తనంబు.
సరకు సేయుదునె యీ సామ్రాజ్యపదవి?
మెరమెరపాటేల మీకుఁ జిత్తముల?
నిరవొంద మీరు మీయిండ్లనే యుండి,

కనుకనిఁ=తటాలున. కనలు=మండెడు. కమరుఁ=మాడును. పొరి వుచ్చి=చంపి. మెరమెరపాటు=సంశయము. ఇరవొందఁ=స్థిరముగా.

గురుబుద్ధి నా మేలుఁ గోరుండు; చాలు.'
నని వార లందఱు నడ లాఱఁ బలికి,
తన దేవియును దానుఁ దన తనూజుండు
మునినాథునకు భక్తి మ్రొక్కి 'యే నింకఁ
బనివినియెద.' నన్నఁ;—బకపక నవ్వి,
'యవని కింతకు రాజ వై యున్న నాకు
నవిరళ గతిఁ బూన నర్హంబు గాక,
మకర కుండల హార మంజీర వలయ
మకుటాంగదమ్ములు మఱి నీకుఁ దగునె?
తెమ్ము మా కవి.' యని దేవి మై నున్న
సొమ్ము లన్నియు మోముఁ జూడక యొలిచి,
'విచ్చేయు' మనుచు దీవించి వీడ్కొలుప;—
నిచ్చలోఁ గలఁక యొక్కింతయు లేక,

—హరిశ్చంద్రుఁడు రాజ్యభ్రష్టుఁ డై తరలుట.—

పురజను లార్తులై పురపురఁ బొక్క,
పురము వెల్వడి, సాఁగి పోవుచు నుండెఁ.
బటురయంబునఁ గూడఁ బఱచి యారాజు
నటు చన నీక విశ్వామిత్రుఁ డనియె —

—కౌశికుఁడు ఇల్లడను తండుట.—

'మును మఖార్థంబుగా ముదమున నిచ్చి
కొనుఁ డన్న, నాఁటికిఁ గొని పోవ లేక
యిల్లడ నీ యింట నిడిన నా విత్త

ఇరవు = నిలుకడ. అడలు = దుఃఖము. పనివినియెదన్ = పోయెదను. అవిరళగతిన్ = దట్టమైనవిధమున. మకర = మొసలియాకారము గల. మంజీర = అందెలు. అంగదములు = బాహుపురులు. మఖార్థంబు = యజ్ఞముకొఱకు. ఇల్లడ = న్యాసము.

మెల్ల నిప్పింపక నెందుఁ బోయెదవు?
మఱచిన నెఱిఁగింప మనుజేశ, వలదె?
మొఱఁగి పోఁ జూచితే? మోసపోఁ గాని.
యనయ విప్రుల సొమ్ము లెన్నెన్ని యిట్లు
కనుఁబ్రామి కొంటివో కాక వంచించి?
వేవేలు వచ్చె! నీ విశ్వాస మెల్ల
దైవ మెఱుంగు! మాధనము తెమ్మ' నినఁ;—
బిడుగు వ్రేసినవాని బెడిదంపుఁ గొఱవి
నడిచినయట్టు లై, యధిపతి స్రుక్కి,
యలుగక, 'చల్ల పెం చాదిగా నాకుఁ
గలధనం బంతయుఁ గపటంబు లేక
నీకె యిచ్చితిఁ. దొంటి నేఁటి ధనంబు
నేక మై చెల్లె. నీ కేల మోసంబు?
ఎంతటి కెంత నీ కీ ధనకాంక్ష?
సంతోషమునఁ బొంది చను మింక.' ననినఁ;—
దొలఁగక వాలంబుఁ ద్రొక్కినఁ బెలుచ
నలిగి బి ట్టెగయు కాలాహిచందమున
మునినాథుఁ డదలించి మురమురు మనుచుఁ
దనచేతికోల నద్ధరణీశు వ్రేసె.
వ్రేసియుఁ గరుణ పో విడిచి చిత్తమున
నీసును గోపంబు నెనయ ని ట్లనియె.—
"గ్రామకార్యములు మాకడఁ జెల్ల. వింక
నీ మూఢవాక్కుల కేమి కారణము?
ఇచ్చి వేఁడినఁ గోప మెవ్వరి కైన

మొఱఁగి=ఏమార్చి. పెలుచన్ = మిక్కిలి. వాలంబు=తోఁక.
కాల అహి=నల్లపాము.

వచ్చు నెప్పుడు. నది వాలాయ మరయ.
నచ్చినకంటె మా కధికధనంబు
నిచ్చువాఁడవ పోలె ని ట్లన నేల?
‘ తొల్లింటి ధనముతో దొరలినరాజ్య
మెల్ల నిచ్చితిని. మీ కిది నిక్క.’ మన్నఁ,
దిరిగి పోదము సమ్మతించి. నీచిత్త
మరయుట గాదు. మహాదేవు నాన.”
యనిన హరిశ్చంద్రుఁ డత్తపోధనునిఁ
గనుఁగొని వెఱచుచుఁ గడుభక్తిఁ దాల్మి
వదలక తత్పాదవనజముల్ నుదురు
గదియఁ జాఁగిలి మ్రొక్కి కరములు మోడ్చి
“ గాసుఁ డే నైనను దప్పఁ జేసినను
వ్రేసి కారించుట విహితంబు గాదు.
కోప మేటికి మునికులవర నీకు?
రూపించి కొ మ్మని ప్రోవు గాఁ బోయ
ధనము లే దని గాని, తడవునఁ గొన్ని
దినములు సైరింపు, తీర్తు నీఋణము.
నప్పు లే దని త్రోయ నగునె యెవ్వరికిఁ?
దప్పు నాడినఁ బెంపు దప్పదే కాక.
‘ లేదు, చిక్కులు వెట్ట లే.’ దని చెప్పఁ,
గా దని ముకుఁద్రాటఁ గాలు దుయ్యకుము.
దయ సేయు.” మనినఁ గ్రోధము మాని కొంత
నయముగా నమ్మునినాథుఁ డి ట్లనియె.—
‘ నగుఁ గాక నీచెప్పినట్ల చేసెదను.

వాలాయము = వాడుక. తడవునన్ = విలంబమున. లేదు = ధనము లేదు. దుయ్యకుము = దూర్పకుము.

మొగమోట మేటికి? మున్నె చెప్పెదను.
దీనికి మితి యేమి? తీర్చు టే వెరవుఁ
బూని? పల్కుము. వినఁ బొం దయ్యె నేని,
యెడ మాలి యుండెద నెప్పటి.' కనినఁ;
ముద మంది నృపతి యమ్మునిపతి కనియె.—
'నిమ్ముల దయ మీఱ నింక నొం డనక
యిమ్ము నా కొకనెల యెడ. నాఁటి మితికిఁ
దెఱఁ గొంకు లే కున్నఁ దెఱవయి నేను
జెఱ నుండి యైనను సెలవు దీర్చెదము.'
నావుడు;—. నగు నని నరలోకనాథు
దీవించి చని చని, తిరిగి యేతెంచి,
'మగిడి పోవఁగఁ దోఁచె మా కొక్కబుద్ధి.
జగదీశ లేమికిఁ జాలక నీవు
కూడినధన మెల్లఁ గూటివెచ్చంబు
వాడిన, మఱి యెట్లు వచ్చు మాధనము?
చదరంబుగా దిద్దు జాడఁ గైకొనక
తుదిఁ బోయి వడిపెట్టు దోసఁ గగు.' ననుచుఁ,

—. కౌశికుఁడు నక్షత్రకుని తరువు పెట్టుట.—

దన శిష్యగణములోఁ దనకన్న మూర్ఖు
ననల సన్నిభ తేజు నత్యంత కుటిలుఁ
గ్రూరుని నక్షత్రకుం డనువానిఁ
జేర ర మ్మని పిల్చి, చెవిఁ గొన్నిఁ జెప్పి,
'యలయక నీవు మాయందుల భక్తి
వెలయంగ నీరాజు వెనువెంటఁ దగిలి,

మితి = గడువు. వెరవు = ఉపాయమును ఎడ = అవకాశము.
చధరంబుగాక = సులువుగా. వడివెట్టు = మెలిపెట్టునట్టి.

దొరికినధన మెల్లఁ దోడిఁబడకుండ
నరవీస మాదిగా నప్పుడే కొనుచు,
నాఁకట స్రుక్కించి యలఁత సొక్కించి
వ్యాకుల (?) మొందించి వ్యథలఁ గుందించి
మానంబు దప్పించి మనసు నొప్పించి
దీనత రప్పించి దిగులు దెప్పించి,
దినములు ముప్పది దీఱునంతకును
గనలుచుఁ దరువుండి కడమగా నుండ
ధనము తె.' మ్మని పల్కి; — ధరణీశుఁ జూచి,
'జననాథ, నీతోడఁ జనుదెంచు నితఁడు.
సోము కోర్వఁగ లేఁడు, సుకుమార మూర్తి.
నా మాఱుఁగా జూచి, నయమునఁ బ్రోచి,
నవసిన నలసిన నడువ లే కున్న
సవరించికొని పోవఁ జనుఁ గృప మీఱ.'
నని యప్పగించుచు, నటు వోయి మగుడఁ
జనుదెంచి మునిపతి జనపతి కనియె. —
'వినుము. నీ కొకమాట వివరంబు గాను
మునుపె చెప్పక యున్న మోస మౌ మీఁదఁ.
దెరలక నీవు మా దేశంబులోనఁ
దిరుగుచు నూరూర దీనత దోఁపఁ
బ్రజల నిమ్ముల వేఁడి పడసినధనము
నిజముగాఁ బోఁకయు నీవు మే మీము.
చెడి పోక మామాటఁ జేసి యీ మాల
పడఁతుల బెండ్లియై బ్రతుకు మిం కైన.'

తరువు ఉండి = తండోపనిర్బంధము చేసి. సోముకు = శ్రమకు.
వ్యాకులము (?) = వ్యాకులత్వము.

అనిన;—హరిశ్చంద్రుఁ డామునిచంద్రుఁ
గనుఁగొని ధైర్యంబు గలఁగక పలికె.—
'దేవ సేవలకు భూదేవ సేవలకు
భావింపఁ దొల్లి యే పని లేదు మాకుఁ.
గావున నేలాగొ కడమ లే కుండ,
మా విత్త మిచ్చెద; మా ప్రజ నడుఁగి.
నీ సభాముల నొల్ల నీరాజ్య మొల్లఁ.
ద్రోచి, పోని మ్మింకఁ దుకతుక మాని.'
నావుడు;—నమ్మునినాథుఁ డారాజు
భావశుద్ధికి మెచ్చి, బాపురే! యనుచు,
నురవడి నుగిడి యయోధ్యకు వచ్చి
పరిపాటి దప్పక ప్రజలఁ బాలింప
వలను మీఱిన మంత్రివరుల కొప్పించి,
కలయఁ బౌరులు గుమ్మకరిగొని దూఱఁ
దలవంచుకొని వీడు దడయక వెడలి,
వెలయ నద్భుతుఁడై, విభుని వెన్వెంట

—కౌశికుఁడు రాజునకు దారిలో ఆపదలం గల్పించుట.—

నింతింతఁ జనుచు, వా రేఁగడెత్రోవ
నంతంత శిలలు మహాకంటకములుఁ
బుట్టలు గుట్టలుఁ బొదలు నీరములు
ఘట్టంబులును బెక్కు గల్పించి, మఱియు
వెలిమంటగతిఁ బేర్చు వేసవి యెండ
సొలయఁ వేఁడిమికి నత్యూష్మంబు సెఱపి,

బాపురే=బళీ. పరిపాటి=న్యాయము. వలను=నేర్పు. గుమ్మగరిగొని=చుట్టుకొని. ఈరములు=పొదరిండ్లు. వెలి=తెల్లని. ఊష్మంబు=ఉక్క. సెఱపి=పర్వించి.

యవిరళగతి నాకు లల్లాడ కుండఁ
బవనసంచార మేర్పడ మట్టుపఱచి,
మడువుల నున్న నిర్మల సలిలంబు
లెడపకయే టెంకు లింకి పోఁ జేసి,
యూఁకటివేళల నలసి యే మైనఁ
జేకొని భక్షింపఁ జేఁదు గావించి,
తెరువులు దొలఁగించి ధృతులు గీడ్పఱచి
పరువుల నలయించి భయ మొదవించి
నడపుల సొలయించి నయము దూలించి
* తడఁబాటు రెట్టించి దప్పిఁ బుట్టించి,
కైకొని, మది నింత కనికరం బైన
లేక కారించె నీలీలల.—నపుడు,
పీడిన క్రొమ్ముడి విరుల నెత్తావిఁ
గూడి జుమ్మని మ్రోయు కొదమ తేఁటులకు
నులికి, ముఖాంభోజ మోర గాఁ ద్రిప్పి,
మలఁగఁ బోయిన, నీలమణులు నా మెఱయు
కురులఁ దీఁగెలు పట్టికొనిన, హు మ్మనుచుఁ
గరపల్లవము సాఁప, కలగొన రేఁగి
కడుఁదురు లద రంటఁ గఱవ, విభ్రాంతి
వడఁకుచు వీవఁగాఁ బయ్యెద కొంగు

పవన=గాలియొక్క. టెంకులు = ఆధారములు. ఎడపకయే = ఎడలింపకయే. ధృతులు=ధైర్యములు. ఇంత=ఇంచుక. కారించెన్ = బాధించెను. క్రొమ్ముడి = తుఱుముయొక్క. కలగొనన్ = అంతటను. కడుఁదురులు=కణుఁదురీఁగలు. అదరు అంటన్=నిప్పువలె తగిలినట్లు.

* 'తడఁబడ' అని పూ. ము. పా.

దాసిన కంపలు దగిలినఁ, గొలఁగఁ
దీసి రా నేరక, దీనత నొంది,
మెఱుఁగు ముత్యంబుల గ్రిందుగు మీనమ్ము
లఱుగక వేసఁ గ్రక్కునట్టి చందమునఁ
బలుమాఱు గ్రమ్మెడి బాష్పబిందువులు
వలుఁద చన్నులమీఁద వాన గై తొరుఁగ,
నురిఁ బడి తూఁగాడు చున్న సారంగి
కరణి జాఱిన నీవి గదియ డాకేల
నొదువుచు, నందను నొక చేతఁ బట్టి,
పద నింకి బీఁటలు వాఱు కెమ్మోవిఁ
దడుపుచు, నున్నత స్తన భారమునకు
నడు మోర్వ దనుభీతి నడవదో యనఁగ
నడు గత్త కున్న ప్రియాంగనఁ జూచి,
పుడమి ఱేఁ డాత్మలోఁ బురపురఁ బొక్కి,
' మును సౌధ సోపానముల నెక్క లేని
వనజాక్షి యె ట్లెక్కు వరుస శైలములు!
పటికంపు రాకట్టుపై నెక్క నలయు
కుటిలకుంతలి యెట్లు గుట్టలు గడచు!
నను బొంద రత్న దేహళి దాఁట నలయు
ఘనకుచ యేరీతిఁ గడచు ఘట్టములు!
కేళీవనంబులఁ గ్రీడింప బడలు
లోలాక్షి యడవులలో నెట్లు మెలఁగుఁ!
జిలుక నక్కునఁ బెట్టఁ జెక్కు నిమర్చు

దాసిన=దగ్గఱిన. అఱుగక=జీర్ణింపక. నీవికి ఉరి ఉపమానము. ఒదువుచున్ = పొదువుచు. పదను=తడి. సౌధసోపానములన్=మేడ మెట్లను. దేహళి=గడప. అక్కునన్=అరొమ్మున

నెలవాఁగ నందను నెట్లెత్తి తెచ్చె!
సద్దంబు చెర వుచ్చిన ట్లుండు దీని
ముద్దుల నెమ్మోము మురిపెంబు దూలె.
నీఁగ మైఁ బడ జాలు నీయిందువదన
బాగైన పాపటపై బీలువాలె.
మీటినఁ బగులు నీ మెలఁత చర్మోయి
పాటన బయలయ్యెఁ బయ్యెద దొలఁగి.
చిలుక ప్రాలినఁ గందు చెలువ మైదీఁగ
దళ మైన కట్టెండ తాఁకున వాఁడె.
నా నిమిత్తంబున నారీలలామ
కీ నీచదుర్దశ నిటు వేఁగ వలసె.
నిటువలెఁ జెలరేఁగి యెవ్వరి నిట్లు
మటుమాయ విధి పట్టి మలఁకలఁ బెట్టు?'
నని తలపోయుచు, నాలేమఁ గదిసి
యనునయించుచు, నిజహస్తంబుఁ జేతి
కలిమిమై నూఁతఁగా నిచ్చి, పుత్త్రుని
వలమూఁపుపై నిడి, వసుమతీనాథుఁ
డటు చనుచుండ; మిథ్యా పథిభ్రాంతి
నటియించి సోలుచు నక్షత్రకుండు
గుది ద్రోచినట్లు 'హా! గురునాథ!' యనుచుఁ
జదికిలంబడి, హరిశ్చంద్రుతో ననియెఁ: —
'బొగిలె సంగంబులు, వొక్కెఁ బాదములు,
నొగిలె నెమ్ములు, చాల నొచ్చె మస్తకము,

బీలువాలెన్ = రేఁగినది. పాటన = సొంపు. మలఁకలన్ = చిక్కులను. పథిభ్రాంతి = దారిబడలిక. గుదిద్రోసిన = కాళ్లుకట్టిత్రోసిన. పొగిలెన్ = తపించెను. నొగిలెన్ = నొచ్చెను. ఎమ్ములు = ఎముకలు. మస్తకము = తల.

కన్నులఁ జీఁకట్లు గవిసె, జుమ్మనుచు
నున్నవి వీను, లెట్లోర్వంగ వచ్చు ?
నోచవిన కరుణామై నొకప్రాణినీడఁ
గడియించి ప్రాణముల్ గావు.' నావుడును;—
భూపాలుఁ డెంతయు బుద్ధిలో వగచి,
‘ యీపథిశ్రాంతి నేఁ డింతయుఁ దీఱఁ
బల్లె ప ట్టయినను బసులమందయిన
నుల్ల మారఁగఁ జేర నున్న దే ప్రొద్దు ?
నీ మునిపుత్త్రున కీవిధి మూఁడె
నీ మహాటవిలోన నీ యెడప్రొద్దు.
కాలిసంకెల గాఁగఁ గౌశికుఁ డితని
నీరీతి వెనువెంట నేల పుత్తెంచె?’
నని మదిఁ దలపోయు నాత్మేశుఁ జూచి,
మన మార, నా చంద్రమతి యిట్టు లనియెఁ.—
‘ కడు దూపటిల్లె నక్షత్రకుఁ; డింక
నడవ నోపఁడు సుమ్ము నరనాథచంద్ర.
యెలమిమై నిచ్చట నీరాత్రి మనము
నిలుచుట కార్యంబు నిక్క మూహింపఁ.
చయ్యన నింక నెచ్చట నైన వెదకి
తియ్యని జలములు దెచ్చి త్రావించి
విపుల పల్లవ తాళవృంతానిలమున
నుపచరింపక యున్న నొప్పమి పుట్టు.
బాలుండు, నది గాక బ్రాహ్మణుం డసము

ఉల్లము = మనసు. ఈవిధిన్ = ఈవిధముగా. మూఁడెన్ = కలిగినది. ఎడప్రొద్దు = సంజవేళ. దూపటిల్లెన్ = దప్పిగొనెను. విపుల పల్లవ తాళవృంత అనిలమునన్ = పెద్ద చిగుళ్ల విసనకఱ్ఱ గాలిచేత.

శీలుండు కౌశికశిష్యుఁ డుత్తముఁడు,
కృపకుఁ బాత్రుండు, రక్షింపు.' నావుడును;—
నృపపుంగవుండు దానికి సమ్మతించి,
కెలఁకులఁ గలయ వీక్షించు నాలోనఁ;—
దొలఁగ కదృశ్యుఁడై తొల్లి యవ్విభుని

—మాయామునిస.—

నొనర వెన్కొని వచ్చు చున్న కౌశికుఁడు
మనుజనాథుని నేఁప మదిని జింతించి,
దంతఘాతకుఁ డను దానవు నొకని
వింతగాఁ బుట్టించి, వినుమని పలికె.—
'ధరణీశు మాపటి దాఁక నిచ్చోట
మఱపి మాటలఁ బెట్టి, మఱి నేర్పు మెఱసి
శాకినీ భూత పిశాచ సహస్ర
భీకరం బగు నల్ల బేతాళ వటము
కందువ చెప్పి, యా ఘన మహీరుహము
క్రింద నీరాత్రి నిద్రింపఁగఁ బనుపు.
మావట్టి బేతాళుఁ డమరుల నైన
దీమసం బడఁగించి దిగఁబాఱ మ్రింగు.
వాని డాకకు నెంతవా రోర్వ లేరు.
పూని నీ విటు సేయు, పొమ్మ' న్న; — నపుడు,
తల వడంకెడు వృద్ధ తాపస వేష
మలవడ ధరియించి యా మాయలాఁడు
మెదిచి తెల్లని భూతి మే నిండ నలఁది,
పెదపెద రుద్రాక్ష పేరులు వేసి,

కెలఁకులక్ = ప్రక్కలను. దానవున్ = రాక్షసుని. కందువ = చోటు. దీమసము = ధైర్యము.

వింతగా జడ లెల్ల వ్రేలాడ విడిచి,
దొంతి బుఱ్ఱల కాయ దోడల పై నునిచి,
ఘన కమండలువుఁ జెంగట నట్టు వెట్టి,
తనరారు దండంబు తరువునఁ జేర్చి,
నలువారు కృష్ణాజినంబుపై నడుము
నలి నిక్కఁ బద్మాసనమునఁ గూర్చుండి,
కొనముక్కుమీఁదఁ జూడ్కులు సక్క నిలిపి,
మునుకొని జపమాల పూస లెన్నుచును,
మరునిష్ఠ నున్నట్టు లుండఁగాఁ; — జూచి,
ధరణీశుఁ డమ్ముని దగ్గఱఁ జేర
నడిచి, సాష్టాంగ ప్రణామంబు చేసి,
కడుభక్తిమైఁ గరకమలముల్ మొగిచి,
ముద మొప్పఁ బలికె 'నో మునిచంద్ర, వేఁడి
వెద చల్లుచున్న యీ వేసవియెండఁ
బరితాప మొందు నాపై గృపామృతము
గురియుం నీ చూపు నిగుడ్పవే?' యనిన;—
నొక్కింత తడవున కొఁధ్యాన బొమల
నిక్కించి, యా ధరణీవిభుఁ జూచి,
పెనఁచి పక్షులు గూండ్లు పెట్టిన కతన
విన రాదు మనవి నా వీనుల; కీవు
నలిగి వచ్చినజాడ నంతను మదిని
దెలియఁగా మా యోగదృష్టిఁ గాంచితిమి;
విక్రమలీలపై విలసిల్లు మొదలి
చక్రవర్తివి, హరిశ్చంద్రాహ్వయుఁడవు;

నట్టువెట్టి = ఎదురు పాటుగా నుంచి. తరువునన్ = చెట్టున.
పెనఁచి = అల్లి.

తుకతుక లేక కీర్తులు మిన్ను ముట్ట
సకలరాజ్యము నొక సంయమి కిచ్చి,
యలమి నాతనికి మున్నిచ్చితి ననుచుఁ
బలికిన ధనము సంపాదింపఁ బూని,
నీవు నీ సుతుఁడును నీ వధూమణియు
నీ విధి నలమరి యేఁగుచుండఁగను,
గురువాక్య మొనరింపఁ గోరి మీమీఁదఁ
దరువు వచ్చిన ముని తనయుఁ డిచ్చోట
నొదివిన దప్పిమై నుర్విపైఁ బడిన
నుదకంబు లడయుచు నున్నాఁడ' ననుడు;
విని మనంబునఁ జాల విస్మయం బంది
మనుజేశుఁ డత్తఱి మఱియు ని ట్లనియె.—
నతియు నేనును భవచ్చరణపద్మంబు
లతి భక్తిఁ గొలిచి యే పగు నంత దాఁక
నిలిచెద మిచ్చోట నీ సమీపమునమున
సొలపు దీఱఁగ మునిసుతునితోఁ గూడి.
ఘన మైన మత్పుణ్యకర్మంబు కతన
నెనయు మా దుశ్చింత లిన్నియుఁ బాసె.
మునినాథ, నేఁ బోయి ముద మొప్ప జలము
గొని వచ్చు నీలోనఁ గుత్తుక మిడికి
మునికుమారుఁడు దాహమునఁ జచ్చె నేని
యనఘాత్మ మఱి బ్రహ్మహత్య సిద్ధించు;
నెలకొన్న కరుణమై నీ కమండలువు
సలిలంబు లీ బ్రహ్మచారికిఁ బోసి

తుకతుక=శంక. సంయమికిక్=మునికి. అలమరి = శ్రమపడి.
తరువు=నిక్కచ్చి కాఁడు. ఒదివిన=క్రమ్మిన. మిడికి=ఎండి. సొలపు=శ్రమ.

ప్రాణదానము సేయు.' మనుటయు నవ్వ
క్షోణీశుతోడ నక్కుటిలాత్ముఁ డనియె.—
'నేకాకి నై తగు లేమిటివలన
లేక కాఱడవుల లీల నిట్లున్న
నే నేడ? నీ వేడ? నెలఁతుక యేడ?
పూని తపోవిఘ్నమున కిది త్రోవ.
తగులాటము లన్న మా తల కంటగించు.
సురలు సన్నిధి నున్న సుదవు నాగ్రహము.
వదలక మీ రింక నసియింప వలదు.
బెదరుఁ జిత్తము నాకుఁ బిట్టు బుజ్జిన.
నలినాప్తకులనాథ, నా కమండలువు
జలము లల్పములు, నక్షత్రకుం డెట్లు
బ్రదుకు నీ యల్పంబు పానంబువలన?
నిది బుద్ధి గాదు; నీ వీటు విను మింకఁ;
జెలువార నిచటికిఁ జేవాటు నేలఁ
గల దొక నిర్మల కమలాకరంబు.
పాలు పొందు తత్తటంబున మహావటము
బలసిన శాఖల బయ లెల్లఁ గప్పి
యిర వొందు. నచ్చటి కిందటఁ గొనుచు
నరిగి పథిశ్రమ మంతయుఁ దీఱ
నుదకంబు గ్రోల్చి యా యుర్వీరుహంబు
వదలక చేర్పు; మెవ్వారి తావుఁ గాదు.
చనుము నీవచటి కీ బాడగా.' ననుచుఁ
జనియె నదృశ్యుఁ డై చయ్యన. నంత

తగులు = సంపర్కము. కంటగించుక = గగుర్పొడుచును. బలసిన = వ్యాపించిన. పథి - = 'దారి. ఉర్వీరుహంబు = చెట్టు. తావుక = చోటును.

## — రాత్రి —

రవిబింబ మపరాంబురాశిలో మునిఁగె.
గవఁ బాసి చక్రవాకంబులు గుందెఁ,
కొఱఁకులు మాని పక్షులు గూండ్లు సేరెఁ,
గుఱుకులు గట్టి చీకురువాయు లెడరెఁ,
బొలిచి తారలు మింటఁ బొడగూపఁ దొడఁగె,
జిలుఁగుగాఁ దొలుసంజ చీఁకటి పర్వెఁ,
జెవులు సిందఱలు వోఁ జెలఁగెఁ జిమ్మటలు,
దివిరి పుట్టలు వెళ్లి తిరిగె సర్పములు,
మందుమాపులతోడ మలసె ఘూకములు,
దండిభూతంబు లుద్దండత మెలఁగె.
నప్పుడు భూపాలుఁ డా మాయతపసి
సెప్పిన యా మట్టిచెట్టు చక్కటికిఁ
జనఁ బూని, నందనుఁ జంకను బెట్టి,
మునికుమారుని దనమూఁపుపై నునిచి,
యాఱకడంబునఁ గాంత నమువుగా నునిచి,
యొఱ వాఱఁ బెఱికి మహోగ్రంబు గాఁగఁ
గరమునఁ బూనిన ఖడ్గప్రకాశ
మరుమగాఁ గరదివ్వె యై త్రోవఁ జూప,
నసహాయశూరుఁ డై యరుగు చున్నంత;

## — మాయావసిష్ఠము —

వసుమతీనాథు భావంబు గలంప

అపర అంబురాశి=పడమటి సముద్రము. కొఱఁకులు=మేఁతలు. కుఱుకులు=గుంపులు. జిలుఁగుగాన్=సూక్ష్మముగా. ఘూకములు=గ్రుడ్ల గూబలు. చక్కటికిన్=తావునకు. అఱకడము=మూఁపు.

ననువు విచారించి యప్పటి మాయ
దనుజుండు తనవికృతపు రూపు మాని
యెలమి వసిష్ఠ మునీశ్వ రాకార
మలవడఁ గైకొని యధిపు కట్టెదుర
నిలిచి దీవించిన; — నీరజమిత్రు
కులదీపకుండును గొబ్బునఁ బాదము
ముదమున హస్తముల్ మోడ్చి ఫాలమునఁ
గదియించి పలికె: — 'నక్రూట! గురునాథ,
యిప్పటి కీవేళ నేమికారణము
విచ్చేసితిరి జగ ద్విఖ్యాత చరిత?'
నావుడు; — 'విన దయ్య నరనాథ చంద్ర,
పావన సత్య సంభాషణ తిలక;
కపటనాటకుఁ డైన కౌశికుఁ డాత్మఁ
గృప మాలి నినుఁ బట్టి కిటుకులు వెట్టి
యలయక వడిఁ జేర్చి యదలించి గుండె
జలుకు పుట్టించి నీ సకల రాజ్యంబు
గోడు గుడువఁ బుచ్చుకొని, యొక జిల్ల
ద్రాడుగా మరుధనిదావలఁ (?) బెనఁచి,
కొడుకు నిన్నును నాలి ఘోరాటవులకు
వెడలఁ ద్రోచిన వార్త విని, మదిఁ గుంది
చనుదెంచితిని. హరిశ్చంద్ర, నీ విట్టు
లనద చందమున నట్టడవులఁ దిరుగఁ,
జెనఁటి యై ని న్నింత చేసిన గాధి
తనయుని మత్కోప దావాగ్ని శిఖలఁ

అనువు = ఉపాయము. జలుకు = భయము. గోడు = దుఃఖము. జిల్లద్రాడు = పురియొక్కించిన(?) త్రాడు.

జాగమర నెరిఁబంచి ప్రసుకించి నిన్ను
మఱగించి నీ పంపుమానిసిఁ జేసి
యెల్లరాజ్యంబు నీ కిప్పింతు మరల
నెల్లి ప్రొద్దున.' నన్న; — నినకులేశ్వరుఁడు
తన సూనృతము పెంపు తలకొని మఱియు
వనియు నకపట సంయమివరుతోడఁ.
" గొనియాడఁ దగు సూర్య కులమునఁ బుట్టి,
జనసుతుం డైన త్రిశంకుభూపతికి
జనియించి, వసుమతీ చక్ర మంతయును
ఘన బాహు బలమునఁ గైకొని, నిత్య
సత్య సంధుం డన జగముల నెల్ల
నిత్యసత్కీర్తుల నెగడిన నన్నుఁ
బూని దుర్బోధలు బోధించి సత్య
హీనుఁ గావించెదో యితరునిఁబోలె?
మున్ను విశ్వామిత్రి ముని శిఖామణికిఁ
జె న్నొంద ధార వోసిన రాజ్య మెల్ల
' దాన మిచ్చుట లేదు, తప్పితి.' ననుచు
నే నేల నేలుదు నిలను బ్రహ్మఋషి?
దలకొని నామేలు తలఁచుట నాకు
నిల యెల్ల మీ రేల నిచ్చుట." యనినఁ;—
జిఱునవ్వు నవ్వి యాక్షితిపతితోడ
మఱియు నిట్లనియె నమ్మాయ వసిష్ఠుఁ.—
' డనఘాత్మ, నీతలం పట్టిద యేని
విను మింక నొక బుద్ధి వివరంబు గాను;

మఱగించి = అనువర్తించునట్లుచేసి. పంపుమానిసిన్ = సేవకుని.
ఎల్లి = రేపు. సూనృతము = సత్యముయొక్క.

నందనుండును నీవు నాతియు వెతలఁ
బొందక నోపరు, పుట్టుభోగాలు మీఱ.
మనమార మా యాశ్రమమునకు వచ్చి
దినదినమును హోమధేనువు గురియు
బహువిధాన్నంబులఁ బరితృప్తిఁ బొంది
విహరింప, నభిమత వికసిత కమల
కమలినీ స్థలరుహ కమల వనాంత
విమల చంద్రోపల వేదికా ప్రాంత
పరిపక్వ బహు ఫల భారావనమ్ర
* సరస బాల రసాల సాలాగ్ర కలిత
కలకంఠ శుక నీలకంఠ చకోర
కలరవ శారికా కలకలంబులును,
ఫలిత పుష్పిత లతాభవ నాంతరాళ
† చలిత మరంద నిర్ఝర కణ శిశిర
కలిత మిళింద సంగత పిక కీర
లలిత గీతామృత లహరీ విలోల

కమలినీ = సరస్సులయు. స్థలరుహకమల= మెట్టదామరలయు. చంద్ర ఉపల వేదికా = చంద్రకాంతపు ఱాల తిన్నెలయు. ప్రాంత= ఓరలయందు. అవనమ్ర=వంగిన. బాల రసాల సాల = గున్న మామిడి చెట్లయొక్క. కలకంఠ శుక నీలకంఠ చకోర కలరవ శారికా=కోకిలలు చిలుకలు నెమళ్లు వెన్నెలపులుఁగులు పావురములు గోరవంకలు-అనువీని యొక్క. లతాభవన అంతరాళ=తీఁగయిండ్లలోపల. చలిత = పాఱు చున్న - మరంద నిర్ఝర=తేనెవాఁకల - కణ = తుంపురులచే-శిశిర= చల్లనైనట్టియు. కలిత = కూడిన - మిళింద=తుమ్మెదలతో - సంగత= కూడిన - పిక కీర = కోయిలలయు చిలుకలయు. లహరీ=ప్రవాహము నందు — విలోల=ఆసక్తమైన.

* 'సరససాల' అని పూ. ము. † 'సరస మరంద' అను పూ. ము. ప్రాసభంగము.

కిన్నర కర వల్లకీ నాద ముదిత
సన్నుత సారంగ శాబక ప్రకర
కోమల వానీర కుంజపుంజములు,
* నేము మెలఁగ నచ్చిగఁ గల.' ననిన ;
జననాథుఁ డా ధూర్తసంయమితోడఁ
దిన మది ధైర్యంబు తప్పక పలికె.—
"ననిచిన భక్తిమై నాకు నీ వెనుకఁ
జను దేర నది యెట్లు సమకూరు? వినుము.
పరిపాటి నే మున్ను పలికిన మితికి
స్థిరమతిఁ దీర్చి, కౌశికమునిచేత
'ననఘాత్మ, నీ ఋణం బంతయుఁ జెల్లె.'
ననిపించి, పిదపఁ బొమ్మనిపించుకొనక,
నప్పు పై నుండంగ నన్ను పానాదు
లెప్పాటఁ జవి యగు? నెన్ని యందముల
నేగతి నిం పగు? నింక నొం డనక
సాగి విచ్చేయుఁ డాశ్రమమున." ననిన; —
మైకొన కనియె నమ్మాయవసిష్ఠుఁ
'డా కౌశికునిఋణం బంతయుఁ దీఱఁ
జెల్లొందఁగా ననుష్ఠించు నన్మంత్ర
మున్నది; దాని నీ కుపదేశ మిత్తు;
నది లక్ష జపియింప నగు నష్టసిద్ధి
విదితంబుగా.' నన్న; — విభ్రాంతి నున్న

వల్లకీ=వీణయొక్క. సారంగ శాబక = జింకపిల్లల - ప్రకర = గుంపుగల. వానీర=ప్రబ్బలితీఁగల. నచ్చిగఁ=నిక్కముగా. ననిచిన=పూచిన. అష్టసిద్ధి = అష్టైశ్వర్యములసిద్ధి.

* 'అచ్చుగఁ' అను ముద్రణమున యతిభంగము.

మనుజేశునకుఁ జంద్రమతి యిట్టు లనియె.—
'దినకరకులనాథ, తెలియక యిచటఁ
జను నె మాటలఁ బ్రొద్దు జరుపుచు నిల్వ,
మునితనూజుఁడు జలమ్ములకు వాచాఁ?
గపటనాటకుఁ డైన కౌశికుఁ డాత్మఁ
గృప మాలి మసల నంకిలి వెట్టె నిట్లు
చెలఁగి పుత్తేర, వసిష్ఠునియాపు
నెలమిఁ గైకొని యితం డెవ్వఁడో యొక్క-
మాయకాఁ డేతెంచి మనలను గల్ల
సేయుచున్నాఁ; డెడ సేయక వీనిఁ
దెగటార్పు.' మను నంత దిగ్గన వాఁడు
మగిడె నవ్వృశ్చ్యఁ డై మాయ పెంపునను.

—. సర్పవృశ్చికాదులు .—

నలి రేఁగి యూట మూఁడు నాల్గు వాలములు
గల వృశ్చికంబులు గ్రమమునఁ బడియె;
నిరువది యిన్నూరు నేనూరు తలలు
నరుగు పన్నగము లుద్ధతి వేనవేలు —
మెఱుఁగుఁ గోఱ లుఱ వల్మీకముల్ వెడలి,
యూఱు పుట్టఁ గోమల నుఱికి, * యుగ్రత్వ
మడరంగ జిహ్వ లల్లార్చి, బు స్సనుచు
నొడిసియుఁ,—బ్రాణంబు లుడుగఁగ మొత్తి
యాతిమితి మర్మంబు లందంద నొవ్వఁ
గఱచియుఁ, — బదములు గదియఁ జుట్టియును, —

అంకిలి పెట్టఁగ = అడ్డపెట్టుటకై. పుత్తేరఁగ = పంపఁగా. పన్నగములు = పాములు. ఊఱఁగ = ఒప్పఁగా. ఊఱు పుట్టఁగ = ఊఱ్ఱను ధ్వని కలుగు నట్లు. కోమలఁగ = చివరలనుండి.

* 'యత్యుగ్ర' అని పూ. ము.

బెడిదంపుఁ గోఱలఁ బిరిగొన్న మెఱుఁగు
లుదరంగ వదన గహ్వరములు విచ్చి
ఘూర్ణించి నేలతోఁ గొట్టి, వాలములు
తాటించి మిగుల దిక్తటములు వగులఁ
బదివేల పిడుగులు పడిన చందమున
నదరి రొప్పుచు మీఁద నుఱికియు;—నిట్లు
చేకొని యాలఁచు వృశ్చికముల నుగ్ర
కాకోదరంబుల ఘనవ్యాళావళుల,
చదియఁ ద్రొక్కియు, నేలఁ జమరియు, ముష్టిఁ
చదిమియుఁ, గటములు చదియలు గాఁగఁ
బడగ లొత్తియును, నిర్భరవృత్తి విసము
లుడుగక ముఖమున నొడియ నందంద
వడిఁ జిఱజిఱఁ ద్రిప్పి వసుమతితోడ
నడిచియుఁ, గణికలయట్లు త్రుంచియును,
కోఱలఁ బాపియు, దంష్ట్రింబు లెల్ల
నూడి రాఁ బెఱికియు, నుగ్రఖడ్గమున
నఱికియుఁ, బొడిచియు, నాలుగు దెసలఁ
బఱపియు, నీరీతిఁ బరిమార్చి;—చుట్టుఁ
బన్నిన బహువిఘ్నపటలంబు లడఁచి
చెన్నొంది పెన్నిధిఁ జేరు చందమునఁ,

పిరిగొన్న = పెనఁచికొన్న. వదనగహ్వరములు = నోటిగుహలు. ఘూర్ణించి = ఊఁచి. తాటించి = చఱచి. కాకోదరములన్ = పాములను. చదియన్ = చితుకునట్లు. ముష్టిన్ చదిమియున్ = పిడికిటితో గ్రుద్దియు. కటములు = దవుడలు. చదియలు గాఁగన్ = చిదుగునట్లు. దంష్ట్రింబులు = కోఱలు. పఱపి = పాఱఁద్రోలి. చుట్టున్ = (నిధి పెకలించువాఁడు తన) చుట్టును. పన్నిన = కలిగిన. పెన్నిధిన్ = పెద్ద నిక్షేపమును.

జటుల పాఠీన భుజంగమ మకర
పటు నక్ర కర్కటోద్భట శింశుమార
ఘన కమఠాది భీకర జల గ్రాహ
జనక మై వన గజ జల పాన జనిత
ఘుమఘుమ శబ్ద సంకుల మైన మడువు
కమలాప్తకులుఁ డంతఁ గదిసి; - యచ్చోటఁ
దనయుని మునిపుత్త్రుఁ దనమూర్తి పత్ని
సను వొంద డించి, తోయములు ద్రావించి,
వెనుకఁ దా సంధ్యాది విధు లందు దీర్చి,
తని వార జలములు ద్రావి; - యాగ్రేన,

—. బేతాళవటము .—

* నాకుల తఱుచున నంటి పెల్లిటియు
చీఁకటి మేన నిల్చిన నల్పు గాఁగఁ,
గఱు దీర్ఘ శాఖాగ్ర కోటర ఫణుల
గరళ వహ్నులు కొఱకచ్చులు గాఁగ,
వఱలుజొంపముల వెల్వడు కీటమణులు
మెఱసి కన్నుల రాలు మిడుఁగుర్లు గాఁగ,
నురుతరంబుగ వ్రేలు నూడలు వ్రేళ్లు
విరియఁ బోసిన తలవెండ్రుకల్ గాఁగ,

పాఠీన=వేయి కోఱల చేఁపలు - భుజంగమ=పాములు. నక్ర=ఒకజాతి మొసలి. ఉద్భట=ఉగ్రములైన. శింశుమార=నీరుకోఁతులు. కమఠ==తాఁబేళ్లు. జల గ్రాహ=నీటనుండు ఘాతుకజంతువులను. గ్రేనక=ప్రక్కయందు. ఇటియు=దట్టమైన. కోటర=తొఱ్ఱలందలి. జొంపములన్ = ఆకుగుబురులనుండి.

* 'నాకుల తఱు చనునట్టి పెన్నెఱులఁ' అని. పూ ను,

కులిశ దుస్సహ ఘూక ఘూంకృతి ధ్వనులు
పెలుచ హుమ్మని వెఱపించుట గాఁగ,
దఱిమి మిన్నులతుదఁ దాఁక బిట్టెగసి
కొఱవిదయ్యము నట్టుకొని యున్నకరణి, —
నున్న బేతాళ వటోర్వీరుహంబు —
నన్నరేంద్రుఁడు గాంచి, యామాని క్రింద
నును పొగఁ బూరిఁ బానుపు రచియింపఁ
గొనకొని నక్షత్రకుఁడు శయనించె.
ఆ మునినందను నడుగుల క్రేవ
భూమిపైఁ గట్టిన పుట్టంపుఁగొంగు
మడతగాఁ బఱచి కుమారుఁడుఁ దాను
నడచిన యలఁతఁ బేగాఁకట మునిఁగి
పడి నిద్రఁ జెందిన బాలమృగాక్షి
నుడురాజబింబాస్య నుత్పలగంధిఁ
దనుమధ్య నున్నతస్తనకుంభయుగళఁ
దనదేవిఁ, జూచి, చిత్తంబునఁ బొగిలి;—
పాయని మృగ భూత పంక్తులవలన
నే యుపహతులు చన్నొసఁగక యుండ
నా మువ్వురను వేగు నంతకుఁ గావ
భూమీశ్వరుండు తెంపునఁ గాసె బిగిచి,

కులిశ=వజ్రాయుధమువలె. ఘూక = గ్రుడ్లగూబలయొక్క - ఘూంకృతి=ఘూంకార. ఉర్వీరుహంబున్ = వృక్షమును. నునుపు=నున్నఁదనము. పూరిన్=గడ్డితో. పుట్టంపు=వస్త్రముయొక్క. ఉడురాజబింబ ఆస్యన్ = చంద్రబింబమువంటి మొగము గల దానిని. ఉత్పల=కలువ. తను=సన్నని. ఉపహతులు=ఉపద్రవములు.

యురుతర భుజవిక్రమోన్నతి మెఱయఁ
గరవాలహస్తుఁడై కాపుండె. — నంత,

## —. పిశాచములు .—

నా యర్ధరాత్రంబు నప్పు డా మట్టిఁ
బాయక వసియించు బహుపిశాచములు
మానిసి గౌలుఁ బల్మఱు పసిగొనుచు
నానాముఖంబుల నలి దిగఁ బాఱి
కిలకిలస్వరములఁ గెరలి యొండొంటిఁ
బిలుచుచు రేఁగిన పెరయీఁగలట్లు
తఱిఁ గని కవియ; నదల్చి రా సుండఁ
బఱపి, భూపాలుఁ డా బడుగు దయ్యములఁ
బట్టి వధించు టే పౌరుషం బనుచు,
నెట్టన మొల నున్న నెఱికత్తిఁ దివిచి
కొన్నింటి ముక్కులుఁ గొన్నింటి చెవులుఁ
గొన్నింటి చెక్కులుఁ గోఁతలు వెట్టి
యసికోఁతలుగఁ గోయ;—నంత నవ్విభుని
యసికోఁత లసిఁబోవ, నప్పిశాచములు

## —. బేతాళుఁడు .—

బేతాళపతికిఁ జెప్పిన;—వాఁడు నడరి
భూత భయంకర స్ఫూర్తి మై పేర్చి,
పొరిఁ దారకలు మొలపూసలు గాఁగఁ
బెరిఁగి, బ్రహ్మాండంబు భేదిల్ల నార్చి,

కరవాల=కత్తి. గౌలున్=వాసనను. పెర=తేనెతెట్టె. బడుగు=చచ్చుదు. నెట్టనన్=తటాలున. నెఱి=వాఁడి. అసి=చిన్న. అసి=కత్తి. అసిఁబోకన్=తప్పిపోఁగా. స్ఫూర్తిన్=విజృంభణతో. పేర్చి=అతిశయించి. పొరిన్=వరుసగా. తారకలు=నక్షత్రములు.

భీకర డాకినీ ప్రేత బేతాళ
శాకినీ గణము లసంఖ్యముల్ గొలువ(,
బరుసనై పెరి(గిన పల్లవెంట్రుకలు
గరువలిచే భయంకరముగా( దూల,
వడి( ద్రావ ఱొమ్ముపై వఱదలు వాఱి
యుడుగక వడియుచు నున్నరక్తమును 2050
గాలానల జ్వాలకైవడి( గ్రాల్చు
నాలుక నందంద నా(కి సోలుచును,
బెను పొంద నరములు( బ్రేవులు( గలయ(
బెన(చి వెంట్రుకలతో( బెదపెద్దతలలు
ముడివడ నేసిన ముడుసులపేర్లు
మెడ ద్రేల, వలచేతి మెఱు(గు శూలమున(
బొట్టు వ్రక్కలు గా(గ బొడిచి తూ(గాడ(
బట్టిన పీను(గు పచ్చి మాంసమును
గఱచి పీ(కుచు(, జేత( గల మోటు(బలక
పుఱియ మూ(గలు బొడబొడ మని మ్రోయ, 2060
మెదటి వట్టులు గట్టి మెలికలు గొన్న
ముదురు జంజాలు మీసముల నులికొల్పి,
ఘనతర లయకాల కాలమేఘంబు
మునుకొని బేతాళమూర్తి వహించి
చటుల రౌద్రాకృతి( జను దెంచు లీల(
బటు వజ్ర నిష్ఠుర పాద ఘట్టనల

పరుసన=బిరుసు. పల్ల=కావి. కరువలిచేక=గాలిచే. కాల=ప్రళయ. మోటు( బలక పుఱియ=మొద్దు కొయ్య పునుక. మూ(గలు=దోమలు. మెదటి=మస్తిష్కముయొక్క. లయ కాల కాల మేఘంబు=ప్రళయ కాలపు నీల మేఘము.

లవలవ యై కుతలంబు గ్రక్కదలఁ,—
దవిలి యేతెంచు వేతాళునిఁ జూచి,
యప్పుడు భయ మించు కైనను లేక,
తెప్పిరి నిద్రఁ జెందిన చంద్రమతిని
దనతనూభవు మునితనయునిఁ జూచి,
తనలోన నగచి, 'యి త్తతి వీరి నిద్ర
సెడకుండ వీని నిర్జించుట కర్జ
మడరంగ.' ననుచుఁ, జయ్యన నెదు రేఁగి,
యటఁ ద్రోచి రా కుండ నడ్డ మై నిలిచి,
పటు ఖడ్గ మంకించి పలికె భూవిభుఁడు.—
'ఎందుండి వచ్చెద, వేల, యీవేళ
కెం? దటు దవ్వగా నేఁగుమీ తొలఁగి.
వడిఁ ద్రోచి యిటు క్రమ్మి వచ్చితి వేని
నడుము రెండుగ నిన్ను నఱకి పోవైతుఁ.
గయ్యాలక్రచ్చ లై కడఁగి యీవచ్చు
దయ్యాలముక్కులు దఱిగి * దండింతుఁ.
దమకించి లోహశోధనము లాఁకటికి
నమల వచ్చె నెటు మైనపు దంతములను?
నిప్పుయు జెద లంట నేర్చునే? మాకు
నిప్పుడు నీ చేయు నెగ్గు లే మౌను?
జెలఁగి విశ్వామిత్రు శిష్యుఁ డా వడుగు,
నలినలోచన యిది నాకులకాంత,

లవలవయై=భేదిల్లినదై. కుతలంబు=భూతలము. అంకించి = జళిపించి, కయ్యాలక్రచ్చలు = జగడాలమారులు. తఱిగి=ఖండించి. తమకించి = త్వరపడి. లోహశోధనములు=ఇనుప నిమ్మపండ్లు.

* 'ఖండింతు' పూ. ము.

యిమ్ముద్దులాఁడు న న్నలరించు పుత్త్రిఁ,
డిమ్మెయి నిద్ర నోయెడుచోటి కిపుడు
నిద్ర వారింపఁ బూనిన నిన్ను దీర్ఘ
నిద్రఁ బొందించి నే నీగర్వ మడఁతు.'—
ననుచును వాఁ డట్టహాసంబు సేసి,
కనుఁగవఁ గోపాగ్నికణములు రాల,
వేఁడిమంటలు నోర వెడలంగ, నిలిచి,
వాఁడికోఱలఁ దీడి, వడి నోరు గఱచి,
ఘు మ్మని ఘన గిరిగుహాలు మార్మ్రోయ
హు మ్మని మ్రోయుచు, నుర్వీశుఁ జూచి,
'యోరి! నా ముందఱ నోడక నిలిచి,
ధీరతఁ! జావఁగఁ దెగుతెంపుఁ జేసి,
రజ్జు లాడెదవు! నా రాయిడిఁ గలఁగి
ముజ్జగంబులుఁ బెల్లు మురియుచు నుండు.
దేవతలకు నైన దృష్టింప రాని
నా వటమూలంబునకు వచ్చు టెట్లు?
వచ్చి యా మ్రాని కావలి భూతములను
జెచ్చెర ముక్కలు సెక్కుట యెట్లు?
చెక్కి యంతటఁ బోక చేరి నాయెదుటఁ
బెక్కులు ప్రేలి దర్పించుట యెట్లు?
కడఁగి మహామారి కడుపుఁ బొట్టేలు
వడిఁ జొచ్చి నట్లు నావనముఁ జొచ్చితివి.

దీర్ఘనిద్ర = చావు. రజ్జులు = దుర్భాషలు. రాయిడిచే = ఉపద్రవము చేత. మురియుచుక్ = కుములుచు.

చచ్చితి గా.' కని చదలఁ గ్రొమ్మించు
లచ్చుగాఁ జెదర, మహోగ్రభసమున
నడి శూల మల్లార్చి, వైచిన; భీతి
యడరఁగ, జనపాలుఁ డది ద్రెవ్వ నేసె.
వెండియు వాఁ డొకవృక్షంబుఁ జేతికి
చండాంశుకులుని వక్షంబు బిట్టడిచె.
దానఁ గంపింపక తరువుతోఁ గూడ
వానికరంబు భూవరుఁడు ఖండించె:
మిగుల నొచ్చియు వాఁడు మిడివోని కడిమి
బెగ డొందఁ బెడచేతఁ బెనురాల రువ్వ.
నవి యెల్లఁ జిద్రుపలై యవనిపై రాలఁ
దివిరి ఖడ్గము కేలఁ ద్రిప్పుచుఁ, గదిసి
వడిఁ జేర్చి, నీల పర్వత శిఖరంబుఁ
బుడమి డొల్లఁగఁ జేయు పురుహూతు లీల
భూతముల్ భయ మంది పారిఁబోరిఁ బఱన
బేతాళుతలఁ ద్రెవ్వ వ్రేసె భూనాథుఁ.

— మహావృష్టిబాధ. —

డప్పుడు కౌశికుఁ డంతరంగమునఁ
గప్పిన చలమునఁ గరుణఁ బో విడిచి
నిగిడి ప్రేరేచిన నీలమేఘములు
గగనమండల మెల్లఁ గప్పి యొప్పార,

టీ: అడరఁగన్ = కలుగునట్లు. చదలన్=ఆకాశమందు. క్రొమ్మించులు = క్రొత్తమెఱపులు. మిడివోని కడిమిన్ = తగ్గని బలముతో. బెగడు=భయము. పురుహూతు=ఇంద్రుని.

నెఱ రంగు నీలాల నెలకట్టుమీఁద
గిఱికొన గాజు నిగిడ్చి పై నింపి
కలయంగఁ బట్టించి కాటుక రొంపి
నలికినగతి నొప్పె నంధకారంబు.
నంతకంతకు దట్టమై చెట్టు గుట్ట
గుంత మిఱ్ఱనుచుఁ గన్గొన రాక, యపుడు
మున్ను ఱెప్పలు డాయ మూసిన మగుడఁ
గన్నులు విప్ప నొక్కటి గాఁగ నుండెఁ.
గాల మేఘం బను కాలభైరవుని
ఫాల లోచన తీవ్ర పావక శిఖలఁ
బొగసెడి దిగధీశపురముల నెల్ల
నెగసి భుగుల్లను నెఱపుంట లనఁగ
మెఱపులు ధళధళ మెఱయక మున్నె
యుఱుములు బెళబెళ నుఱిమె; నయ్యుఱుము
లటు మిన్నుతల మ్రోయ నంతను మున్నె
పెటపెట పెటిలి పెన్బిడుగులు వడియెఁ.
* బిడుగులు నుఱుములుఁ బేర్చు వేగమునఁ
బడబడ వడగండ్లు వడియె నెల్లెడల.
వడగండ్లకంటెను వాన మున్నాడి
కడవల జలము లొక్కట వంచి నట్లు
బోరనఁ గురియ; నద్భుత మెనవాన,
నాఱని దేజంబు నమిత ధైర్యంబు

నెఱ=నిండు. నెలకట్టు=రాతికట్టడపు నేల. గిఱికొనఁగ=చుట్టు రా. గాజు=నల్లని గాజు మట్టిని. నిగిడ్చి=గోడపెట్టి. నింపి=మూసి: కాల భైరవుని=ప్రళయకాల రుద్రుని.

* '...బృథుల వేగమునఁ|బడఁబడ...' పూ. ము.

నగలని సత్త్వంబు నతుల సాహసము
తెగని రాజసము నై దిననాథసుఁడు;—
వానఁ దొప్పఁగఁదోఁగి, పఱద పెన్నీట
నాని, యంగంబులు నరములు నొవ్వ
విడువక రువ్వెడు విషమవాయువున
వడఁకు నింతిని బుత్త్రి వడఁగును బిగిచి
యనునయం బెసఁగ నిజాంకపీఠమున
నను వొంద నునిచి దైన్యము నొందకున్నఁ.—

—.సర్పశరభాదిజంతువులు..—

దటి కొని చెఱుపంగఁ దలఁచి కౌశికుఁడు
కరుణ లేక సృజింపఁ, కలగొన రేఁగి,
నలి రెండు మూఁడును నాల్గు వాలములు
గల వృశ్చికములును – క్రమమున మఱియు
నిరువదియును నూఱు నిన్నూఱు తలలఁ
బరఁగు పన్నగములుఁ – బది నూఱు వేల
వాఁడికోఱలు గల వన్యమృగములుఁ,–
బోఁడిమి బహుకోట్లఁ బుట్టించి పెక్కు–
భూతగణంబులఁ బోరి నంప, నవియు,–
భూతలాధీశు సంపూర్ణ ప్రతాపు
నటిమిటి మెయి ముట్టి యందంద గుట్టి
కఱచి కాటులను రక్తముఁ గ్రమ్మఁ జేసి
నొఱపించుచును బహువిధముల నొంప;—
సరభసోద్వృత్తి జర్జరితాంగుఁ డగుచు

అతుల=సాటిలేని. కలగొనఁగ = వ్యాపించునట్లుగా. సరభస ఉద్వృత్తిన్=వడితోడి యుద్ధతితో. జర్జరిత అంగుఁడు=నలిగిన యవయవములుగలవాఁడు.

భుజగకంకణుఁ దలపోసి మహోగ్ర
భుజగవృశ్చికముల స్ఫురణ వారించి,
శరభదేవునిఁ గోరి సన్నుతిఁ జేసి
శరభాది మృగముల సంరంభ మడఁచి,
భూతనాయకు పాదములు సంస్మరించి
భూత సంఘముల యుబ్బులు జబ్బు సేసి,
పిసుకుఁబెల్లునఁ గ్రాఁగి, వేగ యీరీతి
వెసఁగు కౌశికు మాయ లెల్లను గడచి,
బలసిన నీహారపటలంబుఁ బాసి
వెలుఁగు బాలార్కునివిధమున వెలుఁగు—
మనుజనాథుని ధైర్యమహిమకుఁ గాధి
తనయుండు వెఱఁ గంది తనలోనఁ గుంది,—
'మలఁగక నాపన్ను మాయ లన్నియును
గొలుపవు వీనిపైఁ, గ్రొవ్వి నే నకట!
ఘోరప్రతిజ్ఞఁ గైకొని బేల నైతి!
నేరమిఁ జెడిపోయె నేఁడు నాతపము.
ప్రల్లదంబున నిట్టి భంగంబు నొందెఁ.
జెల్లుఁ గా కింక వసిష్ఠుని పూన్కి.'
యని తన నేరమి కాత్మలో వగచి,
మనమునఁ దెలివి గ్రమ్మఱ నూలుకొలిపి,
'మోస మెవ్వారి యందు మొలవదు? మిగులఁ
జేసిన పని కింతఁ జింతింప నేల?

శరభ=ఎనిమిదికాళ్ల మృగము. శరభ దేవుఁడు=శివుఁడు. భూతనాయకుఁడు=శివుఁడు. క్రాఁగి=వేఁగి. నీహార=మంచు. మలఁగక=వెనుదీయక. నేరమిఁ=తెలివిచాలమిచేత.

మనసు ద్రిప్పక పెక్కు మతముల వీని
వెను వెంట నంటి యేవిధమున నైన
బొంకు నంతకు మళ్లి పోరదుఁ గాక,
నింక నే మైనఁ బో నీ.' నను నంతఁ; —

—. సూర్యోదయము. —

గలువల పగవాఁడు గాముల ఱేఁడు
జలజంబులకుఁ బొందు జక్కవ విందు
మూఁడుమూర్తుల నిట్ట మ్రొక్కుల గుట్ట
వేఁడివేలుపు ప్రభవించెఁ దూర్పునను.
బటుబుద్ధి నప్పు డాపార్థివేశ్వరుఁడు
వటమూల మటు వాసి వలనొప్పఁ జనుచు,
ముందట నళి బృందములు భ్రమియింపఁ
గెందమ్మికొలను వీక్షించి మోదించి
వెర వొప్ప సంధ్యాది విధు లందుఁ దీర్చి,
పరువడి నాయాయి పల్లెల నడిగి
భిక్షాశనముఁ దెచ్చి ప్రేమతోఁ దొలుత
నక్షత్రకునకుఁ బూర్ణంబుగా నొసఁగి,
కడమ యన్నము దానుఁ గాంతయు సుతుఁడు
నెడపక ప్రతిదినం బిట్లు భుజించి;
పురములు దేశముల్ పుణ్యతీర్థములు
నరనుతం బగు నూళ్లు నాళ్లును గడచి,
చనుచున్న ;—నారాజుఁ జలపట్టి చెఱుప

— దావాగ్ని. —

మనమునఁ దలపోసి మఱియుఁ గౌశికుఁడు

గాముల = గ్రహముల. నిట్ట = స్థానము. అళి బృందములు = తుమ్మెదల గుంపులు. చల పట్టి=చలము వహించి.

నమిత తపశ్శక్తి నయ్యగ్ని దేవు
నమర నాకర్షించి యతనితో ననియె.—
'ఓ పావకుఁడ, నీ మహోగ్రప్రతాప
మేపారఁ జుట్టి రా నెరగిలి ముట్టి
సుదతితోఁ గూడ నీక్షోణీతలేశుఁ
బ్రిదిలి పోవఁగ నీక పేర్చి దహింపు.
మనిలుని నీకు సహాయుఁ డై యొసఁగఁ
బనుపుదుఁ. జను.' మన్నఁ;— బనిపూని పేర్చి
యుఁగవడి విసరుమహోగ్రవాయువుల,
గరగర నొరయు శాఖలు గాఁక పుడమి
నెరయఁ గాలినఁ, జిఱునిప్పుక లొలసి
పొరిఁబొరిఁ గారాకుఁబ్రోవులు పొగసి
కఱువవంటల జీబుకొని యున్నకసవు
చుఱచుఱఁ గమరంగ, సురసుర పుట్టి,
దరికొని పొదరిండ్లు దళముగా మండి,
తరుపంక్తులకు నిక్కి, దళములు ముణుఁగఁ,
గమరి పువ్వులు ప్రమందఁగాఁ జివ్వ రనుచుఁ,
జిమిడి కాయలు నేలఁ జిటపాట రాల,
నరు ధూమ తతుల బి ట్టూఁదర లిడిన
పరుసునఁ దొఱటలఁ బాములు మడియఁ,

ఏపు ఆగన్ = పెంపు ఒప్పునట్లుగా. ఎరగలి = కార్చిచ్చు. ప్రిదిలి = తప్పి. పేర్చి = విజృంభించి. అనిలునిన్ = వాయువును. నెరయన్ = నిండుగా. ఒలసి = వ్యాపించి. కారాకు = ఎండాకు. పొగసి = రాఁజి. సురసుర = సుడిగాలి. దరికొని = నిప్పంటుకొని. దళములు = ఆకులు. చిమిడి = మాఁడి. పరుసునన్ = విధముగా.

పృథులశాఖలు గాలి పెళపెళ విఱిగి
పృథివిపై మ్రాఁకులు పెల్లుగాఁ గూలఁ,
బులుఁగులు బిట్టు వాపోవుచు నెగసి
పెలుచ ఱెక్కలు మాఁడి పెటపెటఁ బ్రేలఁ,
కరి సింహ శరభాది ఘన మృగ పంక్తు
లురవడి జ్వాలల నొరలుచు మడియ,
నల వార్ధి జలము చుం యన నింకఁ గ్రోలి
బలసి లోకము లెల్ల భస్మీకరింప
నడరెనో బడబాగ్ని యనఁ జుట్టు ముట్టి
పుడమియుఁ దిశలు నభోమండలంబుఁ
గప్పి మండుచు వచ్చు కార్చిచ్చు రాక
తప్పక వీక్షించి; ధరణీవల్లభుఁడు
జాలి నెక్కొన, నక్కజంబునఁ జింతఁ
దూలుచుఁ, దన దేవితోడ ని ట్లనియె.—
'నీ వన వహ్ని నింకే విధిఁ గడచి
పో వచ్చుఁ? జావక పోరాదు మనకు.
శంకించి మునితోడ నాడినమాట
బొంకు గాకుండ నాపూనిననాఁటి
మితికి ఋణం బెల్లఁ మేలుగాఁ దీర్చి
మృతిఁ బొంద లే నైతి, మృగనేత్ర. వినుము;
వావిరిఁ బుట్టినవారికి నెల్లఁ
జావక పోరాదు చర్చించి చూడ.

పృథుల=పెద్ద. ప్రేలన్=పేలఁగా. ఉరవడిన్ = వేగముగా. ఒరలుచున్ = ఓలుచు. నభోమండలము = ఆకాశముయొక్కవిరివి. అక్కజంబునన్=ఆశ్చర్యముచేతను. అంకించి=గుర్తించి.

ధరణీశునకు నాకు దగ్వ మేర్పడఁగఁ
బరబలంబులు సొచ్చి బలుపిడి నడిచి
వెస నురఃస్థలిఁ గాఁడి వీఁపున వెడలు
నిశితాస్త్రములఁ జచ్చి నెఱి నిందు నందు
వినుతి కెక్కుట మాని, విన నైఁప రాని
వనవహ్నిఁ గాలంగ వలసె నీరీతి.
నాతి, నా దుర్మరణమునకు వగవ,
భ్రాంతి యైనట్టి, యీ పట్టికి వగవ,
గురుభక్తి మేకొని ఘోరాటవులకు
నరుదెంచి మనతోడ నలజడిఁ బొంది
కడపట నేఁ డిట్లు కాలాగ్నిచేత
సుడివడు మునితనూజునకు నే వగతు.
నీ మహాపాతకం బేమిటఁ బాయుఁ?
గామిని నా కింక గతి యొండు లేదు.
కన్నుల నీ పాతకము గనుంగొనక
మున్నె యిచ్చెదఁ బ్రాణముల వహ్ని.' కనుచు,
మనసులో శివు నిల్పి మంటకు నెదురు
చనుచున్న యా హరిశ్చంద్రునిఁ జూచి;—
నిగుడు శోకము మది నిల్పి నవ్వుచును
దెగువమైఁ జంద్రమతీదేవి పలికె,—
'దేవ, మీ కిట్లెల ధృతి దూలి పలుక,
భావింప నసమాన భాగ్యసంపదల

కాఁడి=దూస్సి. నిశిత=వాఁడి. ఇందున్=ఇహమున. అందున్=పరమున. భ్రాంతి=గారాబు. మేకొని=సమ్మతించి. తనూజునకున్=కుమారునకు.

లలిత మంగళసూత్ర లక్ష్మి నిక్క మని
దలఁచెడుచో నాకు దైవ మెంతయును
బగఁ గొని యిటు నగుఁబాటు గావింప?
వగల నొక్కించుక వడి నిన్నుఁ బాసి
కడులోల నై యుండఁగా నెట్టు లోర్తు?
జడియక పదివేల జన్మంబులందుఁ
బతి నీవ కాఁ గోరి పడి వహ్నిఁ గాలి
మృతిఁ బొంది పొందుదు మీఁద నీ పొందు.
సమ్మద మార నీచన విచ్చి నన్నుఁ
బొమ్మని యానతీ. పోదు నే వేగ.'
అనిన భుగాలున నడరు శోకాగ్ని
మనసు సుఱుక్కని మనుజేశుఁ డనియె —
' జలజాక్షి, నీ కిట్టి సాహసకృత్య
మలవడ నోపునే! యక్కటా! నీవు
తోడఁబడఁ జచ్చినతోడ నే బెగడి
విడివడఁ బ్రాణముల్ విడుచు నీశిశువు.
సుతుఁడు నీవును జావఁ జూచి ప్రాణంబు
ధృతి నిల్పి యెట్లు వర్తింపఁగ వచ్చు?
వచ్చునే నో రాడి వాక్రుచ్చి నిన్నుఁ
జిచ్చులోఁ బడు మని చెలఁగి వీడ్కొలుపఁ?
గరుణ మాలినయట్టి కఠినాత్ముఁ డైన
నరునిఁ బల్కనరీతి నయ మేది నన్నుఁ
బలికితి పలు?' కని బాష్పపూరంబు
నెలమి ఱెప్పల నిల్పి యేఁగుచు నున్న.

నిక్క మని = (ఐదువతనము) స్థిర మని. లోలన్ = చపలురాలను.
వగలన్ = దుఃఖములతో.

మనుజేశునకుఁ జంద్రమతి సాఁగి మ్రొక్కి,
ఘన మైనభక్తితోఁ గరములు మొగిచి,
'నలినాప్తకులనాథ, నా విన్నవించు
పలుకు వే ఱొకటి గా భావింప వలదు,
దలముగా నలుదెసల్ దరికొని మండఁ
జలిచీమ కొఱవిపైఁ జనుదెంచినట్లు,
వలయంబుగా మండి వచ్చు దావాగ్ని
వెలికి గొందును వెళ్ల నుఱికి పో రాక
సుడి వడి మనలోనఁ జొచ్చె, నా తెఱలు
దడుపుచు నున్న యీ తపసికుమారుఁ
గొంకక వెస నెత్తుకొని వెర వైన
వంకగా నీ వహ్నివలయంబు గడపు.
నీవు గల్గినఁ దీఱు నీ మునిఋణము,
నీవు గల్గినఁ గల్గు నెలఁతలపొందు,
నీవు గల్గినఁ బుత్త్రనివహంబు గలుగు,
నీవు గల్గినఁ గల్గు నిత్యసౌఖ్యములు,
నీవు గల్గినఁ గల్గు నిత్యధర్మములు,
నీవు గల్గినఁ గల్గు నిఖిలభోగములు,
నీవు గల్గినఁ గల్గు నిత్యసంపదలు,
నీవు గల్గినఁ గల్గు నిఖిల రాజ్యములు.
ఎడ లేదు భాషింప, నిదె చేర వచ్చె
మిడుఁగుఱు లడరంగ మిన్నంది వహ్ని.
తెగువ లే కున్నను దెగుట నిక్కంబు.
సుగుణాత్మ, తొలుత నేఁ జొచ్చిన పిదప

కొఱవిపైఁ=కొఱవిలో కాలకయున్న భాగమువీఁదికి. చనుదెంచినట్లు—'చొచ్చె' (2815) కి విశేషణము. కొంకక=సందేహింపక.

భగవంతుఁ డొనరించు పద్ధతి జరుగఁ.
దగవు మీఱఁగఁ దెంపు దయ సేయు.' మనుచు
వేఁడినఁ;—దల వ్రేల వ్రేసి, నిట్టూర్పు
వేఁడి యై, నృపతి నివ్వెఱ నూరకున్న;—
వసుధేశు నతిభక్తి వలగొని మ్రొక్కి,
మసలక చను చంద్రమతివెంటఁ - దగిలి -
'యమ్మమ్మ నీ విపు డగ్నిలో నుఱుక
సమ్మదం బొదవంగఁ జనియెద వేని,
వత్తు నేనును, నన్ను వదలక తిగిచి
యెత్తికొ. మ్మ' నుచుఁ బెల్లెసఁగ దైన్యమునఁ
గిదుకుచుఁ జిన్ని కెంగేలఁ బైకొంగుఁ
గదియించి - బుడిబుడి కన్నీరు దెచ్చి -
మోహ మేర్పడఁ గుచంబుల మోము రాచు
లోహితాస్యునిఁ - జూచి, లోనన పొక్కి,
యక్కునఁ గదియించి, యాదల నివిరి,
చెక్కిలి నొక్కి, యా చిన్నారిబొజ్జఁ
బుడికి, చక్కిలిగింత పుచ్చి, కన్నీరు
దుడిచి, ముద్దుల చుంచు దువ్వి, మూర్కొనుచు,—
'నా యన్న, నా కూన, నా ముద్దుపట్టి,
మా యయ్య, యీ పేర్చుమంటఁ జల్లార్చి
వత్తు వేవేగ; రా వలదు నా తోడఁ;
జిత్త మారఁగ నీకుఁ జేకూఱు శుభము.'
అని యెట్టకేలకు నాలోహితాస్యు
మను జేశుకడ నిల్పి, మఱి యొండు తలఁపు

బుడిబుడి=అల్పమైన. తెచ్చి = తెచ్చుకొని. కిదుకుచున్ = కోరికతో మూల్గుచు. అక్కునన్ =ఱొమ్మున. చుంచు=పిల్లజుట్టు.

మది లేక నిల్చి, యమ్మగువ ప్రాణేశుఁ
బదిలంబుగా మనఃపద్మంబునందు
ధృతి నిల్పి, చంద్రమతీదేవి భక్తిఁ
బ్రతిముఖం బై, యగ్నిభట్టారకునకుఁ
దరుణ ప్రవాళ సుందర కాంతిఁ దనరు
కరపల్లవంబులు గర మొప్ప మొగిచి,
‘ వరద, వైశ్వానర, వర దయాలోల,
దురిత సముత్కర తూల వాతూల,
మదిలోన వాక్కున మఱి చేఁతలందు
వదలక పతిభక్తి వఱలుదు నేని,
నరలోక నుతుఁ డైన నా కూర్మి విభుఁడు
పరమ సత్యంబు దప్పక మను నేని,
పరమ శీతలుఁడ వై ప్రాణదానంబుఁ
గరుణమైఁ దొలుత నత్పుత్రున కొసఁగి,
మునినాథు ఋణమున మునిఁగి పోకుండ
మనుజేశుఁ గొడుకును మఱి కావు.’ మనుచు;—
జెచ్చెర రాయంచ చెంగల్వకొలనిఁ
జొచ్చినగతిఁ జిచ్చుఁ జొచ్చి, యానడుమఁ

—. చంద్రమతిపాతివ్రత్యముచే దావాగ్ని చల్లారుట.—

గలయఁ బూచిన కింశుకంబులలోనఁ
జెలువారు చున్న రాచిలుక చందమునఁ-

భట్టారకునకుఁ = దేవునికి. తరుణ ప్రవాళ = లేఁత చిగుళ్లవంటి. వరద = వరములిచ్చువాఁడా. వైశ్వానర = విశ్వానరఋషియొక్క కుమారుఁడా. దురిత = పాపముల - సముత్కర = మొత్తము నెడి - తూల = దూదికి - వాతూల = గాలిసమూహమా. కింశుకంబుల = మోదుగుల.

ప్రబల సంధ్యా రాగ పటలంబునందు
సొబ గొందు క్రొన్నెల సోగబాగునను—
మలసి మండెడు వెనుమంటలలోన
నిలిచి, మైఁదీఁగకాంతికి వన్నె నిగుడ,
దీపించు దాని పాతివ్రత్య మహిమ—
కేపార వెలుఁగంది, యెల్ల దేవతలుఁ
బొరిఁ బొరి నుతియించి పువ్వులవాన
గురిసి. రవ్వడు వహ్ని గొబ్బున నడఁగి,
నిగుడుకీలలు మానె. నివురు పైఁ గప్పి
పొగయుట లుడిగి నిప్పుకలు సల్లారె.
నావిధంబునను దావాగ్ని సల్లారి
పోవుటయును; — మహోద్భుతముగా మెఱసి
తిలపువ్వు వాడక తరుణీలలామ
యెలనవ్వు సిగురొత్త నెప్పటి యట్టు
లలరఁగఁ;—జేతు లల్లార్చుచు నెగఁర
నలరి యానందనృత్యముఁ జూపుచున్న
యాలోహితాస్యుని నక్కునఁ జేర్చి,
పాలు చన్నులఁ జేఁపి పయ్యెద దడియ,
జడిగొను హర్షాశ్రుజలముల మేనిఁ
దడిపి, ముద్దాడుచు; ధవునకు నర్థి
నిలఁ జాఁగి మ్రొక్కిన;—'నింతి, నీ యట్టి
కులసతి నాకుఁ గల్గుటఁ గాదె యిట్టి
యాపద లెడఁబాసి యలరంగఁ గలిగె?
నీ పుణ్యవర్తన నెగడె, లోకముల

సొబగు=అందము. క్రొన్నెల సోగబాగునన్=లేఁతచంద్రుని రేఖయొక్క సొంపుతో. తరుణీలలామ=యువతీతిలకము.

నీ రట్టుఁ దిట్టు నా కెసఁగక యుండ
బోరన మునిపుత్త్రుఁ బ్రోచితి గాన.
నీ నిమిత్తంబున నెలఁత నా కింకఁ
బూని కౌశికు ఋణంబును దీర్పఁ గలుగు.'
నని యుచితోక్తుల న మ్మహీవిభుఁడు
తన దేవిఁ బ్రియ మారఁ దగ గారవింప;—

## —. చంద్రమతి మహిమకు కౌశికుఁడు వెఱఁగుపడుట .—

నప్పు డా కౌశికుం డత్వ్యాధం బెల్లఁ
దప్పక వీక్షించి తద్దయు నలిగి,
'కాలాగ్నిఁ బోని యీ కార్చిచ్చు చేతఁ
గాలి వే భస్మంబు గాక తా నిలిచి,
పతియును దాను నెప్పటియట్ల కలసి,
సుతుని ముద్దాడుచు, సురలు నుతింప
నున్నది; కల్యాణి కొక్కింత యైనఁ
జె న్నఱి యుండదు సీమంతవీథి,
యలికంబు సెమరింప, దలకలు గమర,
వెలనవ్వు గడివోవ, దెసఁగదు దప్పి,
చిలుకదు కన్నీరు, జిగి దప్పి మేను
సొలయు, దేమియుఁ బొగ మారదు పలువ,
పసిమి దప్పదు కమ్మఁ బసుపు లేఁబూత,
కసుగంద వడుగులుఁ, గములవుఁ జేతు;
ఈ తగ నీ తెంపు నీ పెంపు సొంపు
ఈ తెఱం గీ మేర యీ దిట్టతనము

రట్టు=నింద. చెన్నఱి=సొంపు చెడి. సీమంతవీథి=పాపట రేఖ. అలికంబు=నుదురు. కడివోవము=తఱుఁగదు. పలువ=వస్త్రము.

లెందు మహాశ్చర్య! మే మన వచ్చు!
నిందుకళా ధరుం డెఱుఁగు నొక్కరుఁడు!
బాపురే! నా తపో బలమునకంటె
దీపించు దీని పాతివ్రత్య మహిమ!
పతిభక్తి సతులకుఁ బరమశీలంబు,
పతిభక్తి సతులకు భాగ్యమూలంబు,
పతిభక్తి సతులకుఁ బరమభూషణము,
పతిభక్తి సతులకు భాగ్యపోషణము,
పతిభక్తి సతులకు భయనివారణము,
పతిభక్తి నిఖిలశోభనకారణంబు,
పతిభక్తి నింతికిఁ బడయంగ రాని
యతులితపుణ్యంబు లవి యెందుఁ గలవు?
వెఱపింపఁ బోయి తా వెఱచినయట్టి
తెఱఁగయ్యె! నింక నే తెఱఁ గెటు మీఁద?'
నని తలపోసి, హా! యని, వెచ్చ నూర్చి,
మనమునఁ జలముఁ గ్రమ్మఱ నూలుకొల్పి,

—. కౌశికుఁడు నక్షత్రకుని చంద్రమతి హరిశ్చంద్రులకు విరిపోటుసేయ నియమించుట .—

యెడరకు తనరూప మన్యు లెవ్వరికిఁ
బొడ గాన రాకుండఁ బొందుగాఁ గదిసి,
వక్షంబు మోము మోవఁగఁ గౌఁగిలించి
నక్షత్రకునకుఁ జిన్నఁగ నిట్టు లనియె.—
* 'సైయన బహువేదశాస్త్రపారీణు
లై యున్న నా శిష్యు లందఱిలోన

సై అనఁగా=శీఘ్రముగా. ఇందుకళాధరుఁడు=శివుఁడు. నూలుకొల్పి = సూత్రపఱిచి.

* 'చయ్యన...లయ్యున్న...' అని పూ. ము.

వెలయు నష్టాదశ విద్యలయందు
బలవంతుఁ గావించి పాటింతు నిన్ను.
నే చందమున నైన నీ వధూమణికి
నీ చక్రవర్తిపై నెసఁగిన కూర్మి
వీడి పోవఁగఁ బల్కి విరిపోటు సేసి
జోడుఁ బాపుదు; దాన సురస మై జరుగఁ
గైకొని నాసేయుకపటకృత్యములు;
లేకున్నఁ గాన సాఁగ లేవు నిష్క్రమము.
చేయుము మీ పని; కార్యసిద్ధి నా కొదవు.
పోయి వచ్చెద.' నని పోయె నమ్మౌని.

—నక్షత్రకుఁడు చంద్రమతికి దుర్బోధనలు సేయుట.—

అంత నక్షత్రకుం డామహారాజు
కాంతా శిరోమణిఁ గాంచి దీవించి,
'దేవి, నీ దైన పాతివ్రత్య మహిమ
వేవేల తెఱఁగుల వినుతింప నరిది.
యనలకీలావళి కాహుతి నైన
నను బ్రాణములు గాచి నయమునఁ బ్రోచి.
తితిక్షలో నీకు నీడుగా మొదలి
పత్ని మేర్పడఁగ లోపాముద్ర నెన్ని,
యా యరుంధతిఁ జెప్పి, యనసూయఁ బొగడి,
శ్రీ యలరార శచీదేవిఁ దలఁచి,
యలవడఁ గొనియాడ నగుఁ గాక; యున్న
పొలఁతులు నీతోడఁ బురుడింపఁ గలరె!

అష్టాదశ=పదునెనిమిది. విరిపోటు=భేదము. సురసము=సులువు. లోపాముద్ర=అగస్త్యభార్య. అరుంధతి=వసిష్ఠభార్య. అనసూయ=అత్రిభార్య. శచి=ఇంద్రునిభార్య. పురుడింపఁగ = సరిపోల.

కరుణమై నీ యుపకారంబు నాకుఁ
బరఁగఁ జేసిన నీకుఁ బ్రత్యుపకార
మొనరఁ గావించెద; నొకమాట వినుము.
చనవుమైఁ గౌశిక సంయమి వేఁడి,
క్రమ్మఱ నాకుఁ గాఁ గైకొని రాజ్య,
మిమ్ముల నీ కిచ్చి, యీ లోహితాస్యుఁ
బట్టంబు గట్టింతుఁ బఱఁగ. నీ ముద్దు
పట్టిఁ దోడ్కొనుచు నీపట్టణంబునకు
రమ్ము; నీ కిది పొందు; రా నన వలదు
నమ్ముము, వృథ గాదు నా మాట యతివ.
ఎలమిమై నటు గాక యీ రాజు వెంట
నలయక వర్తింప నాసించె దేని,
ఘన హుతాశన మహా జ్వాలా కరాళ
ఘనతర విస్ఫులింగముల నంగములు
గమరక పోవచ్చుఁ గాక, కల్పాంత
డమరు నిష్ఠుర ఢమఢమ రవ స్ఫుటిత
పటుతర బ్రహ్మాండ భాండ చండీశ
చటుల రౌద్రాకృతి సమకొనఁ బెచ్చు
కుటిల కౌశికు తీవ్ర కోపాగ్ని శిఖలఁ
బెట పెటఁ బ్రేలక ప్రిదిలి పోవశమె?
అదియును గాక నేఁ డాదిగా నింకఁ
బదిదినంబులు సిక్కఁ బలికిన మితికి.
మునినాథు ధన మెల్లు ముందఱఁ జెల్లు!
వెనుకఁ జెల్లిన దఱవీసంబు లేదు.

హుతాశన=నిప్పుయొక్క. కరాళ=భయంకరములైన. డమరు=డమరుగ మను వాద్యముయొక్క. స్ఫుటిత=పగిలిన. భాండ=భాండముగల.

లే దుపాయం బింక లేశమాత్రంబు
మేదినీపతి కిట మీఁద నూహింప.
నొదవు పేరాఁకట నుదరి హా మ్మనుచుఁ
గరియుం బెబ్బులివలెఁ గాశిఁ దలిగి
తడయక వచ్చి మాధనముఁ దె మ్మనుచు
నడిగి యట్టాని బిట్టదలించెనేని,
కడువడి గర్భంబు గదలి కంపించి
సుడివడి నిన్ను నీ సుతుని నక్కాఱఁ
బోయి నంతఱ నమ్మి పుచ్చు భూవిభుఁడు.
తోయజానన నాకుఁ దోఁచినబుద్ధి.

—. చంద్రమతి నక్షత్రకునికి బుద్ధి సెప్పుట .—

నావుడుఁ; – జిఱునవ్వు నవ్వి యారాజు
దేవి నక్షత్రకు దెసఁ జూచి పలికె.—
'పతి కేడుగడయును జర్చింపఁ బతియె;
పతియ యా దైవ మెబ్భంగుల సతికి.
బలవంత మగువిధి ప్రాణేశుఁ బాప
వలవంతఁ జెందిన వర వధూమణికి
భారంబు హారంబు, భాసుర గంధ
సారం బసారంబు, సార కాసార
తీరంబు దూరంబు, తీవ్రసల్లాప
కీరంబు క్రూరంబు, కిన్నర మంజు
నాదంబు ఖేదంబు, నవచంద్రకాంత
వేదులు సూదులు, వికసి తోద్యాన

ఉదరి=ఉంకించి. అట్టు ఆని=మెడ పట్టి. ఏకుగడ=రక్షకుఁడు. వల
వంతర=మదనవ్యథను. గంధసారంబు=చందనము. వేదులు=తిన్నెలు.

చూతంబు భూతంబు, సురభి కస్తూరి
పూఁతలు రోఁతలు, పూర్ణచంద్రికల
మెఱపులు వెఱపులు, మెత్తని దూది
పఱుపులు మఱుపులు, పరభృతసమితి
కూఁతలు ఘాతలు, గొదముతుమ్మెదల
మ్రోఁతలు వ్రేఁతలు, ముద్దురాయంచ
మురువులు పరువులు, మోహంపుఁ జెలుల
సరసముల్ విరసముల్, చందనానిలపు
సొలఁకువ యలఁకువ, మేల్మిచెంగావి
జిలుఁగులు సిలుఁగులు, చివురుఁజప్పరపుఁ
బొంతలు చింతలు, పూఁబొదరిండ్ల
క్రంతలు వంతలు, కమనీయ సరసి
బిసములు నుసములు, పృథు మకరంద
రసములు విసములు, రమ్య హిమాంబు
పూరంబు గాము, కర్పూరంబు సేఁదు
వీరుండు మారుఁ.—డీ విధమునుఁ గాక
ముదమునఁ గులశీలములు మదిఁ గోరి
బ్రదుకు పతివ్రతా రత్నంబులకును
బతి లేని రాజ్యసంపద లవి యేల?
పతి లేని సుతు లేల? బంధువు లేల?
పతి లేని హితు లేల? ప్రాణంబు లేల?
మతిఁ దలపోయ, నీ మానవేశ్వరుఁడు

సురభి=తావి. పరభృత సమితి=కోకిల పిండుయొక్క. అలఁకువ=ఆయాసము. జిలుగులు=సన్నవస్త్రములు. సిలుఁగులు=ఉపద్రవములు. బొంతలు=చెంతలు. క్రంతలు=రచ్చలు. వంతలు=దుఃఖములు. నుసములు=కసరులు. పృథు=గొప్ప. ఈవిధమును=ఈ పైఁ జెప్పినకష్టములుమాత్రమే.

నా కూర్మి నిలుకడ, నా తోడునీడ,
నా కన్న పెన్నిధి, నా నోము ఫలము,
నా మేలి చెలికాడు, నా పట్టుఁగొమ్మ,
నా మెచ్చు వలరాజు, నన్నేలు రాజు.
చిక్కునే కౌశికు చిక్కులం దగిలి?
వెక్కురువకుమ, యీ వెడమాట లుడుగు.
నీవు నీ గురుఁడును నిఖిల నిర్జరులు
వేవేల తెఱఁగుల వినుతులు సేయ,
జగ మెఱుంగఁగ హరిశ్చంద్ర భూవిభుఁడు
నెగడు సత్య వ్రత నియతిఁ బెంపొంది
వెలయు నష్టాదశ ద్వీప సంఘములను
నెమ్మిమైఁ గ్రమ్మఱ నేలు నిక్కముగ.'—
ననుటయు;— 'నిది తథ్య' మని వినువీథి
నను వొంద భాషించె నశరీర వాణి.
యది విని మదిలోన నాశ్చర్య మంది,
కొదుకుచు నక్షత్రకుం డూరకుండె.

---

ప్రథమ భాగము సమాప్తము.

---

కొదుకుచు = సంకోచించుచు.

# హరిశ్చంద్రద్విపద

## ఉత్తరభాగము.

### —.కాశీప్రయాణము.—

మనుజేశు డంత నమ్మగువ నీక్షించి,
'మనము నేఁ డిచ్చోట మసలుట దగదు,
ముందట నున్నది ముయ్యేఱు నేల.
అం దున్న జనులు మహాజనులు. ల' నిన;
వనిత యిట్లనుఁ బ్రాణవల్లభుఁ జూచి. —
పెను పొందు నప్పురి పే రేమి దేవ?
ఒనరంగ నేలెడి యొడయఁ డెవ్వాఁడు?
మన కెవ్వ రందు సంబంధిబాంధవులు,
మన యప్పు తెగటార్ప మది వేఁడువారు?
వినిపింపు వారల విమలాత్మ.' యనినఁ;
జందనగంధి కాజననాథుఁ డనియె. —
'నిందుకళాధరుం డేలు నప్పురము.
నా విశ్వనాథుఁడే యాత్మబాంధవుఁడు,
దైవంబుఁ ద్రాతయు దాతయు మనకు.

మసలుట=తడయుట. ముయ్యేఱు నేల=స్వర్గ భూ పాతాళము లందు మూఁడు ప్రవాహములుగా నున్న నదియొక్క చోటు. ఒడయఁడు=ఏలిక. త్రాత=రక్షకుఁడు.

నగలక మునినాథు నప్పున కొఱకు-
తెగ సేయ వలయును సూ కేవి, యొ క్కైన.'
నని కుమారునిఁ దన యంస మెక్కించు
కొని, యటు పోవుచోఁ, గొంత దవ్వులకు;—

——హరిశ్చంద్రుఁడు గంగాస్నానము సేయుట.——

నరుణారవిందంబు లడుగులు గాఁగఁ,
దరుల గ్రుమ్మరు వన దంతావళముల
యురుతర తుండంబు లూరులు గాఁగ,
సరస సైకత సీమ జఘనంబు గాఁగ,
సురుచిరం బగు మేటి సుడి నాభి గాఁగఁ,
గర మొప్పు చిఱు తరఁగలు వళుల్ గాఁగ,
నునుఁదీఁగ నాఁచు లే నూఁగారు గాఁగ,
ఘనయు జక్కవలు పాలిండులు గాఁగఁ,
జెలుఁవంపు బిసములు సేతులు గాఁగ,
వెలిదమ్మి వదనారవిందమ్ము గాఁగఁ,
గలికి బేడిసలు వాల్గన్నులు గాఁగ,
నెలకొన్న జలవేణి నెఱివేణి గాఁగ,
సరవిఁ బెల్లెసఁగెడు జలకణ పంక్తు
లరు దారు మౌక్తిక హారముల్ గాఁగ,
* నలఁ గ్రీడించు రాయంచలరవము

అగలక = భంగ మొందక. అంసము = బుజము. అరుణ అరవిందంబులు = ఎఱ్ఱదామరలు. దంతావళముల = ఏనుఁగులయొక్క. ఊరులు = తొడలు. సైకతసీమ = ఇసుకదిన్నె ప్రదేశము. జఘనము = కటి. తరఁగలు = అలలు. వళుల్ = కడుపుమీఁదిముడుఁతలు. జలవేణి = నీటిబాలు. హేమనూపుర = బంగరుటందెలయొక్క.

* 'అవలఁ...నడ...' పూ, ము.

నలి హేమనూపురనాదంబు గాఁగఁ,
బెను పొంద నెరసిన ఫేనంబు దెలుపు
దనరారు చున్న చందనచర్చ గాఁగఁ,
గూలావనీరుహ కుసుమ పరాగ
జాలంబు చిత్రవస్త్రంబు గా మెఱయ,
జన లోక పావని జాహ్నవి గంగఁ
గనుఁగొని, హస్తపంకజములు మొగిచి,
నుదుటఁ గీలించి, సన్నుతు లొప్ప భక్తిఁ
గదిసి, నందనుఁడును గాంతయుఁ దాను
నాపుణ్యవాహినియం దవగాహ
మోపికఁ గావించి, యుచితాహ్నికములఁ
గ్రమమునఁ దీర్చి, యక్కడఁ గొంత సేపు
శ్రమము దీరఁగ నిల్చి, జననాథతిలకుఁ

—. కా శీ పు రి. —

డటఁ జని;—ముందట నా వేల్పుటేటి
తటమున, నురుతర ద్వార కవాట
వాపీ తటాకోపవన సముత్తుంగ
గోపుర ధ్వజ మణి కుడ్య విచిత్ర
తోరణ ప్రాసాద తురగ మదాంధ
వారణ రథ భట వ్రాత సామగ్రిఁ

ఫేనంబు=నురుఁగు. కూల = గట్టునందలి - అవనీరుహ = చెట్లయొక్క - కుసుమ పరాగ = పుప్పొడియొక్క - జాలంబు = సమూహము. చిత్ర = పలువన్నెల. జాహ్నవిన్ = జహ్నుమునికూఁతును. వాహినియందున్ = నదియందు. అవగాహము = స్నానము. వేల్పుటేటితటమునన్ = దేవనదియొడ్డున. సముత్తుంగ = పొడవైన. తోరణ = ముఖద్వారములును. ప్రాసాద = మేడలును.

జెన్నొందు చున్న కాశీపురిఁ జేరి,
కన్నులు మిలమిల్లఁగా, మహీవిభుఁడు

—.కా శీ క్షే త్ర మ హి మ.—

ముదమునఁ దనదేవి మోము వీక్షించి,
మదిరాక్షి యిందులమహిమ వర్ణింపఁ
బది నూఱు ముఖముల ఫణిరాజును జాలఁ.
డిది వేదవిఖ్యాత, యిది ముక్తిమార్గ,
యిది స్వర్గసోపాన, యిది సిద్ధసేవ్య,
యిది దోష చయ దూర, యిది తీర్థ సార,
యిది భుక్తి ముక్తి ద, యిది సత్య చరిత
యిది శంకర క్షేత్ర. యిది విచిత్రంబు.
కంతుని కోఱ రోసి కన్నులు మూసి
చింత లొక్కటి చేసి శివుఁ దలపోసి
యల సంతతోల్లాసి యందెను వాసిఁ
గలిగించు నీకాశి ఘన పుణ్య రాశి.
వామాక్షి, విప్రుని వధియించు నతఁడు,
కామాంధుఁడై తల్లిఁ గదిసిన యతఁడు,
మనుగక సురఁ ద్రాగు చుండెడు నతఁడుఁ,
దోడరి సువర్ణంబు దొంగిలు నతఁడు,
వనితల శిశువుల వధియించు నతఁడుఁ,
గినుకమై ధేనువుఁ గెడపిన యతఁడుఁ,
గొండీఁడు, గృహదాహకుఁడు, గరదుండుఁ,
జండాలు, డఖిలదూషకుఁడును, మఱియుఁ

కంతునికోఱ=మన్మథునివ్యాపారమును. సంతత ఉల్లాసి=నిరంతరము(శివునందు)ఆనందించువాఁడు. గరదుండు = విషము పెట్టువాఁడు.

క్రిమి పశు మృగ పక్షి కీటాది జంతు
సముదాయ మైన, నిచ్చట మృతిఁ బొంది,—
మిన్నేటి జడలును మిక్కిలిగన్నుఁ
గ్రొన్నెలపువ్వును గుత్తుకనలుపుఁ
బులితోలుఁగాసెయుఁ బునుకకంచంబు
వలుదశూలము నస్థి వనమాలికయును
గలయితఁ డాతఁ డై,—కమనీయ రత్న
కలిత మై తలఁచిన కడలనే మెలఁగు
నతుల విమానంబునందుఁ, దన్నెలమిఁ
బ్రతిజనంబును ససంభ్రమముగాఁ గదిసి,'
యొసపరి వన్నెలు నోరచూపులును
ముసిముసి నగవులు మొగడ చన్నులును
అసియాడు నడుములు నలస యానములు
రస మొల్కు బింబాధరంబులుఁ గలిగి,
యలరువిల్తుని మోహనాస్త్రంబు లనఁగ,
నలరారు రుద్రకన్యాసహస్రములు
వివిధభంగులఁ గొల్వ,—వినుతికి నెక్కి,
శివలోకమున సుఖస్థితి నుండుఁ గాంచు.'
ననుచుఁ జిత్రంబుగా నచ్చటి మహిమ
మన మార నాచంద్రమతికిఁ జెప్పుచును;—

## —విశ్వనాథాది దేవతా దర్శనము.—

ధవళ గోపుర చతుర్ద్వార బంధురము
ప్రవిమల ముక్తాతపత్ర సుందరము

ఒసపరి=సింగారపు. యానములు=నడలు. బింబాధరములు=దొండపండువంటి పెదవులు. ముక్తా ఆతపత్ర=ముత్యాలగొడుగుచేత.

నరుణ వితాన రమ్యమును సమీర
తరళిత వృషభ కేతన భాసురంబు
మణి రంగవల్లికా మంట పోజ్జ్వలము
ప్రణుత గుగ్గులు ధూప పటల వాసితము
పటహ భేరీ శంఖ పణవ మృదంగ
పటు ఘంటి కాదిక బహు వాద్య రవము
కాంతా సమర్పిత కర్పూర శకల
కాంత నీరాజన కాంతి శోభితము
నగణిత కనక కుంభాభిరామంబు
నగు విశ్వనాథ మహాదేవు నగరు—
సేరి, యాదేవుని శ్రీ లింగమూర్తిఁ
గోరి సద్భక్తి నెక్కొనఁగ దర్శించి,
ధరణిఁ జాఁగిలి మ్రొక్కి, తనమోడ్పుఁ గేలు
కర మొప్ప ఫాలభాగంబునఁ జేర్చి,—
'జయ భక్త మందార సజ్జనోద్ధార
జయ సద్గుణాధార సంసార దూర
జయ సత్కృపాలోల శాత త్రిశూల
జయ హుతాశన నేత్ర జలజాక్షమిత్ర
జయ మేరు కోదండ జయ విష్ణు కాండ
జయ నిర్జితానంగ శశి ధవళాంగ

అరుణ వితాన = ఎఱ్ఱని మేలుకట్లచే. సమీర = గాలిచేత - తరళిత=కదలింపఁబడిన. రంగవల్లికా=మ్రుగ్గులతోడి. పటహ=తప్పెట. పణవ=చిన్నతప్పెట. శాత=వాఁడి. హుతాశన నేత్ర=నిప్పుకంటివాఁడా. జలజాక్షమిత్ర=విష్ణువునకు చెలికాఁడా. విష్ణుకాండ=విష్ణువు బాణము గాఁగలవాఁడా.

చారు కోమల హాస చతుర విలాస
* గౌరీ మనోలాస కాశీనివాస. —
యీ కౌశికుని బుఱ్ఱం బీ కాశిలోన
దీకొని తీర్పఁ గాఁ దెరువు గల్పింపు.'
మని సన్నుతులు సేసి; యచ్చోటు వాసి,
మన మార నా చంద్రమతియును దాను
భుక్తి ముక్తులు రెండుఁ బోలంగ నొసఁగు
భక్తవత్సలుఁ గాలభైరవుఁ గొలిచి; —
భసిత త్రిపుండ్రంబు ఫాల లోచనము
నిశిత త్రిశూలంబు నీల కంఠంబు
భోగీంద్ర హారంబుఁ బుఱుక కప్పెరయు
నాగ కంకణమును నల్లని మేను
మఱలు కెంజడలును మణి కుండలములుఁ
జిఱుగజ్జె మొలనూలు సింగినాదంబు
డాకాలి పెండెంబు డమరువుఁ గత్తి
రాకాసి తలలతోరపు వనమాల
సెలవిపైఁ జిఱునవ్వు చిలికెడు మోముఁ —
గలిగి యుజ్జ్వలరత్నఖచితంబు లైన
యోగవాగలు మెట్టి యొక పాద మూఁది
బాగుగా నెసపరి బాగు నటించు

గౌరీ మనోలాస=గౌరియొక్క మనస్సును ఆడించువాఁడా. దీకొని=పూనికతో. నిశిత=వాఁడి. భోగీంద్రహారంబు=సర్పశ్రేష్ఠుఁడైన వాసుకియే అగుహారము. కప్పెర = పాత్రము. సింగినాదంబు=ఊఁదుకొమ్ము. డాకాలిపెండెంబు=ఎడమకాలిపెండేరము. వనమాల=పూదండ. సెలవి=పెదవిమూల. యోగవాగలు= యోగులపాముకలు.

---

* 'గౌరీమనోల్లాస' అని పూ. ము. 'నో' అనుసంధి దుర్ఘటము.

నా దేవదేవుని సానందమూర్తి
మోదంబుతోఁ జిత్తమున నిల్పి మ్రొక్కి;
మఱియు నచ్చట మణి మంత్రౌషధములఁ
గలవక యుండ వాకట్టి సింహముల
శరభంబులను ఘోరశార్దూలములను
వెర వారఁగా నెక్కి విహరించి, యజిన
విరచి తాసన భద్ర విన్యాస సరణి
నరుదుగా నాసీను లై, యణిమాది
సిద్ధులు గలిగి ప్రసిద్ధు లై నట్టి
సిద్ధుల నిష్టార్థసిద్ధిగాఁ గొలిచి;

—. నక్షత్రకుఁడు నిక్కచ్చి చేయుట. —

మగిడి భూవిభుఁ డొక్క మఠము పొంతమను
దగఁ జేరి యున్న యత్తఱి;—నిప్పు లురుల
వీక్షించి యమ్మహీవిభునితో ననియె
నక్షత్రకుఁడు మది నయ మింత లేక,—
“ యచ్చుగా మాగురుం డవనీశ నీకు
నిచ్చిన మితి నేఁడు నెల్లియుఁ జిక్కెఁ.
బచ్చ పైకము గూడఁ బడినది లేదు.
తచ్చలు పచరించి తటమటించెదవు.
ఇప్పు డేమఱుపాటు నిటను నేతెంచి
ముప్పిరి గొనుకోపమునఁ గౌశికుండు

అజిన=తోలునందు-విరచిత= వేయఁబడిన-ఆసన = పద్మాద్యాసనములయొక్క-భద్ర=శుభమైన-విన్యాస= రచనయొక్క-సరణిచే= విధముచేత. తచ్చలు పచరించి = టక్కులుచేసి. తటమటించెదవు = మోసపుచ్చుచున్నావు.

నన్ను వీక్షించి 'యీ నరనాథు మీఁద
మిన్నక తరువుండి మితివోక మున్నె
పన్నుగాఁ దెమ్మన్న పసిఁడిరొకముల
నెన్నుము నీ. వన్న నెచట నేఁ దెత్తుఁ?
బసిఁడిఁ దెమ్మనుచు నేఁ బలుమాఱు వేఁడ
మిసుగ వేనుఁగు గవ్వ మీటినయట్లు.
చదువ నంతర మాయెఁ; జాలు నీ జాగు;
తుద లేదు; పీనుఁగుతోడిజాగరము.
బోయబొంకులు బొంకి పోయెదో, లేక,.
మా యప్ప నేఁటితో మాన్పి పుచ్చెదవో?
నిను నేఁడు ముఖమున నెత్తుర ప్రామి
కొని గుల్ల పఱుపక కొలికికి రావు.
పట్టి గుత్తని నిన్నుఁ బ్రజలు వీక్షింపఁ
జట్టు మోయించెద సర్వథా చూడు."
మనుచు నక్షత్రకుం డంతరంగంబు
మునుకొని చిల్లులు పోవ నాడుటయు;—
జననాథుఁ డాత్మలోఁ జాలఁ జింతించి,
తనయుండు నాలును దానును దక్క
నితరధనంబు లొం డేమియుఁ గలుగ
మతము గానక,— చంద్రమతి దిక్కుఁ జూచి,

మిసుకవు=కదలవు. ఏనుఁగు గవ్వఁ మీటిన యట్లు = గవ్వతో మీటినయెడల ఏనుఁగు కదలనట్లు. చదువన్ = చదువుకొనుటకు. అంతరము = విఘ్నము. నెత్తురు ప్రామి కొనుట - తానే హరిశ్చంద్రునిచే గాయపడినట్లుగా చూపఱు తలంచుటకు. గుత్తఅని = పైకము పెట్టి కొన్నట్టిదాసుఁడని. చట్టు=తాలిని. సర్వథా = ఎల్లప్రకారముల చేతను.

గుడిగుడిఁ గన్నీరు గ్రుక్కుచు, నొండు
నుడువ నాలుక రాక నులివేఁడి యూర్పు

—. చంద్రమతి పతితో తన్నమ్మి ఋణము తీర్పు మనుట .—

లందంద నిగుడ, మోమర వాంచి, యున్న—
చందంబుఁ జూచి యా సాధ్వీలలామ,
దీపించు పతి వక్త్ర దృష్టి విచేష్ట
లేపార నింగితం బెఱిఁగెడి యట్టి
చదురాలు గాన సంశయ లేశ మయిన
మది లేక వెక్క దీమసము పెంపునను.—
'భూచక్ర మెల్ల నేర్పున నేలినట్టి
రాచ వేల్పవు నీవు ప్రాకృతు నట్లు
పాయని చింత విభ్రాంతిఁ గుందెదవు.
దాయంబుతల నిట్టి దైన్యంబు దగునె ?
మతిఁ బూని నీ సత్యమహీజము పెంపొంద
మితి రెండు దినములు మీఁద నుండఁగనె
చొప్పడ నప్పు దీర్చుట మేలు. దినము
లొప్పు నొండొక పెక్కు నొక్కటి దఱుఁగు.
నుడితప్పు వాతప్పు నుసలక సత్య
మెడలింపఁ గనిపట్టు నెవ్వఁడుఁ గౌశికుఁడు.
శిశువులు వాపోవఁ జెక్కిలి మీటి
విశదాత్మ పాలు ద్రావించు చందమున

దీమసము=ధైర్యముయొక్క. ప్రాకృతునట్లు = పామరునివలె. దాయంబు తలన్ = అపత్సమయమున. నుడితప్పున్ = మాటతప్పను. వాతప్పున్=నోటితప్పను. నుసలక=తడయక.

* ఉసులుగ మనవెంట నుండి యీ యప్పు
కసటు వాపఁగ నేఁడు గలిగె నీ వడుగు.
నింటి వేలుపు మన కితఁ, డింక నెన్ని
కంటకంబులు వచ్చుఁ గా. కేమి దీనఁ?
పేద నే నని నోరఁ బ్రేవులుఁ జూపఁ
బోదురే ఋణముఁ దెంపునఁ గొనువారు?
జపములుఁ దపములు సకలదానముంబు
లుపవాసవిధులు దేవోపచారములుఁ
గ్రతువులు నొనరించి కాంచుపుణ్యంబు
లతులిత సత్యవాక్యమునకు సరియె?
కావున నిప్పు డక్కఱ వాపి కొనఁగ
నేవిధంబున వెర వేమియుఁ గాన.
మెడపక నను విక్రయించి చెల్లింపు,
కడఁ బడుఁ గొంతైనఁ గౌశికు ఋణము.
కడమకు నొకతెగ గల్గు నెల్లిటికి.
గూడఁ బుట్టి వచ్చినకొలఁది మే లొదవు.
నఱమఱ లేక లె' మ్మనుటయు;—గుండె
మెఱుఁగుఁగైదువుఁ గ్రుచ్చి మెఱమి నట్లయిన;—
నులికి భూపాలుఁ డా యుగ్మలిఁ జూచి
పలికె బాష్పములు ఱెప్పల నప్పళింప.—

ఉసులుగన్=సదుపాయముగా. కసటు=మాలిన్యమును. వెరవు=ఉపాయము. కడఁబడున్=తగ్గును. తెగ=దారి. ఎల్లిటికిన్=రేపటికి. కైదువున్=కత్తిని. మెఱమినట్లు=త్రిప్పినట్లు. అప్పళింపన్=క్రోసికొని వచ్చుచుండఁగా.

* 'నుసలక' పూ, ము, అఖండయతి,

''మదిరాక్షి, యీ వేఁడి మాట నా చెవులఁ
గదియించి పాపంబు గట్టుకోఁ దగునె?
పతి యెట్టి కష్టంబుఁ బని సేసి యైన
సతిఁ బ్రోచు టిది ధర్మశాస్త్రసమ్మతము.
ఆలి నమ్మినకష్టుఁ డనుచు నెల్లెడలఁ
జాల నిందించుచు జను లేవగింప,
వదనాంబుజము వంచి వసుధఁ బెక్కండ్రు
బ్రతికెడి యీ మాల బ్రతు కేటి బ్రతుకు?
పడఁతి నేఁ డిట్టు నిన్ బలిమాలి యమ్మి
* పడయఁగాఁ దగు నింద్రపద మైన నొల్ల.
లెక్కింప నపకీర్తి లేని జీవనము
నిక్కంబుగా నొక్క నిముసంబు చాలు.
సుళులంగఁ బ్రాణుల నొత్తి పుత్తుకలు
కఱకఱఁ దఱిగెడి కటికవాఁ డైన
దయ లేక తనకళత్రము నమ్ము కొనునె?
నయ మేది దీనికి నా మది సొరదు.
ధనమునకై పత్ని దాసిగా నమ్మి
చనునె భర్తకుఁ గూడు చవి యని కుడువ?
మరణంబు మేలు నెమ్మది దీనికంటెఁ
బరికింప.' ననుడు;—నప్పడఁతి యి ట్లనియె.—
'''నాపద వచ్చిన యప్పుడె మున్ను
దాఁచిన ధన మిచ్చి తగఁ బత్నిఁ గావఁ.

ఏవగింపన్ = రోయఁగా. జాలంగన్ = విలపించుచుండఁగా. కళత్రమున్ = భార్యను. నయము = న్యాయము. ఏది = మాని.

* '...నింద్రపద మైన' అని పూ. ము.

'వనజాక్షి, నిను నాఁడు వనవహ్నిఁ గూల
ననుసరించిన నాకు నశక్యం బెద్ది!
నా కతంబున నిట్టి నలఁకువ వచ్చె;
నా కతంబున నిట్టి నగుఁబాటు పుట్టె.
పొందిఁ బెం పెసఁగు రాజులదేవు లెల్లఁ
బరుసడిఁ గనుసన్నఁ బనులు గావింప
నురువైభవంబుల నుండు ని న్నిట్లు
పరవుగ నమ్ముకో వలసె నే మందు!
నీయట్టికులసతి నీయట్టిసాధ్వి
నీయట్టిప్రియసతిని నేఁటితోఁ బాప
సమకట్టెనే పాపజాతిదైవంబు!
కమలాక్షి నా పూర్వకర్మ మెట్టిదియొ?
లక్కయై యు కరఁగదు లలన, నా కిట్టి
దిక్కు వచ్చుటకో నా చిత్తంబు మిగుల?
ననదవై ని న్నిప్పు డమ్ముకో మ్మంచు
ననుమతిఁ జేసెద నకట! నా గుండె
తూలదు వ్రీలదు తునియలై పోవ
దోలంపుముద్దగా దో పువ్వుబోఁడి!
వనజాక్షి, నినుఁ గూడి వర్తించు ఘోర
వనములు శృంగారవనములు నాకు;
మగువ నీ వున్నకోనల తృణశయ్య
తగు హంసతూలికాతల్పంబు నాకుఁ;
గలకంఠి, నీ పొందు గల గిరిగుహలు
సలలిత మణి చంద్రశాలలు నాకు;

అశక్యంబు = అసాధ్యము. పరుసడిన్ = క్రమముగా. పరవుగన్ = దాసినిగా. ఓలంపు = ఓలగందంపు. చంద్రశాలలు = మేడలు.

మలయజగంధి, ప్రేమమున నీ వొసఁగు
ఫల కంద మూలముల్ బహువిధాన్నములు;
జలజాక్షి, నేఁడు నా సామ్రాజ్యలక్ష్మి
తొలఁగి పోయిన రీతి దోఁచుచున్న దియు.'
ననుచు నాందోళింప నతినిఁ గ్రోధమునఁ
గనుఁగొని మతియు నక్షత్రకుం డనియె.—
" భూమీశ, మాటలఁ బ్రొద్దుఁ బుచ్చెదవు.
తామసం బేల? నిత్తఱి వే వేద
తరుణిఁ బాయఁగ లేక తల్లడించినను,
మఱి యుపాయము సెప్పు మా ధనంబునకు.
జాగు సేయక పత్ని జట్టిగా నిచ్చి,
నా గురునాథు ధనంబుఁ జెల్లింపఁ
జెచ్చెర లేచి వచ్చెదో రావో కడను?
' వచ్చెద నో వాని వైళంబె?' యనుచు,
నాసలఁ బెట్టి నన్నడఁగింప వలదు.
వేసాలు వేయక వేగ లె. మ్మ" నుచుఁ,
జేపట్టి తివియ వచ్చిన;—వాని తెగువ
కా వసుధాధీశుఁ డాత్మలో నోసి,

—. హరిశ్చంద్రుఁడు ఆలిని అమ్ముటకు తిరుగుట .—

నిముసంబు నచ్చోట నిలువక కదలి,
రమణి నమ్ముటకు నై రాజమార్గమునఁ
జనుదెంచు నప్పు;—డాజానుబాహులును
బెను పొందు మూఁపులుఁ బీన వక్షంబు

మలయజ=చందనమువంటి. ఆందోళింపఁగ=సంశయింపఁగా. ఆజానుబాహులును=మోఁకాలివఱకుఁగల చేతులును. తామసంబు=విలంబము. ఏది=కోల్పోయి-లేక. కడను=కడపటను. పీనవక్షంబు=బలిసిన ఱొమ్ము.

గురుతరస్కంధంబు నొఱపగు మేను
నరనుత సింహాసనస్థితు భంగి

—. పురజనులు హరిశ్చంద్రుని వర్ణించుట .—

నయ దార, ఱెప్ప లల్లార్పక చూచి,—
పురజను లాత్మలోఁ బొదలు వేడుకల
నీ చంద మీ యంద మీ రాజసంబు
నీ చూపు నీ యేపు నిట్టి తేజంబు
నీ పెంపు నీ సొంపు నీ ప్రతాపంబు
నీ పోఁడి మీ వాఁడి మీ భుజాబలము
నెందు నెవ్వరియందుఁ గన్నఁడముఁ గాన.
ఇందు కళాధరుం డితఁడు గాఁబోలు;
నిందుకళాధరుం డితఁ డగు నేని,
నందివాహనము పినాకంబు నేవి?
కరిత్తోలు ఫణుల కంకణ హారములును
ఫాలముఁ గన్నును వాఁడి శూలంబు నెవ్వి?
కరి రాజ వరదుఁడు గాఁబోలు నితఁడు;
కరిరాజవరదుఁ డీఘనుఁ డగు నేని,
గరుడవాహన మెద్ది? ఘన మైన చుట్టి
సరసను నిజ శంఖ చక్రమ్ము లెవ్వి?
పురుహూతుఁ డీఘనభుజుఁడు గాఁబోలు;
పురుహూతుఁ డీఘనభుజుఁ డగు నేని,
యిర వొందఁగా వెల్లయేనుంగు నేది,
కర మొప్పు నల వేయి కన్నులు నెవ్వి?

గురుతరస్కంధంబు = మిక్కిలి గొప్పకంఠపీఠము. ఒఱపు = అందము. కరిత్తోలు = ఏనుఁగు చర్మము, పురుహూతుఁడు = ఇంద్రుఁడు. మనసిజుఁడు = మదనుఁడు.

మనసిజుఁ డీ మహోమహుఁడు గాఁబోలు;
మనసిజుఁ డీ మహోమహుఁ డగు నేని,
ననవిల్లుఁ బుష్పబాణంబులు నెవ్వి?
చన నొప్పఁగాఁ గీర జయ వాజి యెద్ది?
యెఱుఁగ రా దీతని; నెసఁగు తేజంబు
మెఱుపడ్డ నిప్పక మఱుఁడిక్రె మన్నాఁడు.
పఱఁగ నీ విభుపదపంక్తి జాడలను
బరికింపుఁ డివె సార్వభౌమ చిహ్నములు.

— పౌరస్త్రీలు చంద్రమతిని వర్ణించుట —

మరి చూడ రమ్ము యీ మానినీమణిని—
దెగ వుచ్చు నద్దంబుఁ దెగడెడు మోము,
జాతి నీలపు రంగు జడిపించు కురులు,
లేఁత చందురుఁ బిసాళించు నెన్నుదురు,
మదచకోరములతో మలయు నేత్రములుఁ,
గొదము లేళ్లకు సిగ్గు గొలిపెడి చూపు,
విరుల విండ్లకు నమ్ము వేసిన బొమలు,
సరస సంపకము మెచ్చని నాసికంబుఁ,
దెలి మొల్ల మొగ్గలఁ దెగడు పల్వరుస,
పులకండ మొలికెడు బొమ్మంచు మోవి,

మహోమహుఁడు=గొప్ప తేజముగలవాఁడు. నన=పూవు. కీరజయవాజి=చిలుకయనెడువిజయాశ్వము. తెగ=గొనెను - వుచ్చు = తొలఁగించు. పిసాళించు = తిరస్కరించు. మలయు = మార్కొను. అమ్ము వేసిన = బాణముతో వేటువేసిన. పులకండము = కండచక్కెర. బొమ్మంచు మోవి = ఎఱ్ఱని పెదవి.

చీఁకటి విరియించు చిఱునవ్వుఁ, బసిఁడి
* రేకులతో నెదిరించు చెక్కిళ్లుఁ,
కంతు |సంకున బొమ్మ గట్టిన గళము,
దంతి కుంభముల నదల్చు పాలిండ్లు,
చిగురు టాకుల నిరసించు హస్తములు,
గగనంబుతోఁ బరిఘూర్ణించు నడుము,
తేఁటి టెక్కుల దండఁ దెగడు నూఁగారు,
వాటమై త్రొక్కి నిల్వఁగ వచ్చు పిఱుఁదు,
లనటికంబముల గయ్యాళించు తొడలు,
ననవిల్తు కాహళల్ నగు చిఱుదొడలుఁ,
గెందామరల నేవగించు పాదములు.
సుందరి గా దిది సొబగు రాయంచ;
యంచ గా దిది నడ పాఱు క్రొమ్మించు;
మించు గా దిది రాచ మెచ్చుల ప్రతిమ;
ప్రతిమ గా దిది పచ్చి పగడంపు లతిక?
లతిక గా దిది నవ లావణ్య సరసి,
సరసి గా దిది పుష్పచాపుని శరము;
శరము గా దిది రతి సవరించు చిలుక;
చిలుక గా దిది వికసించు చెంగల్వ;
కలువ గా దిది చంద్రకళ వంటి చెలువ.
చెలువ యీ గతి విలసిల్లఁగా వలయు;
వలయుఁ గాంతల కిటువలెఁ బుట్టు గలుగ.'

కంతుసంకునకు = మన్మథునిశంఖమును. బొమ్మగట్టిన = అవమానించిన. దంతి = ఏనుఁగు. పరిఘూర్ణించు = ఎదుర్కొను. తెగడు = నిందించు. గయ్యాళించు = ధిక్కరించు. నడపు = నడక.

* '...మురాళించు చెక్కులును' అని యొక పా. | 'సంకుకు' అని. పూ. ము.

—. రాజు చంద్రమతిని అమ్మఁ జూపుట .—

నని ప్రజ దర్శింప నారాజు పలికె.—
'వినరయ్య, చెప్పెద; — విశ్వంబులోనఁ
గొనియాడఁ దగు భాను కులమున నేను
జనియించినాఁడఁ ద్రిశంకు నందనుఁడ
సార్వభౌముఁడ హరిశ్చంద్రుఁ డన్వాఁడ.
స్వ సర్వంసహా చక్రంబు నెల్ల
నా కౌశికున కిచ్చి యాతనికి మున్న
మేకొన్న ధనముకై యాలిఁ నమ్మెదను.
సన్నుత బహు వేద శాస్త్రాది కళల
నెన్నిక కెక్కు మహీసురులార,
శర ణన్న ము న్నెట్టి శత్రువు నైనఁ
గరుణింతు రుత్తమ క్షత్రియులార,
కోటికిఁ బడ గెత్తి కోరు వస్తువులు
పాటించి యొసఁగు సంపాసాలార,
మగఁటిమి నని మొన మార్కొని పోరి
పగఱకు వెన్నీని భటముఖ్యులార,
కట్టల్క వేటులగా వడి వ్రేయు
రట్టడి బిరుదుల రాహుత్తులార,
పతి హిత సాహస బహువిధోపాయ
చతురు లై నుతి కెక్కు సన్మంత్రులార,
జనపదులార, యో సామంతులార,
ధనపతులార, యో తగు దొరలార,—

సంపాసాలార = వణిజులార. మగఁటిమిన్ = శౌర్యముతో.
అని మొనన్ = యుద్ధాగ్రమునందు. రట్టడి = బెట్టిదమయిన.

పసిఁడి గేదఁగి రేకు పస మించు మేని
కుసుమ కోమలి నిట్లు కొనరయ్య మీరు;
తామరపువ్వు నదల్చు నెమ్మోము
కోమలి నమ్మెద కొనరయ్య మీరు;
నాసి క్రొమ్మించు రాణించు కన్గవల
గారుకుగ నమ్మెదఁ గొనరయ్య మీరు;
* మృగరాజునకు లొమ్ము మెట్టిన నడుము
చిగురాకుఁ బోఁడి నిచ్చెదఁ గొనరయ్య;
కలహంసలకు నసఘుశీ మైన నడపు
సొలఁతుక మీకు నమ్మెదఁ గొనరయ్య;
తెగవు మీఱఁగ నన్ను దయఁ జూడరయ్య;
తెగడక నా కొక్క దిక్కు గారయ్య;
యాలుగక నామాట లాలింప రయ్య;
చెలఁగి నా యక్కఱఁ జేకొనరయ్య.' —
యని దైన్య మేర్పడ నమ్మహారాజు
దనపత్ని నమ్మ దుర్దశఁ జూచి పొక్కి

—. పౌర వాక్యములు .—

వాడవాడల నెల్లవారలు గములు
గూడి యశ్రులు జడిగొనఁ దమలోనఁ, —
"గటకటా! యిట్టి వెంగలి రాజు గలఁడె?
మటుమాయతపసి యే మరులు కొల్పినను'
నెమ్మదిఁ దన యేలు నేలకుఁ దోడు
సొమ్ము లన్నియు నిలుమాఱగా నిచ్చి,

పసిఁడిగేదఁగి=పచ్చమొగలి. అసఘుశీమము=అసాధ్యము. పత్నిక=భార్యను. అశ్రులు=కన్నీళ్లు. నిలుమాఱ=నిలువుదోఁపుగను.

* '...బొమ్మ వెట్టిన...' '...బొమ్మ మెట్టిన...' అని పూ. ము.

'యస్మైనఁ గడచన్నై యాలిఁ గొండ దానెనఁ.
దమ్ము మాలినయట్టిధర్మంబు గలదె?
యివ్వసుంధరఁ బుణ్య మెంతయుఁ జేసి
యెవ్వఁడు బొందితో నేఁగెఁ దివికిఁ?
జనువులు విని, మీఁద జరుగు సౌఖ్యంబు
మది నమ్మి, బ్రతుకు బ్రాహ్మణునకు నిచ్చెఁ!
బసుపడి మొగిలులోపలి నీళ్లు నమ్మి
దోన నీళ్లుఁ జల్లు వేఁదులు లెందఁ గలరె?
యాలు బిడ్డలు తగు లని మున్నె కోసి
చాలించి నట్టి నిస్సంగుని నైనఁ
జేసిన నేరమి చేసేతఁ గుడువఁ
జేసి యీ బూమెలు సేసె దైవంబు.'
అను చుండఁ, మఱి కొంద 'అకట! యీరాజు
నన నేల? విప్రుల కవని వల్లభులు
దగిన దానము లీరో? ధన మియ్యఁ గోనరో?
పగ గాని యీరీతిఁ బట్టి యీ యట్టిమి,
దార లెక్కలకు నై తరువులు వెట్టి,
దారల నమ్మించి, ధనములు గొనెడి
కఠినచిత్తులు లేరు గాక లోకముల?
* హఠ మేల నృపులతో యమివరేణ్యులకు?

వసుంధరన్ = భూమియందు. పసుపడన్ = నిశ్చయముగా. మొగిలు=మేఘము. దోన=కొండమీఁది నీటిపల్లములోని చల్లు=పాఱఁ జల్లిపోఁగొట్టు. వేఁదులు=వెఱ్ఱివారు. తగులు=తగులాటము. బూమెలు=మాయలు. అట్టు=మెడను. దార=ధారాదత్తముల. దారలన్=భార్యలను. హఠము=పట్టుదల. యమివరేణ్యులకున్=మునిశ్రేష్ఠులకు.

* 'పగ మేల నృపులతో సంయమీంద్రులకు?' అని పూ. ము.
ఇందు పగ మనఁగా శాప్య మని గ్రహింప వలసి యున్నది.

వెడమాటు లైన యీ విప్రులఁ జూడ,
వడి ముడిగాఁ జొచ్చి వాత వెళ్లుదురు.
ఉపకార మోపిక నొనరించువారి
కపకార మొనరింతు రప్పుడే కడఁగి.
యల గుజ్జువడుగు మూఁ డడుగుల నేలఁ
దొలితొలి బలి వేఁడి తుది నెల్లు సేసె?
మరి కశ్యపాది బ్రాహ్మణా లిల యెల్లఁ
బరశురామునిచేతఁ బడసి యా ఘనుని
నుదధిలో నైనఁ గా లూఁదంగ నీక
కదలి పోఁ దోలరె గజిబిజి సేసి?
యిది యన్ని యేటికి నీ కౌశికుండు
తివిరి విప్రుఁడు గాక తిరిగెడువాఁడు
సొలపు దీఱఁగ వసిష్ఠునియింటఁ గుడిచి
తొలఁగి పోవుచు నెన్ని దొసఁగులు సేసె?
నిదె మహీతల మెల్ల నేలు నీ రాజుఁ
జెదరక యిట్లేడు చేట్లను జెఱిచి
పోనీక బందెలఁ బొరలించి తపసి
దానవుండై నల్ల ద్రావుచున్నాఁడు!
కడఁగి పీనుఁగువాఁడఁ గంపంబు వెట్టి
నడువఁగాఁ జూచు కసాహ్యత్రిగాఁ డీతఁ!

వెడ=కుటిల. ముడిగాన్ = ముడ్డిగుండ (అతి వినయముతో). గుజ్జువడుగు=వామనుఁడు. ఉదధిలోన్=సముద్రములో. గజిబిజి=అల్లరి. సొలపు=శ్రమ. దొసఁగులు=చెడుగులు. ఏడుచేట్లన్ = సప్తవ్యసనముల చేతను. బందెలన్=నిర్బంధములచేత. దానవుండు=రాక్షసుఁడు. నల్ల= నెత్తురు.

ఏడి నెవ్వరు లేక యీ రాజు తలనె
కూడెనే యీ బలుగు త్రెంపు టప్పు?'
ననఁగ; నందొక కొంద 'అద్దిరా! చేటు!
ధనికుల మని ప్రల్లదంపుఁ బెంపునను
రాజులు వాటించు రాణివాసముల
పూజతో నూడిగం బొనరింపఁ దమకు
* పరవులఁ గాఁ జేసి పరుష వర్తింపఁ
బురిలోనఁ బులుకాసిపురుషుల తగనె!
కరి రొంపిఁ జిక్కినఁ గ్రమ్మఱ నెత్త
కరి యోపుఁ గాక, సూకర మెట్టు లోపు!
ధర నింతవాని దుర్దశ నివారింప
నరు లోపుదురె విశ్వనాథుండు దక్క?'
నని యాని వగచుచు, నశ్రువు లొలుక
మును చిన్నఁబోయిన మోములు వంచి,
మరి నిల్వఁ జాలక మందిరంబులకు
నరిగి, శోకాగ్నుల నలయుచున్నంత;—

—. కాలకౌశికుఁడు .—

నాపురి గౌశికుఁ డాజ్ఞచే మున్నె
కాఁపురంబుగ నుండి కపటమార్గమునఁ
జెనఁటి విప్రునిరూపుఁ జేకొని మిగుల
ననుఁ బొందఁ బయించు నా కలిరాజు -

గీ. త్రెంపు=దట్టమయిన. ప్రల్లదంపుఁ బెంపునను = పెనుగావరము చేత. రాణివాసములన్ = రాణులను. ఊడిగంబు = సేవ. పరవులఁగాన్ = పరిచారికలను గా. పులుకాసిపురుషుల = పచ్చి తెక్కలిపురుషులన్.

* 'పరవులుగా' అని పూ. ము.

తలఁప నింతిం తని తన ధనంబునకుఁ
గొలఁది గాదని సట్టి కొడుకులు దన్ను
వారక నడుజాము వచ్చి వేఁడినను,
కోరిన ధనములు 'కొండు కొం' డనుచు
నక్కఱగొండఁ డై యప్ప టప్పటికి
వెక్కసంబున నూర్లు వేలు న ప్పిచ్చి,
ముట్టఁ జిక్కిన వేళ ముట్టి చేపట్టి
రట్టడై తిరిగి పత్త్రంబులు గొనుచుఁ,
బెట్ట వచ్చినఁ గల్ల పెనపులు పెనఁచి
తిట్టి వారును దానుఁ * దిరితీపు లాడి,
'మటుమాయలాఁడు, కంబళిపురీషంబు,
పటికిరింతలపిల్లి, పట్టిన † దొమ్మ,
శుద్ధకష్టుం. డాని చూపులు దెగడ,
బద్ధకంబుగఁ బెక్కు బాసలు సేసి
వృద్ధి మీఱఁగఁ జక్రవృద్ధిని మాస
వృద్ధిని లెక్కించి వెస నప్పు లెత్తి,
కాలకౌశికుఁ డనఁగాఁ బేరు వడసి,
కాలీచఁ డనుచు శీఘ్రముగ నింటింటఁ

నడుజాము=అర్ధరాత్రమున. చిక్కిన=కృశించిన-అప్పుబొత్తిగా తీర్పలేకపోయిన. ముట్టన్=(చేతితో)త్రోయఁదగినట్లుగా. రట్టడి = కఠినుఁడు. పెట్టన్=చెల్లించుటకు. తిరితీపులాడి=పెనఁగులాడి. కంబళిపురీషంబు=కంబలి కంటిన మలము - వదలదు - అసహ్యము. పటికిరింతలపిల్లి=చలము పట్టినపిల్లి. పట్టినదొమ్మ=తగిలినట్టి దొమ్మసంకటము. బద్ధకంబుగన్=సత్యమని. బాసలు=ప్రమాణములు. వృద్ధి=వడ్డి. చక్రవృద్ధిని=వడ్డికివడ్డిని. మాసవృద్ధిని=నెలవడ్డిని. కాలీచన్=కాలిసంకరతో.

* 'తిరితీపులాఁడు' అని ఒకముద్రణమున. † 'దొబ్బ' పా. = మాంసఖండము.

బాయక పంచాంగ పఠనంబు సేసి
యాయావారము లెత్తి యతిదైన్యవృత్తి
నడిగిన ధాన్యంబు లవి వేలువేలు
* ముడిచిన మూటలు మూఁపునై వ్రేలఁ;—
దోలు నస్థులఁ జిక్కి తూఁగాడు మేనఁ,
బేలు రాలెడు సిగ, పెడతలఁ గణితి,
పిల్లికన్నులఁ, గుఱుపేఁచు మీసములు,
నుల్లిగడ్డంబు, నత్యుగ్రదృష్టియును,
దళమైన పట్టెసగ్ధనములు, వ్రేళ్ల
నులిచిన దర్భలు, నుదుటిపై బొరుసు,
మెఱుఁగు నోరును, వెలి కుఱికిన పండ్లు,
† నలువు దోవతియు, పంచాంగంబుఁ, ముష్టిఁ
బరఁగిన కరతిత్తి, పత్త్రిల సంచి,
యొఱగినగొడుగును, నుసి రాలు కోల,
విడువక గోహత్య వ్రేలుచు నలుక
ముడివడ రాఁజూ మోమును, గల తన్ను—
'నదె వచ్చె నడపీనుఁ గ'నుచు నంతంతఁ
గదియుచు నైమె పుస్తకంపుఁ గౌఁపసి
తొలఁగుచుఁ బురజనుల్ తుప్పున నుమియఁ,
బలుమాఱుఁ గెలఁకులు పరికించు కొనుచు,
'యెవ్వఁడు సృతజాతుఁ, డెవ్వఁడు మగ్నుఁ,
డెవ్వఁడు దుర్వ్రతుం డీపురిలోనఁ ?

కుఱు = కుఱుచ. నులిచిన = నులిపెట్టిన. బొరుసు = కణితి. ఆలువు = జీర్ణసుయిన. కరతిత్తి = పత్త్రుపు చేసంచి. ఉసి = పుప్పి. పుస్తకంపుఁ గౌఁపు = దుర్గంధమునకు. సృతజాతుఁడు = చచ్చిపుట్టిన వాఁడు. మగ్నుఁడు = రోగి.

* 'ముడిచిన బట్టలు' † 'అరవ' పూ. ము.

ప్రేతవాహకుని గాఁ బిలువ రెవ్వరును,
ప్రాఁతిగా వెడలింప బడుగులు లేవు,
బ్రహ్మరాకాసుల భోజనమ్ములకు
రమ్మని ప్రార్థింప రాఁ డొక్కరుండుఁ,
బిండివంటలు నెయ్యి బెల్లంబు ప్రప్పు
గండశాంతులఁ దృప్తిగాఁ దిన లేదు,
సప్తకంబులఁ బాయసము నెయ్యి పెరుఁగు
తృప్తాః స్త గా జుఱ్ఱి త్రేన్పంగ లేదు,
కడికడి కొక మాడ గ్రహణకాలమున
వడి వీడ దోవతి వదలించుకొనుచు
బరు లుబ్బఁ బృష్ఠపర్యంతముగను
బెరుఁగు వంటకము పేర్పఁడు దిన లేదు,
లేదొ మృత్యువు? చంప లేఁడొ జముండు?
కాదేని, చావులు గఱ వాయె జగతి.
నీ కొట్టికకు విప్రుఁ డెట్లు చేరెడిని?
సైకొని బ్రతుక నే గతి గల దింక?
యూఁకలై జనులు నిర్మూల మై చనిరొ?
కాక, నా వీనులఁ గవిసెనో చెవుడు?

ప్రేతవాహకునిఁగాన్ = పీనుఁగును మోయుటకై. ప్రాఁతి = అధికము. బడుగులు = శవములు. గండశాంతులన్ = గండము శమించుటకై చేయు సంతర్పణలయందు. సప్తకంబులన్ = ఏడుగురను బిలిచి పెట్టు శ్రాద్ధములందు. 'తృప్తాః స్త' గాన్ = 'తృప్తుల రగుఁడు' అనునట్లుగా. మాడ = అరవరహా. బరులు = ప్రక్కలు. పృష్ఠ ఓష్ఠ పర్యంతముగను = ముడ్డి మొదలుకొని పెదవివఱకు. పేర్పఁడు = కడుపులో ఒకటి మీఁద నొకటిగా పేర్పఁ గలిగినంత. కొట్టికకున్ = కుగ్రామమునకు.

శ్రుతిసుఖంబుగ మఱి శుష్కరోదనము
వితతంబుగా నేఁడు విన రాద దేల?' —
నని తల పోయుచు; నా హరిశ్చంద్ర
జననాథు మాటల చంద మాలించి
'చిక్కెఁ బో! నేఁడు నా చే మత్తికాఁడు!
చిక్కులఁ బెట్టి కౌశికుని మెప్పింతు;
వెదకఁ బోయిన తీఁగ విస్మయం బొదవఁ
బదములఁ దగిలె నాభాగ్యంబుకతన!
బెదరించి వీరల భేద మొందించి
యుదరి పోఁ దోలుదు నుర్వీశు నొండె;
మనసులో దయ వుట్టు మాటలు వన్ని,
పనివడి బోధించి, భామఁబు గలఁచి,
యింతి నమ్మక యుండ నిపుడె మాన్పింతు;
నంతట మితి దప్ప నడఁగు సత్యంబు.' —
అని మడమలు మోవ కతి సంభ్రమమున
* గునుకుచు, సందడిఁ గోపంబు నిగుడ,
మూఁగిన ప్రజఁ గోల మొత్తి దట్టించి
లోఁగక పాఱఁ దోలుచుఁ, జనుదెంచి,
తన మ్రోల నిల్వ: — నాతని జన్నిదములు
గనుఁగొని విప్రుఁడు గాఁబోలు ననుచుఁ
జే యెత్తి మ్రొక్కెనఁ; జిఱునవ్వు నవ్వి
యా యవనీశుతో నా విప్రుఁ డనియె. —

శుష్కరోదనము=చచ్చినవారికై వ్యర్థ మయిన యేడ్పు. మత్తికాఁడు=మూఢుఁడు. ఉదరి=అదరి. ఇంతిక్ + అమ్మక. గునుకుచుఁ=కొలఁదిగా పరుగిడుచు. సందడిక్=జనులగుంపులో.

* 'కుఱుకుచు' అని యొక ము.

—కాలకౌశికుఁడు చంద్రమతిని విలుచుట.—

'గాఱుకొని నిన్ను నీ కులమును దెలిసి
పతి కాని దీవింప మాకు దోషంబు.
నీ వెక్కఁడవు? మఱి నీకుఁ బే రేమి?
ఈవిధి సతి నమ్మ నే యాక్రందవె?
నుడుగక వాతఁ గ్రొవ్వులుకంగఁ గుడిచి,
గడిపోతువలె మేనికండలు వెంచి,
కసవుఁ గట్టెలు మోయఁ - గాయ పండ్లమ్మఁ -
బసులజంగిలి గాయఁ - బాలేరు దున్నఁ -
గొఱమాలి, ముచ్చులఁ గూడి, దూఁటముఁ
జెఱ వట్టి తెచ్చిన చెలువ నా లనుచు
మొఱఁగి యీ రీతి నమ్ముట మాకుఁ దోఁచె;
నెఱిగి రేఁ దలఁపరు లిప్పుడే పట్టి
కొఱతఁ బెట్టుదు. రోరి, కోపులి విడిచి
పఱచి నీ ప్రాణముల్ బ్రతికించుకొనుము.
కాదేని పరవుఁడుఁ గా దార వోసి
మోదంబుతోడ నీ ముదిత మా కొసఁగు.
మెనయుంగ నీతప్పు లేము సహించి
కొని కాచెదము బ్రహ్మ కొడుకు వచ్చినను: —
అని పెక్కు దుర్భాష లాడెను విప్రుఁ
గనుఁగొని విభుఁ డాత్మఁ గలఁగ కిట్లనియె.—
'అరసి చూడఁగ నేర వకట! దురాత్మ,
పరిణాహములు బహుభాషలే కాని.

గాఱుకొని=యత్నించి. గడిపోతు=ఆఁబోతు. జంగిలి=సమూహము. పరవుడుగాక్=దాసినిగా. పరిణాహములు=కల్పనలు.

జగతిపై సూర్యవంశమునఁ ద్రిశంకు
జగతీశునకుఁ బ్రశస్తంబుగాఁ బుట్టి,
యే రాజ్యమొనరించు నీ కాలమునకుఁ
జోరశబ్దము సెవి సోఁక నీచేత.
మఱి బ్రాహ్మణుఁడు వచ్చి మఱుఁగుఁ జొచ్చినను
దఱలక రక్షింపఁ దగుఁ గాక, మాకుఁ
బరభయంబునఁ జిక్కి పాఱి నీ మఱుఁగుఁ
జొరఁబాఱ దగునె? యీ చొప్పగు నేని,
బాణాసనం బేల? బాణంబు లేల?
ప్రాణంబు లేల? కృపాణంబు నేల ?
ప్రబల మత్తేభ కుంభస్థల మాంస
కబళ మహోల్లాసి కంఠీరవంబు
ముదిసిన నాఁకొన్న ముట్టఁ జిక్కినను
బొదలు మాంసము డించి పులు మేయఁ జనునె?
దారుణ కరవాల ధారా హతారి
వీర కోటీర నవీన మాణిక్య
రంగవల్లీ రణరంగ విఖ్యాత
మంగళ విజయరమా కరగ్రహణ
శస్తమైనట్టి యీ క్షత్రియోత్తముని
హస్తమేరీతిని నలవడుఁ గృషికి ?

బాణాసనంబు=విల్లు. కృపాణంబు = కత్తి. ముట్టక్=పడఁద్రోయఁదగినట్లు. చిక్కినన్=కృశించినప్పటికిని. పులు=గడ్డి. దారుణ=క్రూర మయిన. అరివీర = శత్రువీరులయొక్క - కోటీర = కిరీటముల యందలి. విఖ్యాత=పొగడఁబడిన. గ్రహణ = పాణిగ్రహణముచేత. శస్తము = నుతింపఁబడినది. కృషికిన్=దుక్కికి.

పడి నుక్కు దాయంబు వచ్చుచో ధైర్య
ముడిగిన దైన్యంబు నొందిన నగరె?
మున్ను విశ్వామిత్రముని ముఖంబునకుఁ
బన్నుగా నే నొడఁబడు ధనంబునకు
మితిఁ జేసి చెల్లింప మేకొని వచ్చి
సతి నమ్మెదను హరిచంద్రుఁ డన్వాఁడ.'
జాలుము లేటికి నెందు సుద్దులు మాని
తొలఁగుము; నా లోని తుందుడు కార్పఁ
గలవాఁడ వేని నిష్కములు వేవేలు
వెలఁదికి విలువగా వేవేగ యిమ్ము.'
నావుడు.—విప్రుఁ డానరనాథుఁ జూచి,—
"భావింప నీ వాక్య పద్ధతిఁ గొంత
నిజము గానఁగ వచ్చె నీయెడ మాకు.
విజయోఽస్తు, భూపాల, విను మొక్క బుద్ధి:
నప్పులు గొని క్రోము ననువులు గొన్ని
చెప్పెద నా మాటఁ జేసెద వేని;—
తన డంబు దప్పక ధనికుల యిండ్ల
కనువునఁ జని, వారి కనురాగ మొదవ
రిత్త మ్రొక్కులు మ్రొక్కి - ప్రియములు వలికి -
నెత్తిఁ జేతులు వెట్టి - నిక్కముల్ నొడివి -

ఉక్కుదాయంబు = గొప్పయిడుమ. మితి=గడువు. మేకొని= ఒడంబడి. జాలుములు=దార్జన్యపుమాటలు. తుందుడుకు=సంతాపము. నిష్కములు=వరహాలు. పద్ధతిచే=సరణిచేత. డంబు = స్థితికిమించిన వేసము. అనువునన్=ఉపాయముగా.

తెరలఁ డియ్యని పండ్లతీపులు మరపి -
చరణసేవలు సేసి - చనవులు మెఱసి -
యిమ్ములఁ దనపేర్మి యెంతయుఁ జెప్పి -
నమ్మికఁ బుట్టించి - నయములు సేసి -
గడుసరి మనసులు గరఁగించి పుచ్చి -
జిడికిరింతలు గట్టి; చెవి యాన కున్న; —
బోలుసొమ్ములు, లక్కపాదువులు, గాజు
జాలమాయ పసిండి జలపోసనములు
లోహచితంబులై లోలత మించు
నేహారంబులు గొన్ని నీలాల నమర
గుప్తంబుగా రాత్రిఁ గొనిపోయి దీప
దీప్తిఁ గ్రొమ్మెఱుఁగులు దీపింపఁ బట్టి,
'రాజులచెవిఁ బడి రవ్వ గాకుండ
నోజతో నివి దాఁపుఁ డొండెడ.' ననుచు
మొఱఁగి, మొఱంగిన ముద్రగా వైచి,
తఱుచుగా లక్కముద్రలు మీఁద నొత్తి,
యాపీఁతంబులు వెట్టి, యవి దక్కమితులు
సాహసంబునఁ బల్కి, సాక్షులఁ బెట్టి,

తెరలక = కబళమునందు. మరపి = అలవాటుపఱిచి. గడుసరి = కఠినములైన. ఇమ్ములక = ఉపాయములతో. జిడికిరింతలు = మోసపు మాటలు. లక్కపాదువులు = లక్కగ్రుక్కిన నగలు. గాజు = గాజుతోఁ జేయఁబడిన- జాలమాయ = ఇంద్రజాలపుమాయవంటి- పసిఁడి జలపోసనములు — బంగారు నీటిమొలాములు. లోహచితంబులు = ఇనుముతోఁ జేయఁబడినవి. నేహారఁబులు = మణిహారములు. దీప్తిక = వెలుతురునందు. ఓజతోక = జాగ్రత్తతో. మొఱఁగి = మోసపుమాటలుపలికి. మొఱంగిన = గుప్తమయిన. ముద్రగాక = మూటగా. ఆపీఁతంబులు = తాకట్టులు.

ప్రబలంబుగా వడ్డి పాటిక మున్న
* కుబుసంబులోఁ జే మగుడ్చు చందమున
నచ్చుగాఁ దీర్చి మాయప్పని కొన్ని
యచ్చికబుచ్చిక లాడి, పత్త్రములు
గొంటుక యిచ్చి, యా క్రియ నూర్లు వేలుఁ
† గంటుఁ బిడక గట్టి కైకొని; § మరల
లండుఁబోతులఁ దనలాగు పెన్ లజ్జ
బండలఁ గొందఱఁ బాటించి తెచ్చి,
టక్కరి పూఁటతాఁటలు సేసి ధనము
చక్కనఁ గైకొని; — జరిగిన పిదపఁ,
దనజాడ దెలిసి క్రంతకుఁ దీసిరేని
మనమున బెదరక, మానంబు విడిచి,
కట్టుఁ గొట్టును బడి కరకరి కోర్చి,
నట్టు వెట్టిన మోచి, సరి యాఁక నుండి,
ఘుటికసిద్ధుఁడు - రాయి గొట్టిన గొడ్డ -
లటుమటుకాఁడు - మహామాయలాఁడు -
గడుసు-తుంటరి - జోగి గ్రక్కిన ముడుసు -
ముడి దిన్న నక్క - ముష్మోటు - పిసాళి

కుబుసంబులోన్ = అరచొక్కాలో. కుబు...చందమునన్ =గుప్తముగా. చే=చేయి. లండుఁబోతులన్=కుత్సితులను. పూఁటతాఁటలు=జామీను మోసములు. క్రంతకున్=రచ్చకు. కరకరికిన్= పెట్టెడు బాధలకు. ఆఁకన్ = చెఱలో. ఘుటికసిద్ధుఁడు=పాదరసపు గుళికను మ్రింగిన యోగి. రాయి గొట్టిన=మొండి.

* ఈయర్థమున శబ్దరత్నాకరములో 'కుపసము' ఉన్నది, 'కుబుసము' లేదు.
† 'బిడకలు' అను పువగనపాఠమున ఒకలఘువు ఎక్కువ. § 'పిదప' అని పూ. ము.

బలు కత్తి - రాతికిఁ బాసిన గొంటు —
ఇలలోన నిట్టి మహేంద్రజాలకుని
చేపడ్డ ధనములు సేరునే మగుడ?
వాపోవునే పిల్లి వడిఁ దిన్న కోడి?
విసికితి మని తారె వేసారి యప్పు
లొసఁగినవా రెల్ల నొల్లక తొలఁగ,
నెమ్మదిఁ దా నంటు నే. ర్పటు గాక,
యిమ్ముల నీ రీతి నిల్లాలి నమ్మి
దీనత్వమైఁ 'దల దెగఁ బడి యప్పు
పూని దీర్చెద.' నంటు బుద్ధిలోపంబె.
పెట్టు లే నని యొట్టు పెట్టి బొంకినను
గట్టు వచ్చునె నిన్నుఁ గౌశిక మునికి?"
నావుడుఁ:— జీఱునవ్వు నవ్వి యా రాజు
'వావిరి మీబోంటి వదరు పెద్దలకు
నుపదేశ మొనరింప నోపుఁ గా, కిట్టి
విపరీతబుద్ధులు విన నింపు గావు;
బుజ్జగింతలుఁ బోరి బొంకుమాటలును
మజ్జాతు లగువారి మాటలు గావు;
... ... ... ...
జజ్జరకాడ నీ చను త్రోవఁ జనుము.
నెరయ నీఁ గొన లేని నీ వను వట్టి
పరవ (?) మాటలు సయింపవు దల. మ'నినఁ;—

రాతికిఁ బాసిన గొంటు=రాతిదెబ్బకు చిదుగని గొంటుపోఁక.
వాపోవునే - కత్త కోడి. పెట్టుక=తీర్పు. మజ్జాతులు = నాజాతివారు.
జజ్జగకాఁడ=వంచకుఁడా.

గాలకౌశికుఁడు భూకాంతుని సత్య
శీలంబునకు మదిఁ జిత్రంబు నొంది,
పలుకు ని ట్లనిః—'మహీపాలక, నీకు
కల నొప్ప నీ దురవస్థలు దొలఁగ
వెరవుఁ జెప్పిన నీకు విరసమై తోఁచెఁ.
బరికించి చూడ నీభాగ్య మెట్టిదియొ!
మాకుఁ దోఁచిన దొకమాట చెప్పితిమి.
కాక నీమతి కింత కటుకం బైన
హితవుఁ జెప్పంగ మా కేల? నీ కెట్టి
గతి పుట్టఁ గల దట్టు గానిమ్ము మీఁద.
నాలి నంగడిఁ బెట్టి యమ్మెదు నీకు
జాలి లే దఁట! మాకు సంతాప మేల?
కోరిన ధన మెల్లఁ గొ.' మ్మని యెల్ల
వారును జూడ సువర్ణనిష్కములు
రూపించి చాకంబు ద్రోచి చెల్లించి,
భూపాలునకు నిచ్చె భూసురోత్తముఁడు.
వల నొప్ప ముఖపద్మవాసన కెగురు
కలికి తుమ్మెదల రెక్కల గాలిఁ గదలి
తిలకించు చంద్రమతీ దేవి కురులు
బలువిడిఁ గృప మాలి పట్టి రాఁ దిగిచి,—
పాపట నెఱి తప్పఁ, బయ్యెద జాఱ,
వీఁపున నెఱివేణి విరిసి తూఁగాడ,
బదములు దొట్రిల్ల, బాష్పముల్ రాల,
వదనంబు నెమరింప, వాతెఱ గంద,

చాకంబు = నాలుగేసి. తిలకించు = ప్రకాశించు. బలువిడిన్ = అతిక్రోధముతో. నెఱి = చక్కన.

ఘనకుచంబులు రాయఁ, గా నసి యాడఁ,
దను వెల్లఁ గంపింప, ధైర్యంబు వదలఁ, —
దివుటమై బెబ్బులి ధేనువుఁ బట్టి
గవిఁ జేరఁ గొనిపోవు కైవడిఁ దోఁపఁ,
నాలు గే నడుగులు నడవ నీడ్చుటయు; —
బాల వత్సము వోలెఁ బాయక వెనుకఁ
దగిలి వాపోవుచుఁ దల్లిఁ బో నీక
బిగియఁ బయ్యెదకొంగుఁ బెనఁచి చే పట్టి
యాకఁటఁ జంటి కఱ్ఱాడుచు ముద్దుఁ
గూఁకటి తూఁగాడ గునియుచు నున్న
సుతు లోహితాస్యునిఁ జూచి, భూపాలుఁ
డతిదుఃఖితాత్ముఁ డై యశ్రువు లొలుకఁ,
దాలిమి వదలి గద్గదకంఠుఁ డగుచుఁ,
గాలకౌశికునితోఁ గదిసి యి ట్లనియె. —
‘ నెలమి ధేనువు విక్రయించుచోఁ గ్రేపుఁ
దొలఁగింతురే, తల్లిఁ దొలఁగఁగాఁ జేసి?
నా కులభూషణు నా మూర్తి పట్టి
నీకొమారునిఁ గొను మిచ్చెద నీకు;
విలువ వీనికి వేయి వేలు నిష్కములు,
వల నొప్ప నొసఁగుము వసుధామరేంద్ర.’
నావుడు విప్రుఁ డా నరనాథుఁ జూచి
‘ నీవు సెప్పినమాట నిక్క మంతయును ;
గోవు విల్వఁగఁ జన్నఁ గూడిచెడిక్రేపు
గోవుతోడనె జట్టిఁ గూడి రావలదె?

అసి=ఇందుక. తివుట=తమి. గవిన్=గుహను. అఱ్ఱాడుచు=మెడ యెత్తుచు. కూఁకటి=జుట్టు. గునియుచున్=నర్తించుచు. క్రేపు=దూడ.

యక్కఱ దీరెను నందాక ధనము
నెక్కడఁ గొని వత్తు రెవ్వ రెం దైన?
నోడక నఘముల కోర్చి యీ కల్ల
లాడంగ మా జంఘు లదురు చున్న యవి.
చక్క నీ వచ్చిన జాడఁ బొ మ్మింకఁ,
జిక్కఁడు కాలకౌశికుఁడు నీ చేత.
ఇచ్చి నాచేఁ గొన నీశుండు నోపఁ;
డచ్చి నా యెదుర బ్రహ్మకుఁ బోవ రాదు.
పురిలోన బందెల పో తీతఁ డనఁగఁ
బరఁగ నా పేరిఁ జెప్పఁగ మున్న వినవె?
కాలరుద్రుని నైనఁ గాలుని నైనఁ
గాల మృత్యువు నైనఁ గాల దట్టింతుఁ.
బురుషుఁ డెవ్వఁడు నీకుఁ బూని న న్నిచట
నరుదుగా నౌను గా దనువాఁడు గలఁడె?
వీఁడు నా దాసుఁడు, వెలఁది నా దాసి.
యేడఁ బుత్త్రిని నమ్మె దిఁకఁ జెప్పు.' మనినఁ;—
విని యప్పు డా ధూర్తవిప్రునితోడ
మనుజేశుఁ డలుకతో మఱియు ని ట్లనియెఁ.—
'గొనియాడఁ దగువిప్రకులమునఁ బుట్టి
చనునె నీ కిట్టి యసత్య వాక్యములు?
ప్రొద్దున లేచి నీ మొగముఁ గన్గొనిన
న ద్దినంబున వచ్చు నాపద లెల్ల.
ని న్నొక విప్రుని నిందింప నేల?
మిన్నక తలపోయు మేదినిలోనఁ

జంఘులు=పిక్కలు. అచ్చి=అప్పుపడి.

గ్రాసము వడ్డికి నిచ్చి కూర్చెడివారి
జాడ లిట్టివియ. యాశ్చర్య మేమిటికిఁ?
కులము ప్రధానమే గుణము లే కున్నఁ?
కలశాబ్ధిఁ బుట్టదె కాలకూటంబు?
వెడమాట లన్నియు విడిచి, నే యిప్పు
డడిగిన ధనము సయ్యనఁ జౌక మెన్ని,
కొడుకుఁ గోమలిఁ దోడుకొనుచు నీ యింటి
కడ కేఁగదవో, లేక, కాఱులు వల్కి,
కినిసి బ్రాహ్మణుని శిక్షింపఁ లే రనుచుఁ
జెనఁటి కోడిగములు సేసి పోయెదవు?'
నావుడు;—విప్రుఁ డన్నగపతి కనియెఁ.—
'గావరంబున నోరు గడచ నాడెదవు.
చెడి కల్ల లాడినఁ జేరునే ధనము?
కడపట నీవు నక్కఱ దీరదేని,
యున్నగాఁ గత్తియు బలపంబుఁ బూని
కన్నపెట్టుము సిరి గలవారియిండ్లు.
నీచాత్మ, ప్రొద్దున నీవు నా మొగముఁ
జూచితి గాన నా సొమ్ము నీ కబ్బెఁ.
దివిరి నాకులము నిందించి నాగుణము
వివరింప నీ కేల? విద్య మందదవో?
నను విప్రుఁ డని కాచినాఁడవు గాక,
కినిసి కావున్న శిక్షింతువే నీవు?

గ్రాసము=తిండికై యుంచుకొన్న ధనమును. కలశాబ్ధిఁ=పాల సముద్రములో. వెడ=వెఱ్ఱి. చౌకము = నాలుగేసి నాణెములుగా. కాఱులు=దుర్భాషలు. కోడిగములు=తుంటరిచేష్టలు. బలపము=చోరసాధనవిశేషము.

కటకటా! వెఱచునె కాలకౌశికుఁడు
కుటిలవిచార, నీ గూబ జంకెనల?'—

### నక్షత్రకుఁడు లోహితాస్యుని గుఱించి తగవు తీర్చుట.

నని యిట్లు బ్రాహ్మణుఁ డా మహీవిభునిఁ
గనలి తర్కింపఁ నక్షత్రకుఁ డనియె.—
'వసుధేశ, యీ పట్టి వాగ్వాద మేల?
మసలక మీలోని మలఁకలు వాయఁ,
దగవు గావింతుఁ, బెద్దలు మెచ్చి పొగడఁ,
దగిలి మీ కది సమ్మతం బగునేని.
లక్ష మాడలు దెచ్చి లంచ మిచ్చినను
బక్షపాతము మాకుఁ బని లేదు గాన,
మాట మాటకుఁ బుట్టు మదిని జలంబు,
పాటించి చలమునఁ బ్రబలుఁ గోపంబు,
ప్రాపించుఁ గోపంబు పాపంపుఁ బొత్తుఁ,
బాపంబు నరక కూపమునకుఁ దెరువు,
గాన, నీ మది దురాగ్రహమును గొంత
మాని, నా చెప్పిన మాట గ్రహింపు.'
* మని చెప్ప; ముద మంది యా బ్రాహ్మణునకు
మనుజనాథుండు సమ్మతి నిట్లు లనియె.—
'వటుశిరోమణి, భవద్వాక్యంబు మాకుఁ
బటుబుద్ధిఁ దలపోయ బ్రహ్మమంత్రంబు.

గూబజంకెనలు = గుడ్లగూబ కంటి బెదరింపులకు. కనలి = కోపించి. మలఁకలు = చిక్కులు. తగవు = తీర్పు. ప్రాపించును = పొందించును. కూపమునకు = బావికి. వటుశిరోమణి = ఉత్తమబ్రహ్మచారీ.

* 'మని చెప్పి ముద మందు నా' అని పూ. ము.

పన్నిన చీఁకటిఁ బాపి వెల్గింప
సన్నపు దీపంబు చాలదే తలఁపఁ?
చిన్నవైనను బుద్ధిఁ బెద్దవు నీవు;
మన్నించి మాన్పుము మా వివాదంబు.
నీ వెట్లు చెప్పిన నీ చెప్పినట్ల
కావింతు.' ననిన నక్షత్రకుం డనియె.—
'నిఖిల భూజనులకు నిజము నిష్ఠురము,
ముఖము స్రుక్కింతురు మోవ నాడినను;
పాడి దీర్చుట దొడ్డపని యగు; నైనఁ,
గూడదు పోలించి గోళ్లు రాయఁగను.
మాకుఁ దోఁచిన జాడ మానవాధీశ:—
ఈ కాంత విప్రున కీ వమ్మునపుడు
బాలుఁ డీ జట్టిలోపలివాఁడు గాఁడె?
పోలఁ బుత్త్రున కింత బాలఁతుక కింత
విలువ ధనం బని వేర్వేఱ చెప్పి
తెలియ వాడక జట్టి దీర్చితి గాన,
సుతునితోఁ గూడ నీ సుందరి దక్కె
వితతంబు గాఁగ నీ విప్రముఖ్యునకు.'
నని తన చక్కిగా నా ధూర్తవిప్రుఁ
డొనరఁ జెప్పిన మాట కుత్సాహ మంది,
కాలకౌశికుఁడు నక్షత్రకుఁ గ్రుచ్చి
యాలింగనముఁ జేసి, యధిపు కట్టెదుర
వెక్కిరించుచుఁ, గోల విసరుచు, నోరు
వెక్కసంబుగ విచ్చి వెడనవ్వు నవ్వె

పాడి = ధర్మము. చక్కి = పక్షము.

గంతులు వైచుచుఁ, గరతాళగతుల
సంతంత వాడుచు, సంతటఁ బోక,
పడుచు లార్వఁగఁ జొట్టుఁ బరువులు వాఱి
కడఁగి దూచెడివారిఁ గదలఁ దోలుచును,
బలు విస్వరంబులఁ బనసలు గొన్ని
చెలఁగి త్రస్సలు మీఁదఁ జిలుకఁ జెప్పుచును,
* జెనఁటికోఁతికి వీరసివ మెత్తి నట్లు
కనుకనిఁ బెక్కు వికారముల్ సేయఁ;—
జూడ రోయుచు మహీశుఁడు మదిలోన
‘ నేఁడ ధర్మం బింక? నెక్కడి తగవు?
లెక్కడి దైవ మిం? కెక్కడి సత్య?
మెక్కడిభూసురుఁ? డేమి చెప్పెడిఁ!
† ఎలమిఁ జొట్టమువలె నీ ధూర్త వటువు
పిలువని తగవుఁ జెప్పెద నని వచ్చి
కాలకౌశికుని పక్షము పల్కె, వంశ
నాశపన్నగ మానసము ముట్టి నట్లు.
ఈ ద్విజాధమునకు నీ యనాచారి
కీ ద్వేషచిత్తున కీ పిశాచమున
§ కీ క్రూరకర్మున కీ యెబ్బరాసి
కీ కష్టచరితున కీ బహుభాషి—

పడుచులు=పడుచువాండ్రు. త్రస్సలు=నోటింతుపరలు. వీరసివము=వీరులయావేశము. కనుకనిక్=సంభ్రమముతో. వంశనాళపన్నగము=పిల్లనగ్రోవిలోఁ దూఱినపాము. ఆననము=మొగమును. ఎబ్బరాసి=రోఁతమానిసి.

* ‘వీరసివ మ’ని ‘వీరతాయెతు’ వలె గ్రహింపవచ్చును; ‘వీర్లశివమ’ని వ్రా. ము.

† ‘ధూర్తవడుగు’ § ‘పబ్బరాసి’ అని వ్రా. ము,

కీ పల్లవాధర నీ కీరవాణి
నీ పుష్పకోమల నీ పద్మగంధి
నీ చంద్రబింబాస్య నీ నీలవేణి
నీ చకోరాక్షి నీ యిభరాజగమనఁ —
బులిమెడ గోటిఁ జెంపునఁ గట్టి నట్టు
లలవున దాసిగా నమ్ముకో వలసె.'
నని, వెచ్చ నూర్చి, హా! యని, తల వంచి,
కనుఁగవ బాష్పంబు కణములు దొరఁగ,
నెసఁగు శోకాగ్నుల నెరియుచు నున్న
వసుధేశు దీన భావంబు — వీక్షించి; —

— చంద్రమతి కాలకౌశికునితోఁ బోవుట. —

పురపురఁ జిత్తంబు పొక్క, నందంద
కరుణతో నా రాజ కాంతా లలామ
సుతుఁడును దాను, నేడ్చుచుఁ జనుదెంచి,
పతిపాదముల మీఁద భక్తితో వ్రాలి,
కొడుకు మ్రొక్కించి, డగ్గుత్తికఁ బెట్టి,
కడగోరఁ గాటుక కన్నీరు మీటి,
పాణిపల్లవములు పరఁగంగ మోడ్చి,
'ప్రాణేశ, నేఁటితోఁ బాసితే మమ్ముఁ ?
బాయఁ ద్రోవలు సేసెఁ బ్రతిబంధ మకట!
* మాయురే! కౌశికమాయాపిశాచి!
ఇది మొదలెం దున్న నేమి? నీయొద్దఁ
గదలవు నా మనోగతులుఁ బ్రాణములు.

ఇభ రాజ గమన = గొప్ప యేనుఁగు నడకవంటి నడక గలది.
ఎరియుచున్ = పొగులుచు. మాయురే = బాపురే.

* 'మాయాపిశాచ. మిది'.

నా నోముఫలమున నాథ, నీ వెలమి
నీ నిఖిలార్తియుం దేలెదు మగుడ.
నక్షత్రకుండు దుర్ణయమున విప్రు
పక్ష మాడుట కాత్మఁ బరితాపపడకు.
సన్మార్గవర్తివై జరుగు నీ మీఁద
నున్మాదమున రేఁగి యో నృపచంద్ర,
వక్రించెఁ గుశికసంభవరాహు విప్రుడు;
చక్రాయుధుఁడు నిన్ను శరణమై మనుచు,
నక్రంబు పట్టిననాఁడు గజేంద్రు
విక్రమంబునఁ గాచి విడిపించినట్లు.
తఱలకు ధైర్యంబు, దలఁపకు మమ్ము,
మఱవకు నీ సత్యమహిమంబు.' ననుచుఁ;—
బలిపాదములమీఁద భక్తితో వ్రాలి
సుతుని మ్రొక్కింపంగఁ; — జూచి యాసతిని
గాలకౌశికుఁ డౌడు గఱచి నిప్పుకలు
రాల వీక్షించి కరాళించి పలికె.—
'నోసి, నాయెడ భయ మొక్కింత లేక,
వాసి మాలినబీదవానిని మ్రుచ్చు
డాసిన గతి నిల్చి డాసి నేఁ జూడఁ
బాసి రా నేరక భాషించు టెట్లు?

సన్మార్గవర్తివి=మంచి నడవడిలో నుండువాఁడవు — నక్షత్ర మార్గములో నుండువాఁడవు. నృప చంద్ర=రాజ శ్రేష్ఠుఁడా — రాజ వనెడు చంద్రా. కుశిక సంభవ రాహువు=విశ్వామిత్రుఁ డనెడి రాహు గ్రహము. చక్రాయుధుఁడు = విష్ణుదేవుఁడు. నక్రంబు = మొసలి. ఔడు = క్రిందిపెదవిని. కరాళించి = గద్దించి.

భాషించి మఱి చాఁగఁబడి మ్రొక్కు టెట్లు?
రోష మెట్లోదవ దీ రోఁతఁ గన్గొనిన?
బాపు పతివ్రత! బాపురే గోల!
బాపురే గుణవతి! బాపురే ముగుద!
విడువు మీ దేశాలి(?) విద్దె. లొజ్జలకు
బడితపాఠము దొంగపదరు లన్నియును.
ఎఱిఁగితి నీ మర్మ; మిఁక నేమఱించి
యుఱికి పోఁ జూచెద; వూడ నీ వెనుక.
దక్కితి వని నమ్మఁ దగదు ని న్నెపుడుఁ;
గుక్కకూఁతుర, మెడఁ గోసి పోఁగలవు,
రెంపు పో వాడిన రేవనిరీతి
నుండ. బాలకు నిన్ను నోరంత ప్రొద్దుఁ
గీలుసంకెలఁ గేలఁ గీలించి వీఁపు
ప్రీలంగఁ గొట్టుదు వెఱపు లేకున్న.
గోఁచి గట్టిననాఁటఁ గోలెఁ బీనుఁగుల
మోచి గడించిన మూలధనంబు
కసి బెండపువ్వుల గతి రాసి వోసి
* పొసఁగు నీవాతన పొన్ను లెన్నితిని.

గోల = ఏమియుతెలియనిది. ముగుద = ముద్దరాలు. దేశాలి— (దేశవాళి = గ్రామములందు వాడుకయయిన, లేక-దేశ + ఆలి = నాటి బసివి). ఒజ్జలకున్ = గురువులమయిన మాకు, బడితపాఠము = గట్టిపాఠము. పదరులు = మాటలు. ఊడన్ = విడిచిపోను. రెంపు = రెండు గట్టులను ఆలవైచినగుడ్డలను. రేవనిరీతిన్ = చాకలివలె. ఉండన్ = నేను ఉండు నట్లుగా. ఓరంతప్రొద్దున్ = అహోరాత్ర మంతయు. నాఁటఁగోలెన్ = నాఁడు మొదలుగా. కసిన్ = కడుపుమంటతో. నీవాతనె = నీకోసమే.

* '...నావాతనె పొక్కు లెన్నితివి' అని ప్రా.

చే తడియూఱ దుచ్ఛిష్టపు లేమ;
బ్రాఁతియే నీవంటి బానిస లెవటఁ?
గండ్రకొవ్వున నన్నుఁ గైకొని రాక,
మెం డొగ్గెదవు. మందె మేలముల్ మాను.'
మనుచుఁ బట్టుఁ దలంచి; యా పువ్వుబోఁడి
తనువు ద్రొక్కుచుఁ బాణితలముల నొగ్గఁ,
బెలుచ నెత్తురులు సిప్పిలఁ గోల మొత్తి,—
తలకొన్న కోప మంతటు నిల్ప లేక,—
వెఱచి వాపోవుచు వెసఁ బాఱె తండ్రి
మఱుఁగుఁ జొచ్చిన సుకుమారుఁ గుమారుఁ
గుదికిలఁ బడ రెట్టుఁ గుపియించి తిగిచి,
యెద రంటు మొత్తి, నో రడఁగ జంకించి,
పెడమాట లన్నియుఁ పెనుమోపు గాఁగ
మడఁ బెట్టి యా చంద్రమతి నెత్తి కెత్తి,—
* 'మురిపెంబు పని లేదు, ముందఱ, నింక
సరగున నింటికి జరుగు; లెమ్మ'నుచుఁ,
దన వెంట విప్రుఁడు తఱుముచు నడవఁ;—
దనయుఁ ముద్దుల కేలు దనకేలఁ బట్టి,
చెక్కుల సన్నంపుఁ జెమ రెక్క, నడుము
నుక్కుట నొక్కింత నూఁగారు దోఁప,
సలరు పయ్యెద జాఱ, నలకలు చెదర,
నులివాల్గు వాఁడి తనూలత సోల,

ఉచ్ఛిష్టపులేమ=ఎంగిలియాఁడుదానా. బ్రాఁతియే=దుర్లభలా. మెండు ఒగ్గెదవు=ఎదిరించెదవు. మందె మేలములు=ఉపేక్షలు. గుదికిలఁ బడన్=గొంతుకూర్చుండఁగా. పెడ=దిల్లర. నుక్కుటన్=చలనముచేత.

* 'మురిపెంపుఁబని' అని ఒక ప్ర.

కలయుచుఁ జనుచున్న ;—యా మచ్చెకంటిఁ
గలయ వాడలఁ బుణ్యకాంతలు సూచి,
వగలఁ గుందుచు, బాష్పవారి బిందువులు
దెగిన ముత్యంబుల తెఱఁగునఁ దొరఁగఁ,
'గటకటా! భార మెక్కడనుండి వచ్చె
గిటగిట నైన యీ కీరవాణికిని?
గవభార మోర్వని కంత మీ ధాన్య
నిచయ భారమునకు నిలువ నెట్లోర్చె?
నేల దీనికిఁ గుంద? నిటు చూడ రమ్మ,—
వ్రేలి నెయ్యనఁ బట్టి వెనుకొని వచ్చు,
వెన్నముద్దకు రూపు వెట్టినమాడ్కి
నున్న మెత్తనిమేన నొప్పెడువాఁడు,
ఎన్నఁడు నెండఁ గన్నెఱుఁగని శిశువు
గన్నుల ముత్యాలు గాఱ నేడ్చెడిని.
* ఏఁజెల్ల! నీ యమ్మ! యీ చక్కనన్న
రాజతేజము గల రతనాల పెట్టె,
నడవ నెట్లోర్చెనో నా ముద్దుఁజిలుక?
కడుపు చుఱుక్కనుఁ గన్న వారికిని.
† వీఁ డొక్క వెఱబొమ్మ విప్రవృశ్చికము
పీడించి వీరి నొప్పించుచున్నాఁడు.
కాలఁ గాఁ జిక్కిన కాష్ఠంబువంటి
కా లీడఁ బోయిన కట్టెఁడి మాల.

నులి—కొంచెము. తనూలత = తీఁగవంటిమేను. గిటగిటనైన = అల్పమయిన. నిచయ = మొత్తము. విప్రవృశ్చికము = బాపనరూపు తేలు. కట్టెఁడి = కఠినుఁడు.

* 'నే చెల్ల... । రాచతేజము...' † 'కెరబొమ్మ' అని యొక ము.

చందురంబులును బుస్తకమును గోపి
చందనంబును జూచి చనదు సూ నమ్మ.
నెందును బురిలోన నెప్పుడు మెలఁగు
బందికాండ్రకు నివి పరఁగు చిహ్నములు.'—
అని విప్రుఁ దిట్టుచు నా వధూజనము
దనమీఁద మెటికె లందఱుఁ బెట్టి విఱువ;
ముఖ మెఱ్ఱనై బొమముడిపాటు గదుర,
శిఖ వీడ, బుస ముక్కుఁజెరమలు నిక్క,
'నవఘళంబుగ దండ మల్లార్చి పేర్చి
కవిసి వ్రేసిన,మహా కలకలం బెసఁగ;
'నదె విప్రభల్లూక మరుదెంచెఁ, దలఁగి
పద పద.' మనుచు న ప్పౌర కామినులు
వెల్లుగా నొండొరుఁ బిలుచుచుఁ, గలఁగి,
జల్లున గమి విచ్చి, సందుల దూఱి,
పోవంగఁ;—జూచి యా భూసురాధముని
వావిరి వెతఁ బెట్టి వడుగులు గదిసి -
కదిచి యొక్కఁడు చేతికోలఁ బో వైచె,
బెదర నొక్కఁడు సిగఁ బెటికి రాఁ దిగిచెఁ,
బొడిచె నొక్కఁడు తూటు వోవఁగ నెత్తి,
విడిచె దోవతికట్టు వెస నొక్కరుండు,
నొక్కఁడు మీసంబు లూడి రాఁ బెఱికె,
నొక్కఁడు జందెంబు లాగిఁ ద్రెంచి వైచె,

సూ = సుమా. అవఘళంబుగన్ = హెచ్చుగా. విప్రభల్లూకము=ఎలుఁగుబంటి బాపఁడు. తలఁగి = తొలఁగి. కదిచి = క్రమించి. విడిచెన్ = విప్పెను.

నొక్కఁడు గోడుఁగు డాయుచుఁ బట్టి విడిచె,
నొక్కఁడు పుస్తకం బొడిసి కైకొనియె,
నొక్కఁడు గుడికల పర్విపైఁ ద్రోచె,
నొక్కఁడు గన్నుల నొగి మన్ను సల్లె,
నొక్కఁడు మొగముపై నుమిసె నాలోన,
నొక్కఁడు వెస నాఁకె నూర్ధ్వపుండ్రంబు,
నొక్కఁడు రాలపై నొనరంగ నీడ్చె,
నొక్కఁడు పిడికిట హు మ్మని గ్రుద్దెఁ.
బెక్కుగాఁ దోఁడేటిపిల్లలు గూడి
బక్కుచింబోతు లంపట పెట్టి నట్లు.
కాలకౌశికు నిట్లు గారించు విప్ర
బాలుర కెల్లను బ్రణమిల్లి, నిలిచి,
సన్నుత ప్రియ వాక్య సరణిఁ బ్రార్థించి,
మన్నింపుఁ డను చంద్రమతిమాట కలరి,
'నీవుఁ బ్రియంబుగా నీచు నీ విప్రుఁ
గైకొని చంపక కాచితి.' యనుచు,
వడుగు లందఱు వాడవాడకుఁ బోవ;
వెడ గోడ్డుఁ బులి నాకి విడిచిన ట్లయిన;—
జడిసి తొల్లిటి తన జంజాట మెల్ల
నుడిగి, కోఱలు లేనియురగం బోలె,
వడి చెడి తల యెత్తి, వడుగు లచ్చోట
నుడియ కుండఁగ నారమాపులు నూచి,
దోవతి ధూళి విదుల్చుచు లేచి,

బోతుఁ = మేఁకపోతును. ఊర్ధ్వపుండ్రంబుఁ = నిలువు బొట్టును. లంపటపెట్టు = శ్రమపెట్టు. వెడ = ఇంచుక. ఉరగము = పాము. నుడియకుండఁగఁ = తిరిగి రాకుండ.

భూవల్లభుని దేవిముఖము వీక్షించి,
'యోసీ, న న్ని బ్భంగి సూడక గ్రుద్ది
గాసి పెట్టెదు పలుగాకుల నెల్ల
దలవరు లరుదెంచి దండింపకుండఁ
దొలఁగి పొ మ్మని పాఱఁ దోలంగఁ దగునె?
ఇంటివారిని లేపి యీవల దొంగ
* బంటు చేతికి నిచ్చు పాపాత్మురాల.
వరవుగా ని న్నెట్లు వచ్చు నమ్మఁగను?
పరుసని మాటల పని యిప్పు డేల?
ఇల్లు సేరినమీఁద నీ పగ యెల్ల
వెల్లింప కన్న నే విప్రుండ నఁటవె?'
అని పగఁ జాటుచుఁ, సాధూర్తవటులఁ
గినిసి తిట్టుచుఁ దనగృహమున కేఁగి

—.కాలకౌశికునికి పెండ్లామువలనం గలుగు పాట్లు.—

తలసాల నిలుచు న త్తఱి నెట్టుకొనుటఁ
బెలుచఁ దుమ్మిన, భీతిఁ బ్రిదులుచు నిలిచి,
చింతించు చున్నంత;—శిష్యుఁడు వచ్చి,
సంతసంబున నమస్కారంబు చేసి,
నడుఁకుచుఁ జేరి ముందఱ నున్న శిష్య
వడుగు నల్లప్పుడు వడిఁ దుమ్మినట్టి
యెండి పోయినవాలహీనవానరునిఁ
గుండగోళకునిఁ గర్కోటకుఁ డనెడి

తలసాలన్ = తలవాకిట. నడుఁకుచున్ = వడఁకుచు. వాలహీన = తోఁక లేని. కుండగోళకునిన్ = అయోగ్యుని (మగఁడుండఁగా జారునివలనఁ బుట్టినవాఁడు కుండుఁడు, విధవకు జారునివలనఁ బుట్టినవాఁడు గోళకుఁడు.)

* 'బంటుకుఁ జెయ్యిచ్చు' అని పూ. ము.

కుటిలజాతుని బందిపక్క నీక్షించి
'తటుకునఁ దుమ్మి పంతముఁ జెప్పు. మ'నిన;
దినము వారముఁ బ్రొద్దు దిక్కును గ్రహము
నొనర నెన్నిన రీతి నొకకొన్ని యెన్ని,
'కలుగు నిప్పుడు గృహకలహంబు మీకుఁ
దలపోసి చూడఁ దథ్యం' బన్నఁ గలఁగి,—
"తప్పదు నీ మాట, తార్కాణ మాపఁ,
జెప్పితి. ముని తుమ్ము చేకొన కేఁగి
నా కూర్మిపత్ని చే నడునెత్తి వగుల
గోఁకట నొకపెట్టు రూఢిగాఁ బడితి.
ముండకూఁతురు! కిన్క ముక్కునబంటి;
గుండె జల్లను నది కోపించెనేని.
పడఁతి గాదది నన్నుఁ బట్టి మర్దింపఁ
బుడమిఁ బుట్టిన పెనుభూతంబు గాని.
యీ యింతిఁ గొని వచ్చు టెఱిఁగిన నన్నుఁ
* బోయినప్పుడె తలపుచ్చెను మ్రింగఁ.
గావున నిప్పు డీ కమలాక్షి వార్త
నీవు ముందఱ నేఁగి నేర్పు సంధిల్ల,
'జననాథుఁ డొక్కఁ డీ సతి దార వోసె
నొనర నెజ్జల క'ని యొడఁబడ మొఱఁగి
నా వధూమణికి సంతసము పుట్టించి
వేవేగ నా లోని వెఱ పెల్ల మాన్పు."
ముని వేఁడుకొనుటయు నవ్వటుధూర్తు
మనసులో వేఱొక్క మతము చింతించి

* '...పుచ్చక'

‘ విరసంబు పుట్టించి వీనికి వీని
తరుణికి నొకమరి తలపట్లు చేసి
మొగములు వగులంగ మొత్తు లాడించి
నగుచుఁ జూచెదఁగాక నా కేమి?’ యనుచుఁ
గపట మేర్పడఁగ, ‘నాఁ గా’కని పోయి,
చపలాత్ముఁ డాయొజ్జసాని కి ట్లనియెఁ.—
“ జేరి నీ కొక మాటఁ జెప్ప వచ్చితిని;
నూరు గాచెద నన్ను, నుడువుదు నీకుఁ.
జెప్పిన నొజ్జలచేఁ జావు నిజము.
చెప్పకుండిన మాకుఁ జేటు నీచేత.
వెడల నాడిన దుర్వివేక మీమాట.
కడగి చెప్పినఁ గాని కడుపుబ్బు దిగదు.
నాలుక నువుగింజ నానదు నాకు.
జాలి నాతోడ నొజ్జలు సెప్పి యున్న
మాట నీ కెఱిఁగించి మదురుగో డైన
దాఁటి పోయెద. నింక దాఁపుర మేల?
‘ రూపింప వికృతంపు రూపు నీ రూపు
నా పత్ని కటుగాన నా కిటువీఁదఁ
గమనీయ రూపరేఖలు గల కాంత
నమర నొక్కతె వివాహంబు గావలయు.’
నని యొజ్జ లిటు క్రింద నాడువాక్యములు
వినిపింప నవి నీకు విరస మౌ నంచు.
నిజ మేఁడు సౌందర్య మెల్లను బ్రహ్మ
చిదిమి చక్కని రూపు సేసిన యట్టి

నీరూపు=నీవలె. వినిపింపను=చెప్పకుంటిని.

రావకూఁతును గొని రక్కస గా కుండ
దాఁచిన మీ మూల ధన మెల్లఁ బెట్టి
గోఁచికాఁడై, దానిఁ గొనుచు నేతెంచి
లాఁచి యున్నాఁడు నీ లా గొత్తి చూడ.
వాఁడె పో మనతలవాకిట నున్న
వాఁ." డన్న;—నది మోము వడి జేవురింపఁ,
గోపించి, పెటపెటఁ గొఱికి దంతములు,
వాపోవు చంకటివానిఁ బో వైచి,
'కటకటా! కాటికిఁ గాళ్లు సాఁచియును
కుటిలనంబుల జాడ విడువఁ డీ బడుగు!
కొండంగి, వీని వెన్కుఱుఁదల దఱుగ!
ముండగోష్టికిం ముక్కు మొగ మేడఁ దనకు?
* బిడ్డల కోసఁగక పెండ్లాన కిడక
వడ్డి కిచ్చుచుఁ జీమ వలెఁ గూడఁ బెట్టి
ధన మంతయును మిండతల కిచ్చె. వీనిఁ
గొని పోయి యెన్నఁడు కూలఁ గ్రమ్మెదరో!
బాపురే! యనుకోనఁ బని లేదు గాక,
రూపింప నాకంటె రూపసి కలదె?
యీ ప్రొద్దు వానిఁ గాయ్యెడ పిగఁ బట్టి
వీఁపుతో లంతయు విడిపించి యొకట
దక్కించి పోయిన ధన మెల్ల మగుడఁ
గ్రక్కింప కున్న నేఁ గలహాకంఠికనె?'
అనుచు రోఁకలిఁ గేల నమరించుచున్నఁ
గని రయంబున వెళ్లి కర్కోటకుండు,

లాఁచి=పొంచి. బడుగు=బక్క. కొండంగి=కొండముచ్చు.

* '...పెండ్లాను కిడక' అని యొక ను.

కడు సంభ్రమంబున, గాలకౌశికుని
యడుగులఁ బడి లేచి హస్తముల్ మొగిచి,
'విచ్చేయుఁ డింక మీ వెఱ పెల్లఁ బాపి
వచ్చితి' ననుడు; నవ్వటుధూర్తుఁ బొగడి,
లోని కేఁగెడు నంతలోఁ దల్పు మూసి,
పూని గొండ్లెముఁ బెట్టి, పోయె నా శిష్యుఁ.
డత్తఱిఁ జని కాంచె నా రాజు దేవి
చిత్తంబు జల్లనఁ జిడిముడి పడుచు,
మెదుక పట్టిన తల మెడ గండమాల
నుదుటి మీఁదటి సుడి నులిగొన్న బొమలు
బుజ్జ ముక్కును లొట్టపోయిన కన్ను
వెట్టిచూపును దెగి వ్రేలాడు చెవులు
మిడిపండ్లు చెక్కుటి మీఁది పుల్పిరియుఁ
బడి వ్రేలు చన్నులు బడబాకి నోరు
ఱోటు పోయిన చేయి ఱొమ్ము కంపరము
వాటుఁగాలును ఱోటివలె నున్న నడుము
బద్దపిక్కలు నంటు బలిసిన తొడలు
మొద్దుఁబాదంబులు ముడిఁగినవ్రేళ్లు
గఱుకునల్లని మేను గలిగి, దయ్యంబు
మఱపింపఁ దగు నుచ్చమల్లిచందమునఁ
గనుఁగొన రోఁతైన కాలకౌశికుని
వనిత హుమ్మను బందివాటులమాతఁ

చిడిముడి = తొట్రుపాటు. మెదుక=పిసక. ఱోటువోయిన= ఈచఁబోయిన. కంపరము = శవవాహనము. వాటుఁగాలు = ప్రక్కవాటుగా నడుచుకాలు. బద్దపిక్కలు=పలుచనిపిక్కలు. ఉచ్చమల్లి = దిస్సమొలది.

గని, దానిఁ గదియు బెగ్గల మంది వెఱచి
వెనుకకు జరుగు - సుగ్రీవవిభుదేవి —
సివ్వంగి లేడి వీక్షించుచందమునఁ
గ్రొవ్వునఁ జూచి, కర్కోటకు మాట
లన్నియు నిజముగా నాత్మ భావించి,
పన్నినకోపంబు బలిసి రెట్టింప,
బలి భిక్షులవారి బలువిడి మొత్తఁ
దలసాలఁ గట్టిన తన ప్రేలు దుడ్డు
వడిఁ గేలఁ గైకొని, వచ్చునజ్జఱభిఁ
గడఁగి వీక్షించి యక్కాలకౌశికుఁడు
గుండె భగాలను గొలఁది యై తనకుఁ
'బండె నెక్కడఁ జొరఁబాఱ నె? ట్ల'నుచు
వెడ వెడఁ దన కచ్చ వీడంగఁ బాఱి,
వడి మోము వగులఁ గవాటంబు దాఁక,
గడియతోఁ బెనఁగి దిగ్భ్రమఁ దత్తఱింపఁ,
'బాడువ, నీకెక్కడఁ బో వచ్చు' ననుచుఁ,
బెక్కుభంగుల మొత్తి వెట్టంగ, వెట్టి
కుక్క లోఁబడఁ బట్టి కొట్టిన రీతిఁ
'జేతు లొగ్గుచు మ్రొక్కెఁ జేకొను మ'నుచు
నాతురంబుగ వేఁడ నందంద మొత్తి,
వడి చెడి, దగ దొట్టి, వఱద లై చెమట
గదువ వగర్చు నక్కలహకంఠికను
గనుఁగొని తలపోసి కాలకౌశికుఁడు
'దినదినంబును మొత్త దీనిచేఁ జత్తు,

జఱభిక=దుష్టురాలిని. పండెక=పాపము పరిపక్వ మయినది.
పాడువ=దుర్జనుఁడా. దగదొట్టి=దప్పికలిగి.

హాహ హారా! యిటువలె నడలుట కన్న
మరణ మైనను నొక్క మా కైన లెస్స.
పంద నందఱు బాధపఱుతురు గాని
యెందు సాహసుని దిక్కెవ్వరుఁ బోరు.
పులి నడుగరు మేఁకపోతులఁ గాని,
బలహీనుఁ గాని చంపవు దయ్యములును;
దెంపు మీఱఁగ నాశ దెగఁ గోసి దీనిఁ
గొంప లోపల వెళ్లఁ గొట్టుదు.' ననుచుఁ,
గుదియొక కరతిత్తి గొని దాని వ్రేయ,
నది చెడిపోవను నందంద మోఁదె;
వడి దానితలఁ బట్టి వంచిన, విప్రు
నుడిసి గడ్డము పట్టి యూఁచె న వ్వెలఁది;
నఖముల వ్రచ్చె నన్నాతి నాద్విజుఁడు,
ముఖము ద్రిప్పఁగ నది ముక్కు వోఁ గఱచె.
వినుమక నీ రీతి విప్రదంపతులు
మసలి పోరఁగఁ, జంద్రమతి చేరి యనియెఁ;—
"దగువారు నిందింపఁ దమవారు రోయ
నగువారి సెఱుఁగక నయ మేది యిట్లు
మగఁడు నాలును నభిమానంబు విడిచి
మొగములు వగులంగ మొత్తు లా డుదురె!
పతితోడ సతి మాఱుపడె నేని పుణ్య
గతి కేఁగ కది నరకంబునఁ గూలు.
పతిభక్తిమహిమంబుఁ బ్రకటించు నట్టి
యితిహాస మొక్కటి యెఱిఁగింతు వినుమ.

కుదియుక = వెనుదివియక. నయము ఏది = నీతి యూలి.

అను వొంద శరిష్ఠ యనుపుణ్యవతికి
ననుఁగు సుహృత్స్నేహుఁ డనుపుణ్యపురుషుఁ
డతనిశిష్ఠవ్యాధి నరయంగ వలసి
యతని వీఁపున నిడి యర్ధరాత్రంబు
ఘనభూతబేతాళకలకలం బెసఁగఁ
* జను శ్రోవఁ గొర్తిపై శవము దాఁకఁగను,
† నొడలు వదలు నొప్పి నుగ్రుఁడై వాఁడు
కడఁగి కోపంబునఁ గాంత కిట్లనియె.—
'నినుఁ డుదయాద్రికి నేతెంచునటకు
వనిత, నీపతి తల వ్రయ్యలై పడును.'
అని శాప మిచ్చిన, నా పూవుఁబోఁడి
‡ దనపతి చావుకై తలపోసి పోసి,
'యిల జీవులకు నెల్ల నిదె వేగఁ బ్రొద్దు,
పాలు పేది నాపాలి ప్రొద్దస్తమించె;
భానుండు వొడమ నాపతి ప్రాణహాని.
యేను బతివ్రత నిలనైతి నేని
§ నానోము లిప్పుడు నాకు ఫలించు
భానుండు మింటను భాసిల్లకుండు.'
నన విని బ్రహ్మాదు లద్భుతం బంద
నొనరంగ దినవాథుఁ డుదయింప నోడె,
నిది దివ మిది రాత్రి యిది సంధ్య యనుటఁ
ద్రిదశులకైనను దెలియ రాకుండఁ;
దరుణిపతివ్రతాధర్మంబునకును
హరుఁడు ప్రసన్నుఁడై యతికృపామూర్తి

అనుఁగు=ప్రియుఁడు. అరయంగ=కుదుర్చుకొన.

* గొఱ్ఱుపై' † 'డై మండి' ‡ 'చావుకు' § ప్రక్షిప్తము.

'వరము వేఁడుము నీవు వనజాక్షి.' యన్నఁ,
గరములు మొగిచి యక్కల్యాణి పలికెః—
'సర్వేశ, వరము నీ శవమున కిమ్ము,
పార్వతీనాథ, నాపతిఁ గావు.' మ'నిన,
వామదేవుం డిచ్చె వరము లిద్దఱకు.
భామ ప్రార్థింపంగ భానుండు వొడమె.
గరకంఠు డరిగె నాకైలాసమునకుఁ
దరుణి పతివ్రతాధర్మ మీడేరెఁ.
బాయని భక్తిమైఁ బతిపాదసేవ
సేయుటఁ గాదె ప్రసిద్ధికి నెక్కె
రా యరుంధతియును నా యహల్యయును
నా యనసూయయు నఖిలలోకములఁ.
నేపరించుచుఁ బతి కెదురు భాషించు
పాపాత్మురా లూరఁబంది యై పుట్టు.''
నని పెక్కు భంగుల నా రాజదేవి
దను మోవ నాడిన ధర్మవాక్యములు
గనలెడుసూదులఁ గర్ణరంధ్రములఁ
జొనిపినయట్లైన సురసుర ప్రుక్కి,
కండక్రొవ్వునఁ గాలకౌశికుమీఁద
మండు కోపము చంద్రమతిమీఁద విరిసి,
'పాడిఁ జెప్పఁగ నిన్నుఁ బనివడి యిచటి
కేడ ముక్కిఁడి తెచ్చె? నీఁక నింత నుండి

వామదేవుఁడు=శివుఁడు. గరకంఠుఁడు=విషకంఠుఁడు-శివుఁడు. ఏపరించుచుఁ=దుఃఖపఱుచుచు. మోవఁగ=తాకునట్లు. కనలెడు=మండుచున్న. పాడి=ధర్మము. ముక్కిఁడి=ఈముక్కులేని కాల కౌశికుఁడు.

బాడిగ నీ కిచ్చి పతిభక్తి సేయు
జాడ లన్నియు నీదుసంగడి నేర్చి,
నీవు వంకలు దీర్ప నీ పంపుపనులు
గావించు చుండెదఁ గాక! వేగిరమె
న న్నెఱింగదు గాక! నా పేరు తెలియు
* పిన్న మిత్తికి నైన వెరవేఁకి వచ్చుఁ.
గదలి నే రోఁకలి గైకొన్న నవలఁ
గదలుదు రీ వాడ గరిత లందఱును.
నాపొడ గాంచిన నగరంబు వడఁకు.
నీపోటువాటుల నిపు డిట్లు మమ్ముఁ
బోరించితివి, జంత్రబొమ్మ! నా యక్క!
నీరఁ జి చ్చెగయింప నేర్చినతల్లి!
యెచ్చట నుండి నీ విటు దాఁపురముగ
వచ్చితి చొచ్చితి వాస మీ.' ననుచు,
నోడక కరులు బి ట్టొడిసి రాఁ దిగిచి
† మూడి వోఁ దాటించి, మూతులు నులిమి,
యెగ్గులుఁ దప్పులు నెన్ని, యీ రీతి
పగ్గెల నిచ్చలు బాములఁ బెట్టి,
యిడుమలఁ గుదియించి, యించుక సేపు

బాడుగ = జీతము. వెరవేఁకి = విపరీతజ్వరము. గరితలు = స్త్రీలు. ఏడన్ = ఎక్కడనుండి. పోటు వాటులన్ = కొట్టుట చేత పడుటచేత. జంత్రబొమ్మ = యంత్రపుబొమ్మ. వాసము = ఇల్లు. మూడి వోఁ దాటించి = పృష్ఠము విఱుగు నట్లుగా కొట్టి. ఎగ్గులు = దోషములు. పగ్గెలన్ = ప్రజ్ఞలచేత. నిచ్చలు=సదా. బాములన్ = బాధలను.

---

‘...మృత్యువు కైన’ ‘వోఁధాఁకించి’

ఎడపక పనులు సేయించుచు నుండె.

—చంద్రమతి వెలధనమును నక్షత్రకుఁ డపహరించుట.—

నట హరిశ్చంద్రుండు నప్పు డారీతిఁ
గటిలకుంతల నమ్మి కొన్న ధనంబు
వ్యయము గాకుండ సర్వంబును ముడిచి
నయ మొప్ప నిచ్చిన నక్షత్రకుండు
వేడుకఁ గైకొని విభుని వేవేల
జాడల దీవించి సమ్మతిఁ బలికె; —
'గురుఁడు పుత్తేరంగఁ గోరి నీ వెంటఁ
దిరుగుచుఁ దరు వున్న దినముల కెల్లఁ
జెల్లింపఁ గల బత్తె సెలవుగా నీవు
చెల్లించితివి, నాకుఁ జెల్లె ధనంబు.
మితితోడ నొసఁగుము మేకొన్న గాధి
సుతుని ఋణం బెల్లఁ; జొప్పడఁ దీర్చి
పొమ్మన్న దీవించి పోవు, నీతోడ
దొమ్ములు రేఁపక, దొసఁ గెల్ల నుడిగి.'
యనుటయుఁ దల యూఁచి యమ్మహీవిభుఁడు
తనలోన నవ్వి, యాతని కిట్టు లనియెఁ.—
'బగ గొని కృప మాలి బందెలు వెనఁచి
తగునె నాచేతి విత్తము రిత్త గొనఁగఁ?
దలఁక నా మీఁదఁ దరు వుండ నిన్నుఁ
దటిమి పుత్తెంచు నత్తటి భవద్గురుఁడు
సత్తుగా నీకు నిచ్చలును రొక్కించి
బత్తె మిమ్మని నన్నుఁ బలుకఁ. డొండేని

ఎడపక = విరామ మీయక. మేకొన్న = ఒప్పుకొన్న.
దొమ్ములు=జగడములు. రొక్కించి=రొక్కముచేసి.

నీకు నే నొడఁబడ. నేఁ డీసనంబు
చేకూరఁ గైకొని, చిక్కులు వెట్టి,
తప్పు నాడెద వసత్యంబున కోర్చి.
చెప్పు నే మున్నది! శివుఁ డొక్కఁ డెఱుఁగు!'
నావుఁ డిట్లని పల్కె నక్షత్రకుండు:—
'భూవర, నీ వెంటఁ బుత్తెంచు నపుడు
నీచేత బత్తెంబు నిచ్చలుఁ గొనఁగ
నా చెవిలోఁ జెప్పినాఁడు మద్గురుఁడు.
నీ వొడఁబడ నేల? నిను వేఁడ నేల?
నీవు లే దన నేల? నినుఁ బ్రభాతమున
దీవింప వచ్చిన దీనవిప్రుఁడనె?
చావ నొవ్వఁగఁ బూని సాహసం బొదవ
నొడపక గిరు లెక్కి, యేఱులు దాఁటి,
కడు భయంకర మహాగహనముల్ గడచి,
కాలు గాలినపిల్లి కరణి నీ వెంట
నేల నీబంట నై యెల్లందుఁ దిరిగి,
వారక హిమవర్ష వాతాతపముల
నూరూరిగుడిపంచ నొదిఁగి నిద్రించి,
తిరిసినపలుగూడు దెచ్చి నిచ్చలును
వరుస నొక్కొకకడి వనరుచుఁ గుడిచి,
చదువును సంధ్యయు జపమును వేల్మి
మొదలు ముట్టఁగఁ బోయి, మోట నై, బడలి,
చిడుము గోఁకుచు, జరఁ జిక్కిన ట్లుండి,

ఏలన్ = నీవు ఏలుటకై. తిరిసిన పలు గూడు = బిచ్చమెత్తి తెచ్చిన పెక్కువిధముల యన్నము. వనరుచున్ = దుఃఖించుచు. వేల్మి = హోమము. జరన్ = ముసలితనముచే.

కడపట బత్తెంబు గానకే తేర
నడుమఁ జావఁగ నీవు నా తలపుండ్లు
గడిగి రక్షించెదో? కఱవుకాలమున
నుఱిసినపుండ్లపై నుప్పును జల్లి
కెరలఁ జేసెదవు. నేఁ గినిసితి నేని
చక్కఁ బెట్టఁగ లేరు. సాదు లేఁగినను
బొక్కి నిల్వఁడు తలపొలమునఁ గాని.
మే లెఱింగెద వని మితి వచ్చు దాఁక
నాలిని నిన్నుఁ గాపాడితిఁ గాక.
తఱలి పోవఁగ నీక ధర గితె గీఁచి
మొఱలు వెట్టఁగఁ గట్టి ముప్పేతఁ బెట్టి
గుదిగుది గావించి కూరాకు సేసి
యదలించి నిను మేఁకయాఱుపుఁ గూయింపఁ
జనుఁ. దప్పె నది. నేఁడు సర్వథా నిన్ను
వెనుకముందటి పగ వెడల మగల్తు.
మఱవకు మిప్పటిమాటల నెల్ల.
నెఱిఁగెడు శివుఁడు; నా కేటికి బాస?'
అనిన హరిశ్చంద్రుఁ డా వటు ధూర్తుఁ
గనుఁగొని కోపంబు గదుర ని ట్లనియె.—
'గురుకార్య మొనరింపఁ గోరి నా వెంట
నరుదెంచి తిరిగితి; వది నాకు నెలవె?
పరదేశులకు గుళ్లపంచలు గాక,
యిర వైనసున్నపుటిం డ్లేడఁ గలుగుఁ?

తేర = వృథా. ఉరిసిన = పగిలిన. సాదు = సాధు వైన గోమహిష్యాదికము. పొక్కి = ఉలికి. తలపొలమునన్ = పొలిమేర దగ్గఱిచేనిలో. మితి = గడువు. గుదిగుది=గుత్తిగుత్తి. బాస=ఒట్టు.

బలుగూడు గాక యేపట్టున నైనఁ
గలదె పాయసము 'భిక్షాం దేహి' యనిన?
నెవ్వఁగఁ గుందుచు నీరసాన్నములఁ
గ్రొవ్వి బల్తురె గువ్వకుత్తుక పడక?
నివి యెల్లఁ దప్పులు నెగ్గులుఁ జేసి
తివిరి రేఁగెద నన్నుఁ దెలుప నా వశమె?
తీపారు చక్కెర దిన్న యా నోర
వేఁపాకు మేసిన విధమున నీవు
చేసి నంతయుం మేలు సేసి మఱేల
చేసితి విట్టికుచ్చిత? మింక నైనఁ
గ్రదుకనగోలు గైకొనక నా ధనము
వదలుము; మున్ను విశ్వామిత్రు ఋణము
మితితోడఁ జెల్లించి మీఁద నె ట్లయిన
ధృతిఁ దీర్తు నీ బత్తె దినముల లెక్క.'
నావుడు;—విని నవ్వి నక్షత్రకుండు—
'భూవర నీకంటె బుద్ధిమంతుఁడను.
దొడిఁబడ, జేతికి దొరకినధనము
విడిచి మీఁదటఁ గొనువెంగలి గలఁడె?
చదువు మీఁదిది దెబ్బ సంగతి గాఁగఁ
బిదప నొప్పునె? మఱి పెక్కు లేమిటికి?
విడువు మింతటనుండి విత్తంబుమీఁది
యడియాస. పైఁడికిఁ బ్రాణముల్ లంకె.
విడుతుఁ బ్రాణము లైన, విడువ ధనంబు;
మెడ మెండుకొని త్రెంపుమీ చేతిహేతిఁ;

గువ్వకుత్తుక==గువ్వస్వరమువంటి స్వరము—హీనస్వరము. కదుకనగోలు=వంచనగా. మెండుకొని=విజృంభించి.

దల ద్రెవ్వ మొత్తి యీధనముఁ గైకొనుము.
వెలయంగ నా చావు వెదకఁ గౌశికుఁడు.'
అనిన;—వీనులు మూసి 'హరహరా!' యనుచు,
జననాథుఁ డాత్మలో సంతాప మంది,
*' కడుబంద ధూర్త నక్షత్రకు నూరు
దోడుకట పాపంబు; దుర్మార్గుఁ డితఁడు.
బల్లిదుచేతిలోఁ బడినధనంబు
పిల్లి కట్టిన దొబ్బ ప్రిదులక పోయె.
బొంకు గాకుండ నా పూనినమితికి
నింకఁ గౌశికుఋణ మేమిటఁ దీర్తు?'
నని మదిఁ దలపోయు; నా మహారాజుఁ
గనుఁగొని కినిసి నక్షత్రకుం డనియె.—
' నూరక నివ్వెఱఁ గొంది యిట్లున్న,
నేరీతి మా ధనం బిటుమీఁద వచ్చుఁ?
జెచ్చెర నొకత్రోవ చేసి, మ మ్మనిపి
పుచ్చినఁ, బోదు మీపోరాట ముడిగి.
వడి నారఁ గైకొన వచ్చుఁ జటాళిఁ,
బడయంగ వచ్చును భస్మఁ దైలంబు,
నిసుక వంటకముగా నివిరింప వచ్చు,
రసము సేయఁగ వచ్చు రాలు గరంగి;
రాదు నీ మనసు మార్దవము నొందింప.
మేదినీనాథ, యీ మేలంబు లేల?

త్రోడుకట=కదలించుట. దొబ్బ=మాంసఖండము. ప్రిదులక=ఊడిరాక. నివ్వెఱఁగు=పారవశ్యము. ఇవిరింపఁ=ఇగురుగావండుటకు. రసము = ద్రవము. మేలంబులు=పరిహాసములు.

* 'కడుఁబడ్డ'

తే లెమ్ము ధనము చెల్లింపు నీ.' వనిన;—
భూలోకనాథుఁ డప్పుడు విచారించి,
నక్షత్రకునిఁ జూచి, 'నాదుర్గుణములు
లక్షలు; వానిఁ బల్కఁగ నెన్న నేల?
నాలిని బుత్త్రుని నంగడిఁ బెట్టి,
కాలకౌశికుఁ డనుకష్టున కమ్మి,
కూర్చిన ధన మెల్లఁ గుదుకనగోలు
నేర్పునఁ గైకొంటి; నీకు సిద్ధించె.
* మునిశిఖామణితోడ మునిఁకిన మితికి
ధనముఁ జెల్లించు చందము దెందమునకుఁ
దలపోసి చూచితిఁ; దక్కొండు గాన
నలవడ; దటు గాన నాలస్య ముడిగి,
† నా మీఁద నచ్చుధనం బెల్ల నీకు
నే మానవుం డిచ్చు నీ మతిలోన
నతనికి బంటుగా నమ్ముకో నన్ను,
మతిలోన నల దనుమానింప.' ననిన;—

—నక్షత్రకుండు హరిశ్చంద్రుని నమ్మఁ జూపుట.—

నావటుధూర్తుఁడు నట్లకా కనుచు
వావిరి నా రాజువలపలికేలు
తన పుస్తకపుఁ ద్రాటఁ దగ ముడి వేసి,
చను మంచు నటు కొని చని పురిలోనఁ,
బొడగన్న వా రెల్లఁ బురపురఁ బొక్క
నడరి పే రెత్తి యిట్లని యమ్మ దొడఁగె.—
' జనులార, వసుధలో సన్నుతి కెక్క

అచ్చు = నే నచ్చియున్న.

* 'మొలఁగిన మితికి' † 'న చ్చుధనం బెల్ల'

వనజాత బాంధవ వంశ వర్ధనుని
సార వర్తను హరిశ్చంద్ర నరేంద్రుఁ
గోరిన ధన మిచ్చి కొనరయ్య మీరు.
అరుదుగా బొందితో నమరేంద్రపురికి
జరిగిన యట్టి త్రిశంకు భూపాలు
కూరిమి పుత్త్రు సద్గుణ విభూషణునిఁ
గోరిన ధన మిచ్చి కొనరయ్య మీరు.
త్రిజగంబులను మేటి దీవుల నెల్ల
నిజ జయ స్తంభముల్ నిలిపి యవక్ర
భూరి పరాక్రమంబున నొప్పు రాజుఁ
గోరిన ధన మిచ్చి కొనరయ్య మీరు.
కలరాజ్య మెల్ల నా కౌశికమునికి
నిల యెల్ల నెఱుఁగంగ 'నిచ్చితి' ననుచు
ధార వోసిన మహా దాన వినోదిఁ
గోరిన ధన మిచ్చి కొనరయ్య మీరు.
వేతాళుతలఁ ద్రెవ్వ వ్రేసి సన్మునుల
భీతి నివారించి పేర్చిన యట్టి
వీరశేఖరు జగద్విఖ్యాత చరితుఁ
గోరిన ధన మిచ్చి కొనరయ్య మీరు.'

—వీరబాహుఁడు హరిశ్చంద్రుఁ బంటుగాఁ గొనుట.—

అని వాడవాడల నమ్ము నత్తఱిని
బెను పొందు పేరును బెంపును జెప్పి
యవనీశు మునిపుత్త్రుఁ డమ్ము వాక్యములు
చెవుల సోఁకుటయు నచ్చెరు వంది చెలఁగి;—
పొదలు పాపంబులు వోఁ దోలి ముక్తిఁ

వనజాతబాంధవ=సూర్య. చెలఁగి-కర్త వీరబాహుఁడు. పొదలు=వర్ధిల్లిన.

గదియించు మణికర్ణికాసమీపమున,
మత మారఁ దన తపోమహిమఁ గాశికుఁడు
పితృవనం బొకటి గల్పించి, యా మున్నె
యురుశక్తి వీరబాహుని పేర జమునిఁ
బనఁగిన చండాలపతిగా సృజింపఁ-
గుఱు వెంట్రుకలఁ గోరకొప్పిడి, కావి
యఱువుడు తల నిట్టు నట్టును జుట్టి,
జేగురుబొట్టిడి, చెవి సంకుఁగొడుపు
లాగుగా వ్రేలఁ దెల్లని ముద్దు నిల్పి,
తోలులు వోయిన ప్రాంతతోలునఁ గప్పి,
బలుగత్తి మొల నచ్చుపడ నమరించి,
కసుమైలపేలికఁ గాసించి, నడుము
బడికి వేసిన యరపట్టె బిగించి,
యెడమచేఁ బఱుమాంస మేర్చిన గుదియఁ
గడమచే నినుప యుంగరముల గుదియఁ
గడజాతిగాఁ బూని, క్రందుసందడిని
జడియింప సంబళి సంబళి యనుచు,
దళముగా మెఱసెడి తన మేని కప్పు
* పొలసుకై జుమ్మని పొలయు మక్షికలఁ

పితృవనము=వల్లకాఁడు. జమునిన్=యమధర్మరాజును. కుఱు=కుఱుచ. కోరకొప్పు=ప్రక్కకొప్పు. కావి యఱువుడు=కావివస్త్ర చింపి గుడ్డను. సంకుఁ గొడుపు లాగుగాన్ = శంఖపుఁ గొప్పు వలె. ముద్దు=ఎముకను. కాసించి=కాసెగాఁ గట్టుకొని. ఏర్చిన=గ్రుచ్చిన. క్రందుసందడిన్=తఱచయిన జనసమూహమును. జడియింపన్=తొలఁగించుటకు. సంబళి=తొలఁగుఁడు. మక్షికలన్=ఈఁగలను.

* 'పొలసుకు'

గుంచియతోఁ జోఁపు కొనుచుఁ, బెన్నులుపు
మించి కండెన నూనె మేఁగిన ట్లున్న
మొగమునఁ జీఁకట్లు ముడివడఁ, గల్లు
సగము ద్రావినకుండఁ జంకట నిఱికి,
మీఱిన మదమున మెయి దేలగిల్లఁ
బాఱంగ, వెడపాటఁ బాడుచు, బరులు
జాఱుచు, నల్ల పచ్చనిపాడి మ్రింగి
కోరమీసము నుల్చి, గ్రుడ్లెఱ్ఱ చేసి,
కలనివాగల బూతు గేరలఁ దిట్టుచును,
‘ దొలఁగు! రా కెవ్వఁడు? దొర యెవ్వఁ?’ డనుచుఁ,
ద్రాగిన రోఁజు మత్తా గొని, యిన్ని
లాగుల నల్లనల్లన నృపుఁ గదిసి,
గొరువ రాక బిట్టోకిలిం తొడఁవ
నూర మద్యపుఁ గంపు నూల్కొనఁ బలికె.
‘ ఓరి, నా మంచిన యుండిగ మే మైనఁ
గోరి సేయుచు నొఱగొడ్డెంబు లేక
కొలిచెదవని యీ గోఁచిబాఁపనికి
వలసినధన మంతకట్టును నిచ్చి,
బంటుగా నేలుదుఁ బరఁగ నీ. న్న'నినఁ;—
గంటకం బొదవ భూకాంతుఁ డి ట్లనియె.—
‘ ఓరి చండాలుఁడ, యూర కుండెదవొ?
నోర ద్రెయఁగ వలెనో పండ్లు డుల్ల?

మేఁగిన=పూసిన. నల్ల పచ్చని పాడి = గంజాయి పొడుము. రోఁజు=నిట్టూర్పు. మత్తా=కైపు. లాగులన్=విధముల. నూల్కొనన్=వ్యాపింపఁగా. ఉడిగము=పని. ఒఱగొడ్డెము=అప్రియపు వంకరమాట. కంటకము=చిత్తాయాసము. నోరన్=నోటిమీఁద.

సుడుగక కల్లు గ్రొల్లుఱుకంగఁ ద్రావి,
యొడ లెఱుంగక ప్రేలె దూరక నీవు.
కులహీనుఁడవు భానుకులజుని నన్ను
* పిలిచి, యేలెద నంటి, వెఱ పింత లేక!
† కట్టిన దోకబట్ట క ప్పాక తోలు
చుట్టిన దోకచింపి సొమ్మెల్ల నినుము;
కక్కు వచ్చెడి నిన్నుఁ గనుఁగొన; నకట!
పక్కు సేయని లేకివాఁడవు నీవు?
నే నేడ! నీ వేడ! నెమ్మిఁ గౌశికుని
కే నచ్చుధన మేడ! నీ లాగు మెట్టు
మెట్టునఁ దఱిమిన మెఱమెదు కోప
మెట్టు పుట్టును, విన్న నెవ్వారి కైన?'
నావుడు;—వాఁడును 'నా మీఁద నలుగ
దేవతలకు నైనఁ దీగ దెల్లందుఁ,
దప్పు లెల్లను దండధరుఁడ నై వెదకి
చప్పుడు గాకుండ జనుల దండింతు.
మాటలఁ బని యేల మాకును నీకు?
మాటి మాటికి నన్ను మాలవాఁ డంచు
నీకు రోయఁగ నేల? నీతండ్రి కులము
నాకులంబును నొక్కనాణె మై యుండు.
నిప్పు డే నె ట్లుంటి నేమి? కౌశికుని

పిలిచి = కొని. లేకి = పటిగ. దండధరుఁడను = తలారిని గాన దండించువాఁడ ననుట - (యముఁడ ననియు.) ఒక్కనాణె మై = సమానోత్కృష్టకలవై - హరిశ్చంద్రుతండ్రి వసిష్ఠ శాపమున చండాలుఁ డాయెను-(నేను సూర్యపుత్త్రుఁడను నీవు సూర్యకులజుఁడవు అనియు.)

---

* 'బిలిచి' † 'కప్పింది తోలు'

యు ప్పెట్లు దీర్చెద? వపుఁ గాదొ? చూడు.
తులువ, నీ మది నింత దురభిమానంబు
గలవాఁడ, వీ ముంజి గానిచే నిట్లు
దొసఁగులఁ బడి చిక్కి దొంగ చందమున
వెస కట్టు వడి, నీవ వృత్తి రా నేల?
కినిసి నీతోడఁ దర్కింప నేమిటికి?
ధనముఁ బెట్టిన నెందు దాసులు లేరొ?'
అని హరిశ్చంద్రుండు నాయంత్యజుండుఁ
గనలి తర్కింప నక్షత్రకుం డనియె.—
"నలినాప్త కులనాథ, నాతోడ నీవు
పలికిన మాటల పద్ధతి దప్పె.
* 'మునినాథుతో మున్ను మునికిన మిలికి
ధన మిచ్చువానికి దాసునిఁ గాఁగఁ
గొనిపోయి న న్నమ్ముకొ.' మ్మంటి గాని
'వినుత సత్కులజుని వెదకి యిమ్మనవు.
వీని కులం బేల? వీని రూ పేల?
వీని గుణం బేల? వీని పెం పేల?
మా లైన నేమి? బ్రాహ్మణుఁ డైన నేమి?
తోలు గప్పిన నేమి? తులు వైన నేమి?
గంజాయి దినె నేమి? కలు ద్రావె నేమి?
నంజక ధన మిచ్చునతఁడె నా మెచ్చు.
ప ల్లెత్తి యెలుకలఁ బట్టి నోపినను,
పిల్లి శాస్త్రమె? మంటిపిల్లి యే చాలుఁ.
'గోరిన ధన మిచ్చి కొన రం డటంచు

ముంజిగాఁడు=వటువు. అంజక=వెనుదివియక. మునికిన=పలికిన.

* 'మునిపిన మిలికి'

నూరక మొఱ్ఱ వెట్టుచుండ నాపాలె?
వారక నినుఁ గొన వచ్చిన వారి
తోఁ రాయిడించి పోఁ దోల నీ పాలె?
మలఁకలు మాని యీ మాలని నేలి
కలధన మిప్పింపఁ గలవా? కాదేని
నెక్కు మాటలు గట్టి పెట్టి, సత్యంబు
దక్కి, 'బొంకితి.' నని తలఁగి పోయెదవా?
బలువున నినుఁ ద్రాటఁ బట్టి పట్టెదము
కలయఁ ద్రిమ్మర నాకుఁ గారణం బేమి?
విను నాప్రతిజ్ఞ;—నీ విత్త మింతటికి
నినుమడి పెట్టిన నింక నొండొకని
కేగతి నిను నమ్మ, నితనికే కాని,
శ్రీగురు నాన, కాశీనాథు నాన."
యని రాజు మునిపుత్త్రుఁ డాడువాక్యముల
విని యంత్యజుఁడు మోము వికసింపఁ బలికెఁ.—
'బరిణమించితి నిన్ను బాఁపన వడుగ;
తిరుగక యీమాట తిరముగా నిలుపు.
వక్క సేయని లేకివాఁ డని నన్ను
లెక్క సేయక కరాళించె నీ రాజు.
వాటమై యీమాట వడి నమ్ము వోలె
నాటి యున్నది నేఁడు నా మనంబునను.
గొంటక యీయప్పు గొంటి యీ తులువ
బంటుగా నేలక పాయదు కోప.

రాయిడించి=జగడించి. మలఁకలు=చిక్కులు. ఏలి=కొల్చి(?) అంత్యజుఁడు=మాల. కరాళించెక్ = నిందించెను. అమ్ము = బాణము. గొంటక=వెనుదివియక. గొంటి=నెట్టి.

మప్పు ధనం బింత యని గుఱి నాకుఁ
జెప్పుము చెల్లింతుఁ జేకొను.' మనిన;—
నలరి నక్షత్రకుఁ డతనితోఁ దెలియఁ
బలికెః—'నీ భూపాలుపై తరుపనెడి
చేతిసంకెల వీడఁ జేసిన వేని,
దాతవు నాపాలి ధర్మదేవతవు;
వేడుకజట్టి గావించి నా పూన్కి-
వీడ నాడకు; మాకు విత్త మింత నిన,
లోఁగి, యీఁతకుఁ గానిలోఁ తని, జట్టి
వీఁగక, సర్వథా విడియెద వేని,
పురుషుఁ డేనుఁగు నెక్కి- పొడవుగా నిక్కి-
నగరత్న మెగసిపో నైచినపొడవు
ధనరాశి మా కిమ్ము; తడయక లెమ్ము!
పిను నిక్క మిది సుమ్ము, వీఁడు నీ సొమ్ము;
గాను.' మన్న వాఁడు నిక్కుచుఁ బల్కెః—"నీకు
ధనరాశి యిచ్చోటఁ దఱలక యిత్తు.
నొక విచారము మాకు నొదవె. నీ రాజు
సుకవాసి, పనిపంద, చూపుగుజ్జంబు,
మామిడి క్రింది సోమరి, మేదకుండు,
బూమె తుంటరి, యెనుపోతుపై వాన,
మొుండరి, చల్ల చప్పుడు, గోడచేర్పు,
చండిపో, తనుసట్టిజాడ నున్నాఁడు.

గుఱి=మితి. వేడుకజట్టి=తమాషా బేరము. వీఁగక=విడువక. తఱలక=అవలికిపోక. మామిడిక్రిందిసోమరి=మామిడిచెట్టుక్రింద 'ఆ పండు తనంతట రాలి నానోటఁ బడునా.' అని ఆసించి పడియుండు సోమరి. బూమెతుంటరి=పేసాలమారి మొండరి=మొండివాఁడు. చల్లచప్పుడు=జడుఁడు.

చెప్పినపని బాగు సేసిన వేళ,
ముప్పిరి గొను కోపమున మొఱ వెట్ట
దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁది
జడ్డు వాపినఁ, 'గొల్వు చాలు నా క'నుచుఁ
దక్కి పోయిన, వెంటఁ దగుల నా వశమె?
యుక్కునఁ బెనఁచిన ట్లున్నాఁడు వీఁడు.
గొలుసు దప్పినయట్టి కోఁతి చందమునఁ
గలధన మీవు లెక్కము గొని పోదు.
విల్లాలు పుత్త్రిలు హితులు బంధువులుఁ
దల్లిదండ్రులు నన్నదమ్ములుఁ గలుగ
వాని సొమ్మని నమ్మ వచ్చు గా; కిట్టి
వాని సేగతి నమ్మ వచ్చు నా? క''నిన;—
నక్షత్రకుండు భూనాయకుఁ జూచి
దక్షతఁ జండాలుఁ దగ నొడంబఱిచి
" పూఁటపూఁటకు జరుపుకు వచ్చి చనక,
'పూఁటకాఁపవె నీవు పొమ్మ'ని యనక
మిలి వోక మున్నె నీ మీఁదిధనంబు
మతమునఁ జెల్లింపు మా కిప్పు. డ'' నుచు,
బోధించి ప్రక్కలు వొడుచు నవ్వడుగు
బాధకు నలసి, భూపతి మదిలోన
'సొడపక ధనముఁ బ్రోవిడి నేఁటితోడఁ
గడతుఁ గౌశికు మాయఘుట్టి మే'ననుచు,
వీరబాహుని జూచి విను మని పలికె.—
'నీరీతి నపనమ్మి కేల నా మీఁదఁ?

కంతులు=కణుతులు. జడ్డు=జడత్వమును. తక్కికొని=దూసికొని. దక్షత=నేర్పుమెయి. పూఁటకాఁపవె=నీవు నాకైపూనుకొన్న వాఁడవా.

జాల నీతని కుల్కి సత్యంబుకొఱకు
నూలిపోఁగునఁ జిక్కి నుసల కున్నాఁడఁ.
దల్లి సత్యము నాకుఁ, దండ్రి సుజ్ఞాన,
మెల్లెడ సోదరుఁ డెసఁగు ధర్మంబు,
చెలువార ధైర్యంబు చెలికాఁడు, శాంతి
కులసతి, వినయంబు కొడుకు చర్చింప.
నే సత్యమునకుఁగా నిప్పుడు నీకు
దాసుఁడ నై జట్టి దక్కుచున్నాఁడ.
నట్టి సత్యంబు నేఁ డగు నాకుఁ బూఁట.
గట్టిగాఁ జేపట్టి కలఁక పో విడువు.
నీయాజ్ఞఁ దల మోచి నీ కనుసన్నఁ
బాయక నీపంపుపను లాడఁ గూర్తు.
నలఁగక నా చేయు నంతకాలంబు
నలసిన, సొలసిన, నటు నిటుఁ జరిన,
మఱచిన, వెఱచిన, మఱి నీ ధనంబుఁ
జెఱచినఁ, బఱచినఁ, జేయఁ లే ననిన,
విసికినఁ, గసికిన, వెడనిద్ర నొంది
నుసలిన, మసలిన, నొప్పిఁ జెప్పినను,
మెఱుఁగులు గ్రమ్ము నా మేటి ఖడ్గమునఁ
దఱిఁగి రక్తము గాఱఁ దన తల ద్రెంచి
నీ పాదములమీఁద నిలుపుదు. నిదియొ
నా పూని.క' నిన;— నంతట సమ్మతించి,
వీరబాహుఁడు తనవెంట నేతెంచు

నుసలక = చలింపక. పూఁట = పూఁటకాఁపు. అలఁగక = వెను దివియక. పఱచినన్ = పాఱిపోయిన. కసికినన్ = కర్ణకఠోరముగాఁ బల్కిన. మసలినన్ = ఆలస్యముచేసిన. తన = నా.

ఘోరమూర్తుల నతిక్రూరవర్తనులఁ
దన కింకరులఁ బంపి, ధనముఁ దెప్పించి,
ఘనతరపర్వతాకారంబు గాను
బెనురాసి వోయించి, ప్రియము రెట్టింప
మునికుమారున కిచ్చి, మ్రొక్కి పొమ్మనిన;—
నక్షత్రకుండు నానందంబు నొంది
లక్షభంగుల నృపాలకుని దీవించి,
'యుర్వీశ, యాస నీ వొడఁబడ్డధనము
సర్వంబుఁ జెల్లె నీశ్వరసాక్షి గాను.
విచ్చేయు మిఁక.' నని, వీరబాహునకుఁ
జెచ్చెర నప్పన సేసెఁ జేసేఁత.
దివినుండి కనుఁగొని దివిజులు మెచ్చి,
యవనీతలేశున కాఁకలి దప్పు
లాదవ కుండఁగ వరం బొసఁగి రావేళ.

— హరిశ్చంద్రుఁడు వీరబాహుం గొలుచుట. —

సదయుఁడై యంతటఁ జన నంత్యజుండు
ముద మారఁ దనగృహంబునకుఁ బోవ నటు
గదలి, సగర్వంబుగాఁ దనచేతఁ
బట్టిన పశుమాంస భారంబుఁ జంకఁ
బెట్టిన మద్యంపు బిందియ నిచ్చి,
'కాని రమ్ము నీ' వన్నఁ;— గువలయేశ్వరుఁడు
వినయసంభ్రమములు వెలయ వహించి,
* యే సిడిముడిపాటు నే వికారంబు

చనన్ = ఒప్పుగా. చిడిముడిపాటు = తొట్రుపాటు.

* 'పసిడిముడి' ఇది శ్రీకాళహస్తి మాహాత్మ్యములో 'పాకు సిక్కి పుట్టంబులు' అను ప్రయోగము వంటిది.

నే సిగ్గు రోఁతయు నెసఁగక, వానిఁ
గాలిచి సంగడిఁ జనుగోసంగిబంట్లఁ
గలసి, తా నటు చని, కలయ నెల్లెడలఁ
బడి యున్న ముడుసులు, పసరంపుఁ దలలు,
బడికి వేయఁగ నెండఁ బఱచినతోళ్లుఁ,
గఱచి కుక్కలు పీఁకఁగాఁ బెనుఁగొమ్ము
లూడఁగఁ దీసిన రీతి నున్న డొక్కలును,
* వఱద లై నెత్తురు వడియఁ గుత్తుకలు
తఱిగిన గోవులుఁ, దఱ చైన పచ్చి
† మురియలుఁ, జెదరిన మఱికి నంజుళ్లు,
నఱచు కాకులుఁ, గల యా మాలవాడ
వడిఁ జొచ్చి, ప్రేవులు వాతి కే తేర
‡ నడరు దుర్గంధాన కణుమాత్ర మైనఁ
గింకిరపడక, శంకింపక, ధైర్య
మింకక, చండాలునింటికి నేఁగి,—
యడరంగ భూపాలుఁ డామాల దన్నుఁ
గడఁగి పంపుచు నున్న కష్టంపుఁబనులు
నెలకొని నిముసంబు నిలిపినకాలు
§ నిలుపక సొలయక నిద్దుర వోక
కలఁగక నన్నాదికములపై నాస

గోసంగి=మాల. బడికి వేయఁగన్ = ఊనుటకు - మురియలు= ఖండములు. నంజుళ్లు=మాంసములు. ప్రేవులు వాతి కే తేరన్=రోఁతచే కడుపులోని ప్రేవులు నోటిలోనికి వచ్చునట్లుగా. కింకిర=రోఁత.

* 'వడియు కుత్తుకలు' † 'మురియలు' రేఫసందేహము. ‡ 'దుర్గంధంబు కణు'
§ 'సొలవక' - ఈధాతువు మృగ్యము.

గాలుపక వ్యపగతక్షుత్తృష్ణుఁ డగుచు
మొగము స్రుక్కింపక ముడుఁగక రేయుఁ
బగ లన కమ్మహీపాలుఁ డొనర్పఁ;—
నెరసులుఁ దప్పులు నెమకుచు, నొక్క-
విరవు చిత్తంబున వెదకి, ‘సత్యంబు
తెరలంగ వీని ప్రతిజ్ఞఁ దప్పించి
కర మిష్ట మొనరింతుఁ గౌశికమునికి.’
నని నిశ్చయము సేసి, యావీరబాహుఁ
డొనరంగ నొకరాత్రి యుర్వీతలేంద్రు
తొడలపైఁ బదములతుదఁ జాఁపి భక్తి
నడుగు లొత్తుచు నున్న, నతని మనంబు
నారయ మాయానిద్ర నొంది, రే యెల్లఁ
జరణసేవ యొనర్చు జననాథుఁ జూచి,

—హరిశ్చంద్రుఁడు వీరదాసనుపేర వల్లకాటిఁ గాచుట.—

‘ యోరి, నీదెస నాకు నుల్లంబునందు
వారక కొంతవిశ్వాసంబు వొడమెఁ.
బన్నుగా నాసేయు పనులపై నిన్ను
మన్నించి నిలిపెద మది నలి లేక.
విను మది చెప్పెద వివరంబుగాఁగఁ
బెను పొంద నీ పురి ప్రేతవనంబు
నా గుత్తగాఁ జేసినాఁడ. నీ వచటి
కేఁగి పీనుఁగుఁ గాటి కవ్వరేఁ దెచ్చి
కైకొని తమ యిచ్చగాఁ గాల్చి మరలి

వ్యపగత=పోయిన-క్షుత్=ఆఁకలియు - తృష్ణుఁడు=దప్పియుఁ గలవాఁడు. నెమకుచున్ = వెదకుచు. ఒరయన్ = పరీక్షించుటకై. ప్రేతవనంబు=వల్లకాటిని,

పోకుండ, నా యాన వొడిచి, యాశకము
కొల నున్న వస్త్రంబు మొగము కోకయును
కల నొప్ప నొకమూడ వాతిపాతికయుఁ
జెను పొంద నా కిచ్చి, పిండాశనంబుఁ
దిని నీవు బ్రతుకు మీ దినమునుండి.
వీరదా సను పేర వెలయు మీ విప్రుడు,
కోరి పట్టెడు ముద్రగుదియ గొ.' మ్మనుచుఁ
దనచేతి కిచ్చినఁ దగఁ బని పూని
వినయంబుతో మ్రొక్కి, వీడ్కొని పోయి;—
యత్తఱిఁ, గమరుఁగం పదర దిక్కులను
మొత్తమై నిగుడు క్రొంబొగల నంతంత
నుండు నొల్కులఁ జేరి - మానవమాంస
ఖండంబు లొండొండ గసికలఁ గ్రుచ్చి
కమ్మగాఁ గాల్చి - చంకటఁ బెట్టి - మొసఁగి -
నెమ్మది నృత్యంబు నెఱపు భూతములు,
సగము గాలుచు నున్న శవములఁ బట్టి
తిగిచి గుంపులు గూడి తినుపిశాచములు,
నెడ నెడ బొక్కల నిడిన బాలకుల
వెడలించి భక్షించు బేతాళతతులుఁ,
దలకాయలకు మూఁగి తనుతమ వనుచుఁ
గలహించు డాకినీ గణములు, మఱియు
వడి వధ్యశిలలపై వడిసి యందంద
మడుపు లై పేరిన మనుజ రక్తములుఁ,
బుఱియల నట మ్రింగి పులిత్రేఁపు లడర

ఆన వొడిచి = ఆనపెట్టి. మూడ = అరవరా. వాతిపాతిక = వాతి కాసును. పిండాశనంబు = పిండపుఁగూడు. ఒల్కులఁ = సొదలను.

నలుగక పొరలాడి యలచు రక్కసులు,
మునుముగాఁ గొట్టుల మోఁకాళ్ల నూఁది
కొని నిక్కి - యా మీఁదికుణపశల్యములఁ
దొడికి - దంష్ట్రిల నెక్కి - దుస్సి రాఁ దిగిచి
కడఁగి క్రక్కెడు జంబుకములఁ దోడేళ్లఁ
బిండాన్న శేషముల్ ప్రిదులక మెసఁగి
యొండొండ వ్రాలుచు నన్న ఘూకములఁ,
గరములఁ గొఱవులు గైకొని పేర్చి
గురులు వాఁకెడు పెద్ద కొఱవి దయ్యములఁ,
బోకుండ మానుపుఁ బూసరుల్ దెచ్చి
చేకొని యామంత్రసిద్ధుల కిచ్చి
తొత్తులగతి నుండి తొడరిన నరులఁ
బొత్తునఁ దినెడు పెంపుడు దయ్యములును,
సరఁ గూడి ఋగ్యజుస్సామ వేదములు
పరఁగ గణించెడు బ్రహ్మరాక్షసులుఁ;
గ్రంపుగాఁ గలిసి, వెక్కసమును వెఱపు
నందంద యొదవించు నా రుద్రభూమి-
నా రాజశేఖరుం డటుఁ బ్రవేశించి;
ధీరుఁడై నిజ ఖడ్గ దీప్తులు నిగుడఁ
జుట్టి పేరము పెట్టి కుడివడ నుడిసి
పట్టి కూఁతలఁ బెట్టు బలువిడి కూఁది,

మునుముగాన్=క్రమముగా. కుణప శల్యములన్=పీనుఁగుల యెముకలను. తొడికి = కఱచుకొని. దంష్ట్రిలన్=కోఱలతో. దుస్సి=ఊడి. గురులు=పరువులు. మంత్ర సిద్ధులకున్ = వల్లకాటిలో మంత్ర సాధన సేయువారికి. తొత్తుల=లంజెల. తొడరిన=సక్తులయిన. పొత్తులన్ = సంగడిగా. పేరము=పరుగు.

యెల్ల భూతంబుల నెల్ల డాకినుల
నెల్ల శాకినుల మోహిని పిశాచములఁ
గనుఁగొని, 'నేఁ డాదిగా మీరు గూడి
చని వీరబాహుని సదనంబునందు
వెట్టిఁ గొట్టము నీళ్లు వెలయంగ గసవు
కట్టెలు నివి యాదిగాఁ గలపనులు
పగ లెల్లఁ జేసి, మాపటి కిట వచ్చి,
తెగువ మై నీ కాడు తిరుగ రా కుండి,
యెచ్చటి కెవ్వరు నెఱుఁగక యుండ
వచ్చి పీనుఁగుఁ గాల వైచి పోకుండ
వా లీల కొఱవిదయ్యంబుల దివ్వె
కోలల వారిఁ గాఁ గొని కస్తు దిరిగి,
ప్రొద్దునఁ జను దెంచి పాదమూప కున్న
గ్రుద్ది యీడుద్దునఁ గొట్టుదు.' ననియు,
'విపులసంపద గల వీరబాహునకు
జపము సేయుఁడు మంత్రసాధకు.' లనియుఁ,
జండాలుఁ డనక మాసామి దీవించి
రండు నిచ్చలు బ్రహ్మరాక్షసు.' లనియు,
గట్టిగా నియామ విక్రమమునఁ జేసి;
నిట్టరాడును బోలె నిలుచున్న వాని
బేతాళు నొక్కనిఁ బిలిచి నీ వింక
* గాతుగా నా కొల్వుకాఁడ వై వీరుఁ
గొట్టి యిందఱఁ బనిగొనుచు నిచ్చోటఁ

వెట్టిక = కూలిలేక. కొట్టము = పసులసాల. కాడు = శ్మశానము.
విపుల = గొప్ప.

* 'ఘాతగా'

బెట్టింపు తగు మంచెఁ బెంపార.' ననఁ;—
వసుధఁ జాఁగిలి మ్రొక్కి వాఁడును నేఁగి,
మసలక దిబ్బగా మన్ను వేయించి,
సమముగా ఘన శిలా స్తంభముల్ నిలిపి,
యమరంగ నొకమంచె యామీఁద వైచి,
విచ్చేయుఁ మని విన్నవించిన; విభుఁడు
వచ్చి యా మంచెపై వల నొప్ప నుండి
యడిదంబు తోడుగా నా రుద్రభూమిఁ
గడు నప్రమత్తుఁడై కాఁపుండె నంత;—

—చంద్రమతి హంసనారి అనుపేర ఊడిగము సేయుట.—

నటఁ గాలకౌశిక నాలయంబునను
మటుమాయలను జిక్కి, మలఁకలఁ జొక్కి,
యుపవాసములఁ గుంది, యుడుకులఁ గంది,
యెపుడు చింతల వ్రేఁగి, హృదయంబు గ్రాఁగి
కంటకంబుల నొచ్చి కన్నీరు దెచ్చి,
కంటసంబులఁ జిక్కి, కటికులఁ బొక్కి,
మురిపెంబు వీడి, మోము గరంబు వాడి,
గరువంబు దూలి, శృంగారంబు మాలి,
విభ్రాంతి మది మీఱి, వెలవెలఁ బాఱి,
విభ్రమంబులు జాఱి, విశ్వేశు దూఱి,
బలు రాహుముఖమునఁ బడి కాంతి దప్పి
జలదరించెడు బాల శశిరేఖ పోలె
నలిగి, యందఱు 'హంసనారి' నాఁ బరఁగి,

అడిదము = కత్తి. ఉడుకులన్ = దుఃఖములచేత. వ్రేఁగి = వేఁగి.
కంటకంబులన్ = బాధలను. కంటసంబులన్ = విరోధవచనములందు.
కటికులు = కఠినోక్తులు.

బలుబాములకు నోర్చి, పట్టియుఁ దాను
దినమును జంద్రమతీదేవి పనుపు
పనులు సేయుచు; నిట్లు పండ్రెండు నెలలు

—. కాలకౌశికుఁడు లోహితాస్యుని అటవికి పంపుట. —

మునుకొని వర్తింప;—భూపాలసుతునిఁ
గనుఁగొని యొకనాఁడు కాలకౌశికుఁడు
చేరి, 'యో లోహిత, చెలఁగి యే ప్రొద్దు
నీరీతిఁ జంటిక్రిం దిటికి యీ తొత్తు
కఱపుల గుడిచాటుకాఁడ వై యిట్లు
తఱలవు; వీఁపెల్ల దద్దులు గట్ట
నడువక కా దింక.' నని జడ వట్టి,
తొడలును జెవులు నెత్తురు లుబ్బ నులిమి,
'యిది యాదిగా నింక నీ వాడలోనఁ
జదివెడి యాబ్రహ్మచారులఁ గూడి,
బుద్ధి దప్పక వనంబునకు నిచ్చలును
బ్రొద్దునఁ జని, పదిపుల్లె లాకులును
వేలిమి సమిధలు వెలయు దర్భలును
బాలుర పో రుడ్పఁ బండ్లు దోసెఁడును
దులసి పత్రియుఁ దెచ్చు దూడకుఁ గసవు
నలవడఁ గొంచు ర.మ్మ'ని నియమించి,
పనిచిన;— వేల వేలఁ బాఱుచు వచ్చి,
తన తల్లి పాదపద్మములపై వ్రాలి,
యనయంబు వగచుచు నశ్రువు లొలుకఁ

కఱపులక = బోధనములచేత. తఱలవు = కదలవు. అడువక = కొట్టక. పుల్లెల = విస్తరులకు వాలునన్ని. వేలిమి = హోమము-సమిధలు = చిదుగులు. అనయంబు = మిక్కిలి. ఉడ్పక = మాన్పించుటకు.

దన తెఱం గప్పు డంతయుఁ జెప్పుటయును;—
గడుపులోఁ జే వెట్టి కలఁచి నట్లయినఁ;—
గడు భయంబునఁ బొంది, కన్నీరు దొరఁగ
గురుశుచంబులతోడఁ గొడుకు మో మొత్తి,
తరలాక్షి పెదవులు దడుపుచుఁ బలికెఁ.—
‘గటకటా! కృప మాలి కాలకౌశికున
కిటు నిన్నుఁ బని కంప నెట్లు నోరాడె!
నడవికి నీ విప్పు డరిగినఁ గాని
తడయక విప్రుని తలయేరు దిగదు.
పట్టభద్రుని కూర్మి పట్టికి వేల్మి
కట్టెలు మోవంగఁ గట్టడే నీకు!
గట్టిగా భాగ్యంబు గల వధూమణికిఁ
బుట్టక నాకేల పుట్టితి కూన?
యడవికి నిన్నుఁ బొమ్మనఁ జూచి చూచి
నుడువంగ నే గతి నో రాడు నాకు?
నినుఁ బాసి నిముసంబు నే నిల్వఁ జాల.
ననుఁ బాసి పోయెదే నా ముద్దులయ్య!
చేకొని యిఁక నేమి సేయ నున్నదియొ
కాక విశ్వామిత్రు కపటవర్తనము!’—
అని వెచ్చ నూర్చుచు, నా పుణ్యసాధ్వి
వినయంబుతో నెల్లవేల్పుల వేఁడి,
దనుజ దర్వీకర తస్కర భూత
ఘనతర మృగ పక్షి గణములవలన
నవిరళంబుగఁ బ్రాణహాని లేకుండ

తలయేరు=తలనొప్పి. పట్టభద్రుని = పట్టాభిషిక్తుఁ డైన రాజు యొక్క. కూర్మి = ముద్దు. కట్టడి=పనుపు. అవిరళంబుగ=బొత్తిగా.

వివిధభంగులను దీవించి నందనుని
నలచేత నొకరతు నలనొప్పఁ గట్టి,
యలుగక, పొమ్మని యనుపంగ;—నడవి
కలమితో నృపసూనుఁ డేఁగుచు నుండఁ;—
జలము మీఱంగ విశ్వామిత్రుఁ డంతఁ
దనమంత్రశక్తిచేఁ దక్షకుఁ డనెడి
ఘనపన్నగంబు నాకర్షించి పలికె.—
'ఓయీ, తక్షక, మాకు నుపకార మొకటి
సేయుము. నీ కిది చెప్పెదఁ దెలియ.
వినుము హరిశ్చంద్రవిభుఁడు వసిష్ఠ
మునిమాట చెల్లింప మోరత్రోపునను
నెట్టన సత్యంబు నెఱపెద ననుచు,
నట్టిగట్టుక త్రేలు చున్నాఁడు. వానిఁ
గలఁచి బొంకింప నెక్కడ సందు లేక,
తలపోసి యీరీతిఁ దపము చాలించి,
తిట్టున కొడి గట్టి, తిరుగు చున్నాఁడ,
రట్టు దప్పక పోదు రా నున్న వేళఁ.
గలయఁ బర్వెడు భవద్గరళ కాలాగ్నిఁ
గులగిరు లైన నుగ్గులు నాఱఁ గాలు;
వసుధలోఁ దక్కినవా రన నెంత?
మసలక నీవు నా మతమున నేఁగి,
యహికులోత్తమ, లోహితాస్యకుమారు
గహనంబులోఁ బడఁ గఱచి ర. మ్మనినఁ;—

పన్నగంబున్ = పామును. మోరత్రోపు = మోరతో త్రోయుట చేత - అలక్ష్యముగా ననుట. నెట్టనన్ = తప్పకుండ. నుగ్గులు నాఱన్ = బుగ్గిగా. గహనంబులోన్ = కాఱడవిలో. పడన్ = కూలునట్లు.

దడయక వనిఁ బూని తక్షకుం డపుడు
వడి నేఁగి, యల పితృవనసమీపమునఁ
దళ్లు కొట్టెడి గంట దరిఁ జాలఁ బ్రబలి-
చల్లగా నీడ యై - చలివెంద్ర వోలె
మట్టంపుఁబొడవున మానైన - మఱ్ఱి
చెట్టు క్రిందటి పుట్ట చేకొని యుండె.
* నా తక్షకుని చేఁత కనుకూలపడఁగఁ
బ్రీతితో శిష్యులఁ బిలిచి కౌశికుఁడు
'మునికుమారకులార, ముదమున మీరు
చని లోహితాస్యుని సంగడిఁ గూడి
వనములోఁ జరియించువానిఁ బ్రేరేచి
కొని పోయి తక్షకు ఘోరవిషాగ్నిఁ
బడఁ ద్రోచి రండ'ని పనిచిన;— వారు
తడయక చని రాజతనయునిఁ గాంచి,
'ఓ లోహితాస్య, మాయొజ్జలు వనుప
నీ లీల వచ్చి మ మ్మెప్పుడు నిచటఁ
గడు నొప్పు ఫలములుఁ గంద మూలములు
నుడుగక కొనిపోవు చుందుము గాన,
గుఱుతులు మే మెఱుంగుదు మంతటికిని;
తెఱఁ గొప్ప నీవు నేతెమ్ము మా వెనుక.'
ననుచు, బోధించి వా రటు గొనిపోయి,
మనుజేశసుతుఁడు నెమ్మనమున నలర
ఫలములు దర్భలు పసిదూడ కసవు

తళ్లు = అల. మట్టంపు = మట్టసపు. మాను = అందము. ముదమునన్ = సంతోషముతో.

---

* 'చేఁత కనుకూల మొదవ'

కలయంగఁ దోడ్పడి కట్టగాఁ గట్టి,
సమిధలు దల కెత్తి, చను చున్న; - మొగము
చెమరింపఁ - గూఁకటి చీకాకు పడఁగ -
దడ వడంకులు గొంచుఁ దను వెల్లఁ గంద -
నడుగులు దొట్రిల్ల - నల్లన నడచి,
వచ్చి యల్లప్పటి వటమూలమునను
జెచ్చెరఁ దల మోపుఁ జేర్చి, రాసుతుఁడు
చల్లని జలము లచ్చటిగుంటఁ ద్రావి,
యొల్లన మరలి యా యుర్వీరుహంబు
నీడఁ గొండొక సేపు నిద్రించి, తన్నుఁ
గూడి వచ్చినవడుగులు దలఁపింపఁ,

—లోహితాస్యుని తక్షకనాగుఁడు కఱచుట.—

'మనములో నిందాక మఱచి యున్నాఁడ.'
యనుచుఁ, బత్త్రములు రయంబునఁ గోయ
నొకకాలు పుట్టపై నూఁది - యాపాద
మొక కొంత నిక్కి - మ్రా నూఁతగాఁ ద్రొక్కి -
వాలు కొమ్మొకకేల నడి వంచి—యున్న
కేలు సాఁపఁగ - గమకించునాలోనఁ,
గాలకంఠ కఠోర కర కంపి తోగ్ర
శూలాగ్ర నిర్గత స్థూల కీలాభ
లోల జిహ్వారుణ లోచనం బగుచుఁ
గ్రాలెడుఫణము భీకరముగా ముడిఁచి

కూఁకటి=పిలకజుట్టు. దడవడంకులు = అధికకంపములు. ఒల్లన = మెల్లఁగా. కాలకంఠ = శివునియొక్క. కర = చేతి చేత. నిర్గత = వెడలిన. కీలా = జ్వాలవంటి. ఆభ = ప్రకాశముకలదైన. లోల = చలించుచున్న - జిహ్వా = నాలుకయును. అరుణలోచనము = ఎఱ్ఱనికన్నును గలది.

యాలోన నడఁగిన యు మ్మహా భుజగ
మాలోహితాస్యుని నద రంటఁ గఱచె.
*నా విషవహ్ని భగ్గని పేర్చి మేన
నావహింపక మున్నె 'హా మాత!' యనుచుఁ,
జావుతో సరి పోల్పఁ జనుమూర్ఛ నొంది,
భూవరపుత్త్రుండు భూమిపై వ్రాలె.
నంత భస్మీభూత మయ్యె నా వటము.
అంతియు కాని యాయాదిసర్వంబు
పనివడి చంప నోపదు బాలు నతని,
జనని పాతివ్రత్యశక్తి పెంపునను.
అది చూచి ముని పుత్త్రు లాశ్చర్య మంది,
'మదిలోనఁ దలఁప, నీ మనుజేంద్రసుతుఁడు
నిగిడిన విషవహ్ని నిలువునఁ గాలి
పొగిలి భస్మము గాక, పోలించి చూడ,
నల కాలకూట మహాగరళంబు
చెలఁగుచు మ్రింగి మూర్ఛితుఁ డైన శివుని
వడువున నున్నాఁడు; వాడదు మోము,
విడువదు తనుకాంతి వీస మంతయును,
బదతలంబులు గాజు వాఱవు. నిప్పుఁ
జెడ లంటునే! వలచేతి యీ రక్ష
వెలయ నే మంచు దీవించి కట్టినదో
తలపోయు ముకు వీనితల్లి దా!' యనుచు,
నటిమటిఁ బురమున కరిగి, యా వార్త

అడరు అంటన్ = నిప్పుకు యంటునట్లుగా - భగ్గాలుమను నట్లుగా. వడువునన్=విధమున. అటిమటిన్ = సంభ్రమమున.

* 'భగ్గునఁ బేర్చి' అను ముద్రణమున యతిభంగము.

తెలుఁ గొప్పఁ జంద్రమతీ దేవితోడ
గాఱుతులు సెప్పి వద్దులు చని. రంతఁ,

—చంద్రమతి సుతుఁగూర్చి విలపించుట.—

గాఱగానిపలు కనుక్రొవ్వాఁడి వేఁడి
మెఱుఁగుఁగైదువు నాటి మెఱమిన, గుండె
పఱియలుగా వ్రీలి ప్రాణంబు లెడలి,
యదరి, భూవరుదేవి 'హా పుత్త్ర!' యనుచు,
సొదవిన పెనుమూర్ఛ నొక్కింతతడవు
తఱిగిన కదళి చందంబున నేల
నొఱగి, చేష్టలు దక్కి, యొయ్యనఁ దెలిసి,
నేలలు పుడుకుచు, నిగిడినవగల
వాలుఁగన్నుల నీరు వఱద లై పాఱ,
"నక్కటా! యో లోహితాస్య, నా కింక
* ది క్కెవ్వ? రిటమీఁద? దెరు వేది బ్రతుక?
నీదుఃఖవార్ధి నే నే తెప్పఁ గడవ
నీఁదుద? నీవిధి కే మని వగతుఁ?
పతిఁ బాసియును నిన్నుఁ బట్టి నాపట్టి,
మతిని నే దిగులును మఱచి వర్తింప,
నెక్కడ నుండి నేఁ డిటు వెంటనంటి
తెక్కలి దైవంబు ద్రెక్కొనె నిన్నుఁ!
† బుట్టక పుట్టిః పుట్టుభోగిపయిఁ
బుట్టభోగికిఁ బగఁ బుట్ట నేమిటికి?

మెఱమినన్ = త్రిప్పఁగా. పఱియలు = బ్రద్దలుగా. వార్ధి = సముద్రము. తెక్కలి = వంచకపు. ద్రెక్కొనెన్ = వంచెను. పుట్టుభోగిపయిన్ = ఆజన్మశ్రీమంతుని మీఁద. భోగికిన్ = పామునకు.

* 'బ్రతుకు కీదుఃఖ' † 'పుట్టుభోగికిని'

నప్పాపజాతిపు ర్వెద రంటఁ గఱచు
నప్పుడు నన్ను నే మని తలంచితివో?
వేఁడిమి హృదయము మీఁద విప్రున కెపుడు,
'వీఁడు కొండికవాఁడు విపిన భూములకుఁ
గనికరింపక పంపఁగా నెట్లు వచ్చు?'
ననక కృపాహీనుఁ డై నిన్నుఁ బంపెఁ.
బంపెఁ బో, నీకుఁ గాఁ బనిఁ బూని యడవి
కింపెసలార నే నేల పో నైతిఁ?
బోవుట గలిగినఁ బుత్త్రి నిన్ను గోలు
పోవుదునే? బుద్ధిఁ బురు వెట్టు మేసె?
నీ పుట్టి నప్పుడు నెన్ని దైవజ్ఞ
లేపార నిల యెల్ల నేలెద వనుచుఁ
గడఁగి పల్కిరి గాని కాలాహిచేత
నడవిలోపలఁ జత్తు వనరైరి తనయ.
అడవికి నీ వేఁగునపుడు - గన్నీరు
వెడలెడు నీ వాలు వెడఁద గన్నులును -
విన్ననై పెదవులు విఱిచి దైన్యమున
నన్న ర మ్మని పిల్చు నలిగొట్టుపలుకుఁ -
బలుచని చెమటతో ఫాలభాగమునఁ
గలగొన నంటిన కాకపక్షములుఁ -
దలఁపాల వెడలెడుదాఁక నా దెసకు
మలయుచు మాడ్కి లుఁ - గల మంచి నీ మోముఁ

కొండికవాఁడు = బాలుఁడు. విపిన = అడవి. ఇల = భూమి. కాలాహిచేతన్ = నల్లత్రాచుచేత. వాలు = నిడుద. వెడఁద = వెడలుపు. నలిగొట్టు = సన్నసన్నపు. ఫాల = లలాట. కాకపక్షములు = జులుపాలు. మలయు = తిరిగాడు.

గన్నులఁ గట్టిన కైవడిఁ దోఁచు
చున్నది, యిప్పు డెట్లొకొ పుదు మఱవఁ?
బ్రొద్దు నేఁ డిదె క్రుంకెఁ, బాలమునుండి
ముద్దులేఁగలు వచ్చి మొదవులఁ గలసె.
మనమున మోహంబు మల్లడి గొనఁగఁ
జనుదేవు నీ వేల? చన్నులు సేపె.
నేపరింపుదురె న న్నిట్లు మా యయ్య?
నా పుత్త్రిరత్నంబ! నా నిధానంబ!"
యని, పెక్కు భంగుల నడలు—భూపాలు
వనితపై నా విప్రవనిత గోపించి,

—కలహకంఠిక చంద్రమతిని అదలించుట.—

"యోసి, యమాంగల్య మొదవ నేడ్చెదవొ
యీసంధ్యప్రొద్దు మా యింటి ముందటను?
గలగొని చీమల గామల వలెను
జెలఁగుచు ముందఱ శిశువు లాడఁగను,
నీ కేల పలవింప? నీ కుమారునకు
నీకును గాఁ జెడె నేఁ డిల్లుఁ బెల్లుఁ.
బోకాడి నట్టి యా ప్రోడని కేడ్వ
* నాకుఁ బోలును గాక; నా సూత్రధారి!

మొదవులఁ = ఆవులను. మల్లడి = పెనఁకువ. ఏపరింపుదురె = దుఃఖపెట్టుదురా. గామ లనఁగా చీమలలో నొకజాతి విశేషము - చీమల గామలవలెను = పలువురు అంతటను చేరి అనుట. పెల్లు = పెరడు - ఇల్లుఁ బెల్లుఁ = సర్వము అనుట. పోకాడినట్టి = పాటిపోయినట్టి. ప్రోడనికిఁ = గడుసుకుఱ్ఱవానికి. నాసూత్రధారి = ఓసి నా వేసాలమారీ - సూత్రధారి = ప్రధాననటి.

* 'నాకుఁ బోవదు'

కొడుకు నేడకో దాఁగ గుట్టుగా నంపి,
'కడు నుగ్ర భుజగంబు గఱచిన దనుచు,
వెడయేడ్పు లేడ్చుచు, వెదకుచు నందు,
వెడలి పోఁ జూచెదో వేసాలు పన్ని?
లోకంబులో లేని లోటతాటకత్తె,
* నీ కువాడమ్ము లన్నియు మాకుఁ దెలియుఁ.
గైకొని మేఁకలఁ గాచి రా పొమ్ము;
నీకంటె మిక్కిలి నెఱజాణ నేను.
† గొడుకుకై విలపించు కొనుచు నీ వున్న,
§ నెడప కెవ్వ రొనర్తు రీపను లెల్లఁ?
బాలు లే లెమ్ము పిసాళింప. క'' నుచు,
నా లీల దుర్భాష లాడుచు నున్న
కాలకౌశికుభార్యఁ గనుఁగొని, వగపు
లోలోన నడఁచి, యాలోలాక్షి పలికెఁ.—
'దల్లి, నా మీఁద నిత్తఱి దయ నుంపు,
ముల్లంబులో నిది యొండుగాఁ గొనకు;
విస మెక్కి చచ్చెనో విపినంబు లోనఁ,
బొసఁగంగఁ గొఱప్రాణముల నున్న వాఁడొ?
చొప్పడ నా పుత్త్రిఁ జూచి రా నొకని
నిప్పుడే పంపు. వాఁ డీల్గక మున్నె
మసలక తెప్పించి, మందు పోయించి,
పసనుగా నొసరింపు ప్రాణదానంబు.'

లోటతాటకత్తె=జిత్తులమారి. కువాడమ్ములు=కపటములు. పిసాళింపక=దొంగయెత్తులు వేయక. ఈల్గక=చావక. మసలక=తడయక. పసనుగాన్=చక్కఁగా.

---

* 'లన్నియుఁ దెల్పు మాకు' † 'కొడుకుకు.' § 'కవ్వరు నేతు'

ననుచు, దైన్యము దోఁప నా రాజుదేవి
తను వేఁడుకొనుచుఁ, బాదములపైఁ బడినఁ;—
గలహాకంఠిక కనికర మింత లేక
తల మని ముంగలఁ దలఁ బాయఁ ద్రోచి,
* 'తొలుతటిసొమ్ముతోఁ దో డింకఁ గొంత
గెలువఁ జూచెదవు, మిక్కిలి జాణ వౌదు.
కట్టెలు దె మ్మన్న, ఘనభుజంగముల
పుట్ట లెక్కఁగ నేల పోయె నీకొడుకు?
చేకొని యిది మేము చేసిన తప్పె ?
వా కట్ట మైతిమి వసుధఁ బాములకు ?
మందుల విలువలు మా కేడఁ గలవు ?
మందు వెట్టఁగ లేము, మనఁ జేయ లేము,
వెదక నంపఁగ లేము, వెజ్జుఁ దే లేము,
మదిమదితో నుండి మా కేమి శ్రద్ధ?
పీడ వాయుదు మాకు బిడ్డఁడు నీవుఁ
† గూడు గూరకు సడి గొట్టుచు నడిగి. (?)
ఉన్నమాటలు మాని, యూరక వచ్చి
పన్నుగా నీ చేయుం పను లెల్లఁ దీర్చి,
ప్రొద్దు వోయిన మీఁదఁ బోయి నీ పుత్త్రు
సుద్ది నిక్కంబుగాఁ జూచి ర. మ్మ' నిన;—
నుత్తర మొండాడ నులికి, యా సాధ్వి

తలము = తొలఁగుము. వా-నోరు. మనక - బ్రదుకునట్లు. వెజ్జుక-వైద్యుని. మదిమదితోక-మెమ్మదిగా. సడిగొట్టుచుక - నింద గలిగించుచు. ఉన్నమాటలు - కడమమాటలు. సుద్ది-వృత్తాంతమును.

* 'తొలుతటిసొమ్మును' † 'సడి గొట్టక యడిగి'

చిత్తంబులో శోకశిఖి మండుచుండ,
జాము పోయినదాఁకఁ జాఁగఁబఱ గొట్టి,
బాములఁ బొందుచుఁ బను లెల్లఁ దీర్చి,
బడలియు, మతి వచ్చి, భక్తి దీపింప
నడుగు లొత్తుచు నున్న; — నా విప్రవసిత
వడి జొల్లు సెలవుల వడియ, నూరుపులు
నిడుద లై గొటగొట నిగుడ, వెంట్రుకలు
విరిసి జుంజుఱుఁదల వ్రేలాడఁ, జెమట
దొరఁగఁగ కతుంబుల దుర్గంధ మొసఁగఁ,
బిసరు గాఁచినకుండ పేర్వ చందమున
నెసఁగిన బాఁకి నో రంతయుఁ దెఱచి,
కలవరంతల వాడగరితలు బెదరఁ,
బెలుచఁ బండ్లను బెటపెటఁ గొఱుక్కొనుచు,
నొడలిచీర నెఱుంగ కుదరంబు పెద్ద
తడగంబుగతిఁ దోఁపఁ, దనప్రక్కలందుఁ
బడుగును బేకయు బలెఁ బడి మునిఁగి
పసుచులు గూర్కొంగఁ, బందిచందమునఁ
దెప్పున నిద్రఁ జెందిన యుట మీఁద; —

## — చంద్రమతి పోయి తనయునిం గనుట. —

న ప్పద్మలోచన యల్లన లేచి,
యంధకారమును శోకాంధకారమును

శోకశిఖి = దుఃఖాగ్ని. చాఁగఁబఱగొట్టన్ = బాధింపఁగా. బాములన్ = దుఃఖములను. సెలవులన్ = పెదవిమూలలందు. జుంజుఱుఁదలన్ = చింపిరితలయందు. కతుంబులన్ = చంకలయందు. పిసరు = కడిగిన ధాన్యములో క్రోపుడు పడినది. తడగము = ఎద్దుమీఁద నీళ్లు తెచ్చెడి తోలుసంచి.

బంధురం బగుచు లోపల వెలుపలను
గిఱిగొని కవియంగఁ గంగేల నొక్క-
కొఱివిఁ గైకొని, వడుగులు సెప్పి చనిన
కడకుఁ బోయినత్రోవ గా, నొక్కతెయును,
దొడరిన పతిభక్తి తోడుగా, నరిగి,
పొడవైన వట భస్మ పుంజంబు గాళ్ల
కడను - బుట్ట తలాపి కడ - నుండ - నిట్లు
పడి - కన్ను లర మోడ్చి - పాదముల్ వీడు
* పడఁ జాఁచి - మృదుపాణిపల్లవయుగము
వెడఁదయురంబుపై వ్రేసి - గళంబు
కుడి దిక్కు భుజముపైఁ గొండొక వంచి -
మొగ మోరగాఁ బెట్టి ముందటిచుంచు
జిగి దప్పి కెంధూళిచే బీఱువాఱి -
యొక వికారము లేక, యూరక తొల్లి
ప్రకట నిద్రావస్థఁ బరఁగుచందమున
నున్న - యాలోహితాస్యునిఁ జూచి 'ప్రాణ
మున్నదో? లే. ద'ని యువిద మూర్ఛిల్లి,
† ధర మీఁదఁ బడి పెద్దతడవు గాఁ దెలిసి
పురపురఁ జిత్తంబు పొక్క - నందంద -
చెందమ్మి రేకులఁ జెనకు హస్తముల

బంధురము = దట్టము. పోయిన త్రోవగాన్ = పోవునట్టిదారి యందు. వటభస్మపుంజంబు=మఱ్ఱిబుగ్గిరాసి. మృదు పాణి పల్లవ యుగము=మెత్తని చేయి చిగురు దోయిని. వెడఁద యురంబు పైన్=విశాల వక్షము మీఁద. గళంబు=మెడ. చుంచు = పిల్లజుట్టు. జిగి = కాంతి. కెంధూళిచేన్=ఎఱ్ఱనిదుమ్ముచేత. బీఱువాఱి=వన్నెమాసి. చెనకు=శేరు.

* 'పడఁ జూచి' † 'పెద్దతడవుకు'

ముం దలయూఁను మొగంబును మోఁదుకొనుచుఁ,
జాఁ గీ వెడలిన జంత్రంపుబొమ్మ
పోలిక మూర్ఛిల్లి, పుత్త్రుపై వ్రాలి,
క్రమ్మఱఁ దెలివొంది, కన్నీరు దొరఁగ
నమ్మదిరాక్షి యి ట్లని యేడ్వఁ దొడఁగె. —
'హా! లోహితాస్య! వంశైక విస్తార!
లాలితసౌభాగ్యలక్షణాకార!
హా! నిర్వికార! మహాగుణాధార!
భూనుత ఘన మణి భూష ణోదార!
హా! సుకుమార! కల్యాణవిహార!
వాసి కెక్కిన చక్రవర్తి కుమార!
తిన్నని నగ వామతించు నీ మోముఁ
గన్నుల పండువుగాఁ జూడ కున్నఁ
బులకండ మొలుకు నీముద్దులమాట
లలవడ వీనుల నాలింప కున్న,
మెఱుఁ గారు నీ బోదు మేను చిత్తంబు
కఱవు వో నక్కునఁ గదియింప కున్న,
నోడలఁ బ్రాణము లుండ వొకనిముసంబు;
నెడముగా నినుఁ బాసి యే నెట్లు లోర్తు?
నే తెరువునఁ బోయి యే నెట్లు వత్తు?
నా తోడఁ జెప్ప వే నా తోడునీడ!
యెచ్చట నుండి ని న్నెలమి నేఁ బిలువ,
వచ్చి, నన్ బొడ గాంచి, వదనాబ్జ మలర
నెదురుగా వత్తు; నేఁ డేటికి రావు?

అమతించు=రప్పించు. పులకండము=కండచక్కెర. బోదు=గోముగాఁ బెరిఁగిన. అక్కునన్=ఱొమ్మున. ఎడము=దూరము.

మది నీకు నా మీఁద మరు లెంతయుఁ బోయె?
పసుగులచేత నీ వార్త విన్నపుడె
తడయక నే గాని తప్పు పైఁ బెట్టి
యలుకమై ముఖ పద్మ మువ్వాలఁ జేసి
పలుకవో నే నిట్లు పలుమాఱుఁ బిలువ?
నో యన్న నే మని యొకమరి కింక
నో యన్న నీ కింక నుడిగి నాలోని
వంత దార్పవే. పైడి కుండల మేడ
లందు రత్నావళి సలరు నుయ్యెలల
సుదతులు జోకొట్టి జోలలు పాడ
నిదుర వోయెడు నీవు నేఁడు రానేలఁ
బడి నక్క లఱవ నిర్భయమున నడవి
నుడుగక నిద్దుర నొంది యున్నాఁడ.
వే మందు నిఁక నెట్టు లే మందు విధిని?
నే మందు పెట్టిన నెసగుఁ బ్రాణములు?'
అని యని పలవించి యవనిపైఁ బొరలి,
తనయుని ముక్కునఁ దన వ్రేలు మోపి,
యుడుగక మెల్లనె యూరుపు లరసి,
'యొడలఁ బ్రాణము డాఁగి యున్నది గాని
చావఁడు వీఁ' డని చర్చించి, మఱియు
భావించి 'యిది యేల వలవని యాస?
వత్తురే చచ్చినవారును మరల?
నిత్తఱి నిటు చావ నిది కట్టడయ్యె.

మరులు=ప్రేమ. ఓ యన్న...నుడిగి=ఓ అని నేను పిలువఁగా నీవు ఒకమాఱు కోపముతో 'ఏమి?' అని పలికి ఓ యన్నా నీ కోపము తీఱి. వంత=దుఃఖమును. రానేల=రాతి నేలయందు.

నిన్నియుఁ గల్ల, లూహింపఁ, గౌశికుఁడు
నన్ను వేదనఁ బెట్ట నలిఁ బన్నినట్టి
మాయ గాఁ గని. 'దైవమా!' యని, కొడుకు
బా యని యక్కునఁ బట్టి, పాలిండ్ల
నొత్తి, 'యో యమ్మ! చ న్నొల్లఁ డకట శోక
మొత్తి, యా కలచిన యుత్సంగంబుఁ దలఁచి,
'శ్రుతిబాహ్యుఁ డిలఁ బుట్టుగ్రుడ్డి తామసుఁడు
గతిచెడ్డ చెడుగు తెక్కలి బొక్కలాఁడు
పదవిహీనుఁడు జగత్ప్రాణభక్షకుఁడు
వెదకి యీవిసపాల విత్తు నే మందు?'

—లోహితాస్యునికి అగ్నిసంస్కార యత్నము.—

నని పాము నిందించి, యంతరంగమునఁ
దనుఁ దాన యూరార్చి, ధైర్యంబు దెచ్చి,
'వెల్లున వొరలిన విధిని నీయడవి
మల్లడి గొను పగ మాన కేడ్చినను,
సుతుని ప్రాణములు వచ్చునె? వీనిఁ బుణ్య
గతికిఁ బోవ దహించి, కాలకౌశికుని
ముదిత మేల్కొనకయు మున్నె నేఁ బోయి
వదలక పని దీర్ప వలయు. నిచ్చోటఁ
దడయుట గా' దని, తనచీర బిగిచి,

బా-రా అనుట. శ్రుతిబాహ్యుఁడు = వేదబాహ్యుఁడు - చెవులు లేనివాఁడు. తామసుఁడు = దుష్టు - తామసమైనసర్పజాతి. బొక్కలాఁడు = సర్పము - కన్నగాఁడు. పదవిహీనుఁడు = కాళ్లు లేనివాఁడు - స్థానము లేనివాఁడు. జగత్ప్రాణభక్షకుఁడు = గాలిని తినువాఁడు - లోకములోని వారిప్రాణమును భక్షించువాఁడు. విసపాలవిత్తుక = నాశకుని. మల్లడి గొను పగక = పెనఁగొను దుఃఖముచే.

కొడుకు పీఁపునఁ గట్టుకొని, కొంత దవ్వు
చని, చితి కేశాస్థి శకల కపాల
ఘన వర్మ సంకీర్ణ ఘట జీర్ణశూర్ప
భసిత సముద్భట పటు నట ద్భూత
విసర బేతాళ సంవృత్తమై చూడ
నతిభీకరం బైన యా రుద్రభూమి
ధృతిఁ జొచ్చి, యం దొక్కదెసఁ బుత్త్రు డించి,
పొంత యొల్కులలోనఁ బొడవఱె కాలి
కొంత చిక్కిన కడ కొఱవులు దెచ్చి,
కుఱుప్రోఁగుగా నిడి, కొడుకు నం దునిచి,
కొఱవి సొక్కడఁ దలకొఱ విడఁ బూని,
చేతు లాడక, మోము చీకతో నొత్తి,

—.చంద్రమతికడకు వీరదాసు వచ్చుట.—

* యాతురంబుగ నేడ్వ;—నాయార్తరవము
విని హరిశ్చంద్రుండు విస్మయం బంది;—
'ననుఁ గన్నొఱంగి, యీ నడురేయి, నకట!
యీవల్లకాటిలో నీయార్తరావ
మీ విధి విన వచ్చె; నెలుఁగుచందమును
బోలింప, సతి గాని పురుషుండు గాఁడు.
చాలు నీ తలపోఁత. చయ్యన నేఁగి

చితి=సొదలు. కేశ=వెండ్రుకలు. శకల=తునుకలు. కపాల=పుఱ్ఱెలు. సంకీర్ణ ఘట=చెదరిన కుండలు. జీర్ణ శూర్ప=చింకి చేఁటలు. భసిత=బూడిద. సముద్భట=మిక్కిలి ఉద్ధతముగా - పటు=బిట్టుగా. విసర=సమూహములు. సంవృత్తము=కూడుకొన్నది. పొడవు అఱె=నిడివి తఱఁగి. కుఱు=చిన్న.

* 'యాతురంబున'

కదిసి చూడక పొందు గా.'దని ముద్ర
గుదియ మూఁపున నిడి, క్రూరఖడ్గంబు
మొల ద్రిండుతో నంటు ముడి వేసి బిగిచి,
కులగిరిపైనుండి కుంభినిమీఁది
కసమున నుఱుకు సింహంబు చందమున
మసలక యా రాజు మంచెపై నుండి
మేదినిఁ బడ దాఁటి, మెల్లన వచ్చి,
యాదటఁ గనుఁగొనునప్పు;—డయ్యింతి –
నెరసినకురులును – నెఱి ధూళిఁ దూలి
విరిసిన సీమంత వీథియు – వదలి
జాఱిన పయ్యెదఁ – చన్నులమీఁదఁ
గా ఱెడు కన్నీరుఁ – గరపల్లవమునఁ
గదిసిన చెక్కును – గలికి లే నవ్వు
గుదిసిన మూపును – గొండొక వదలి
మూఁపుపై వ్రేలు క్రొమ్ముడియును – వగల
వాపోవఁ గెంపారు వాలుఁగన్నులును –
వెడలు నిట్టూర్పులు – వెగచు కుత్తికయు –
బడలిన మేనును – బగిలిన మోము –
మగిడిన చనుఁగప్పు – మాసిన చీర –

ముద్రగుదియన్ = తన యధికారము పేరు చెక్కియున్న లాతామును. ద్రిండు=దట్టి. కుంభిని=భూమి. అసమునన్=దర్పముతో. ఆదటన్=ప్రేమతో. నెరసినకురులును = చెదరిన తలవెండ్రుకలును. నెఱి=సొంపు. ధూళిన్ = దుమ్ముచే. తూలి=చెడి. విరిసిన = చెదరిన సీమంతవీథి=పాపటరేఖ. కలికి=అందంపు. కుదిసిన=క్రగ్గిన. కొండొక=కొంచెము. క్రొమ్ముడి = కొప్పు. వాలు = విశాలమ్మైన. [illegible] — వెక్కి వెక్కి యేడ్చుచున్న. మగిడిన = తొలంగిన.

పగిలిన యాధరబింబము - నై, తలంపఁ
బలుచని మొగిలులోపలఁ దోఁచు చంద్ర
కళభంగి మాఁగుడు గవిసి - మానికపు
బొమ్మను మసిపాఁతఁ బొదిఁగినమాడ్కి-
నెమ్మేని గ్రొమ్మించు నిగుడక మాసి,
నాకేశుఁ బాసిన నాఁటి పౌలోమి
చేకొన్న దుర్దశఁ జెందిన ట్లున్న;—
భావించి యాత్మలోఁ బలుమాఱు వగచి,
భూవల్లభుఁడు దాని ముందఱ నిలిచె.

## చంద్రమతి వీరదాసుల సంవాదము.

నిలిచినఁ, గనుఁగొని, నివ్వెఱపాటుఁ
గళవళంబును మదిఁ గడలుకొనంగఁ -
దొలఁగిన పయ్యెద తుంగ స్తనముల
నలవడఁ గప్పు - నయ్యబ్జాక్షిఁ జూచి,
'వెఱవకు మీ వమ్మా! వెలఁది, యిచ్చోట
నెఱసిన చీఁకటి ని ట్లొంటి నున్న
* నెఱసాహసివి. మఱి నీకేటి వెఱపు?
మఱుఁగు పెట్టక చెప్పుమా నీకు నిట్టి
నెగు లింతయును నేమినెపమున వచ్చె?
మగువ నీ పే రేమి? మగని పే రేమి?
యెచ్చట నుండుదు? వీ బాలుఁ డెట్లు
చచ్చె.' నావుడు;—ముఖాబ్జము వ్రేల వైచి,

అధరబింబము=దొండపండువంటిమోవి. మొగిలు=మబ్బు. మాఁగుడు=మాలిన్యము. నాకేశుఁ = ఇంద్రుని. పౌలోమి=శచీదేవి. నివ్వెఱపాటుఁ=ఆశ్చర్యమును. కళవళంబును=కలఁతయు. నెగులు=కష్టము.

* 'నెఱసాహసికి వింక' అన్న లింగదోష ముండదు.

కన్నుల బాష్పంబు కణము లందంద
చన్నుగుబ్బల మీఁద జలజల దొరఁగఁ,
బోరఁబోరి వగచుచు, భూవల్లభునకుఁ
గరుణ రా, గద్గదకంఠి యై పలికెఁ.—
'పురుషవరేణ్య, యీపురి నొక్క విప్ర
వరునింట దాసి నై వర్తించు చుందు,
నప్పు దీర్పఁగ నుపాయము మఱి లేక -
తప్ప నాడక - పతి దన్నమ్మె గొనియె,
నా సుతుఁ డితఁ, డంచనారి నా పేరు;
భూసురుం డడవికిఁ బుత్తేర వేల్మి
కట్టెలకై వచ్చి కడు నుగ్ర మైన
కట్టెఁడి భుజగంబుఁ గాటునఁ జచ్చె,
ననఘ, మీ రెవ్వ? రి ట్లనుకంప మీఱఁ
దనశోక ముడుపఁ జిత్తమునఁ దలంచి
విచ్చేసి నట్టి యా విశ్వనాథుఁడవొ?
నిచ్చలుఁ బహు భూత నివహంబు గొలువ
* నిచ్చలోఁ బ్రియ మార నీ రుద్రభూమి
నచ్చుగా విహరించు నా భూతపతివొ?
యెఱిఁగి యుండితి రేని యే మైన మందుఁ
గరుణ నిచ్చి సజీవుఁగా వీనిఁ జేసి
నన్ను రక్షింపుఁడు.' నావుడు;—దాని
సన్నుత ప్రియవాక్య సరణిచేఁ దనదు

కట్టెఁడిభుజగంబు=క్రూరసర్పముయొక్క. అనుకంప=కనికరము. నిచ్చలుఁ=సదా. నివహంబు=సమూహము. ఇచ్చలోఁ=మనసులో. విశ్వనాథుఁడవొ=కాశీ విశ్వనాథుఁడవో. భూతపతివొ=శివుఁడవో.

* 'నిచ్చలుఁ' యతిభంగము.

కులసతి యప్పుడు నిష్కపటముగా నాత్మఁ
దెలియక, చంద్రమతీదేవి కనియె.—
'భూతనాథుఁడఁ గాను, భువి నెల్ల జనుల
చేత మ్రొక్కులు గొను సిద్ధుండఁ గాను,
వెడఁగు మందులచేత విష మెట్లడంగుఁ?
జడఁ నొకో చీర రాచినఁ బాముకాటు?
మందుఁ బెట్టఁగ నేర, మనఁ జేయ నేర.
నెందు నిప్పురమున నీ రుద్రభూమి
గుత్తగాఁ గైకొని గురుభుజశక్తి
నెత్తి యెవ్వరి నైన నుక్కడఁగించు
బలియుండు చండాలపతి వీరబాహుఁ
డెలమిపై మన్నించి, యీ ముద్రగుడియఁ
దగ నిచ్చి, యీకాడు తఱలక రేయుఁ
బగలును గావంగఁ బనిచె న. న్నిందు
వీరదాసను పేర వెలయుచుండుదును.
వారక నడురేయి వచ్చి నీ విట్లు
నన్నుఁ గానక యుండ నందనుఁ దెచ్చి,
పిన్ననిఁ జితిమీఁదఁ బెట్టంగఁ దగునె?
నెలఁతవు గాన మన్నించితి నిన్నుఁ;
దల ద్రెవ్వ వ్రేయుదుఁ దక్కరుఁ డైన.
* సొద వేర్పఁ దగునంత చోటికి మాడ
మొదటనే తెచ్చి మాముందఱఁ బెట్టి,
పిదప దహింతురు పీనుఁగుఁ దెచ్చి.
ముదిత యీ తగిన చొప్పున నీవుఁ దెచ్చి

బలియుఁడు=బలవంతుఁడు.

* 'చోటుకు'

యీ కుమారున కగ్గి యి మ్మిటు పోసఁగ
లే కున్నఁ, గాల్చి పో లేవు. న న్నేలు
నొడయుఁడు వీరబాహుని యాజ్ఞ లాన.
వెడలి పొ'మ్మనిన నవ్వేలఁది యి ట్లనియెఁ.—
'పరహితచరిత నాపై నొకకొంత
కరుణ సేయక సిరి గలదానిబలెనె
యడిగెద వేల న న్నదలించి యిపుడు?
ఎడపక దీన నీ కేమి గూడెడిని?
సకలదీవుల నేలు జనపతి పుత్త్రిఁ
డకట చేరెఁడు నేల కర్హుండు గాఁడె?
* నీ వే మొనర్తు? పన్నిన ముని మాయ
నా వెంటఁ దతిగొని నలఁచి పో నీక,
పట్టి, యీగతి నేలపై నిడి కాలఁ
బెట్టి ప్రాముచు బుసపెట్టు చుండఁగ?
నని యిట్లు చాయగా నాడిన మాట
విని, హరిశ్చంద్రభూవిభుఁ డాత్మఁ గలఁగి,
తగ విచారించి, 'యీతరుణి నా పత్ని
యగు' నని, మనసు సయ్యన మగిడించి,
'గట్టిగా నెఱుఁగ కీగతిఁ దలం పేల
పుట్టె విశ్వేశ నా బుద్ధిలో?' ననుచుఁ,
బరితాప మంది యప్పడఁతి నీక్షించి
మరి పల్కెఁ 'జోద్యంపు మాట లాడెదవు!
నట్టేడు దీవుల నడు మెల్ల నేలు
పట్టభద్రునికూర్మి ప ట్టఁట బాలుఁ!

తతి = సమయము.

* 'నీ వేమి సేతు'

డామహీశుని దేవి వఁట! నీకు విత్త
మేమియు లేదన్న నెటు నమ్మవచ్చు!
నీ కెంత గలిగిన నిన్న దలించి
మాకుఁ గైకొనఁ రాదు మాడకు మిగులఁ.
జేకొని యేలిక చెప్పిన చొప్పు
గాక నీ పేదతికము నాకుఁ బొత్తె?
పాటలగంధి నీపలు కియ్యకొనఁగఁ
గాటిపాపని కేల కరుణ నీమీఁద?
లే కున్న, నా కిచ్చు లెక్కకుఁ జెల్లు
గైకొందు, నిమ్ము నీ కట్టిన మినుకు.'

—వీరదాసు హరిశ్చంద్రుఁ డని చంద్రమతి యెఱుంగుట.—

నావుడు; నుల్కి, యానాతి చిత్తమున
భావించి 'తన పతిభక్తి పెంపునను
బోడగాన రా దన్యపురుషుల కేరి
కొడిక మై నామెడ నున్న యీమినుకు.
ఇతఁడె, హరిశ్చంద్రుఁ. డిఁక నేమి శంక
మతిలోన.' ననుచు, నమ్మానవాధీశుఁ
డున్న దుర్దశకు బి ట్టుల్లంబు గలఁగి,
తన్నుఁ దా నెఱుఁగక ధరమీఁద వ్రాలి,
ధృతి నెట్టకేలకుఁ దెలిసి, 'హా! నాథ!
సతతదయాలోల సత్యసంశీల,
హా! హరిశ్చంద్ర! రా వయ్య; నీ పుత్త్రి

వట్టు=కుదురైన. పాటలగంధి=పాటలపుష్పమువంటి పరిమళము గలదానా. ఇయ్యకొనఁగఁ = అంగీకరించుటకు. కాటిపాపనికిఁ = వల్లకాటిలోని వానికి. మినుకు = తాలిబొట్టు తన=నాయొక్క. ఒడికము=మనోహరము.

లోహితాస్యునిఁ బద్మలోచనుఁ జూడు.
మందు నీతొడలపై ముదమున నిద్రఁ
జెందినగతి నేఁడు చిత్తంబు పొక్కఁ
బన్నిన చితిమీఁదఁ బడి దీర్ఘనిద్ర
నున్నాఁడు, మేల్కొనఁ డొకమారి యైన.
నాపుత్త్రరత్నంబు నాపాటుఁ జూడ
నోపక వచ్చి తా నున్నవాఁ డిచటఁ,
గాటిలోఁ గానని కన్నుల నన్న
చోట ని న్నిబ్భంగి శోకాబ్ధి ముంపఁ
దలఁచి మ మ్మిటుఁ దెచ్చి దైవంబు నీకుఁ
దెలిపెనే?' యనుచు, నద్దినకర కులుని
యడుగుల పై వ్రాలి, యశ్రువు లురలి
మడుఁగు గట్టఁగఁ జంద్రమతి విలపించె.—
'నో సార్వభౌమ, నీ వున్నయీమంచె
భాసుర రత్న సభా మంటపంబె?
పటు భూత బేతాళ పంక్తులు వీర
భట పరివారక ప్రకరంబె నీకుఁ?
బెను పొందు చితి వహ్ని భీకర శిఖలు
ఘనతర కరదీపికా సహస్రములె?
చదలఁ గ్రిక్కిఱిసిన శవ ధూమ పుంజ
మది భవ త్కేళి నీ లాతపత్త్రంబె?
శూల కీలిత నర స్థూల శిరోజ
జాలంబు లాఖేట సమయ చామరలె?

ఆతపత్త్రంబె=గొడుగా. కానని=మష్ముచూపని. శూల=కొఱుత–కలిత=దింపఁబడిన. స్థూల=పెద్ద–శిరోజ జాలంబులు=తల వెండ్రుకల మొత్తములు. ఆఖేట=వేఁట.

కర మర్థ నరశిరఃకఠినపాత్రములు
సరసత మంగళాచారకుంభములె ?
జ్వలన ప్రదేశ నిజ వ్యంజనములు
ధళధళ మను చిత్ర తాళవృంతములె?
ప్రజతండములు బరాబరి సేయ మత్త
గజములు నీవెంటఁ గదలి రా వేల?
మోజతోఁ బడివాగె నొప్పసాంబ్రాణి
తేజీలు నీవెంటఁ దిగిచి రా వేల?
వల నొప్ప దండెల వజ్రాల మించు
దోలఁకాడు చున్నయాందోళిక లేవి?
పసిఁడితీఁగల కీలుఁబంజాల డాలు
పస నైన ముత్యాల పల్లకీ లేవి?
యా తేజ మా రూప మా భుజాగర్వ
మా తెల్వి యా భాగ్య మా రాజసంబు
నెక్కడ నుడివోయె? నెక్కడ నడఁగె?
నెక్కడఁ దుద మొద లీసురవస్థ?
కక్కటా!' యని యేడ్చు నతివఁ జిత్తంబు
నొక్కఁ, గౌఁగిటఁ జేర్చి, భూవల్లభుండు
ముప్పిరి గొను మూర్ఛ మునిఁగి, యొక్కింత
తెప్పిఱి, ధైర్యంబు దిగజాఱఁ - దన్నుఁ
గప్పినపుత్త్రశోకంబున మునిఁగి,
విప్పారుకన్నుల వెస నశ్రు లొలుకఁ,

వ్యంజనములు=విసనకఱ్ఱలు. చిత్ర తాళవృంతములె=వన్నెలవిసనకఱ్ఱలా. బరాబరి=హెచ్చరిక. పడివాగె=స్వారిగుఱ్ఱపు సవరణ. సాంబ్రాణి తేజీలు=మేలుగుఱ్ఱములు. ఆందోళికలు = అందలములు. కీలుఁబంజాల=మగ దివటీలయు. డాలు=కాంతిని. ఉడివోయెఁ=క్షీణించి పోయెను.

గోడుకు రూపంబును గుణ విశేషంబు
నడుపును ముద్దును నగవుఁ దేజంబుఁ
బలుమాఱు నంకించి, పలవించు విభునిఁ
దెలుపుచుఁ జంద్రమతీదేవి పలికె.—
'భానుకులేశ, యీ పగిది నిద్దఱముఁ
బూని యేడ్చుచు నున్నఁ బొసఁగ దీమీఁద.
వివరింపు; మిదె ప్రొద్దు వేగుజా మయ్యెఁ,
గదిసిన చిమ్మచీఁకటి వెల్లఁబాఱె,
నినుఁ డుదయాద్రికి నేతేక మున్న
చన కున్న నేలికసానిచేఁ జావు.
చెప్పు మే తెఱఁగ? ' న్నఁ జింతించి, తగవు
దప్పక, నధిపుఁ డ త్తన్వి కిట్లనియెఁ.

—చంద్రమతి మాడ పాతికలఁ దేఁ బోవుట.—

'జెలువ యీబాలునిఁ జిచ్చునఁ ద్రోయ
వలసిన, నేలినవాని లాభంబుఁ
దప్పించి, సత్యంబు దప్పి, మోమోట
నిప్పని కియ్యకో నేరీతిఁ బొసఁగుఁ?
బొసఁగ వీ పలుకులు, వోయి ని న్నేలు
వసుధామరునిఁ గాంచి, వదలక వేఁడి,
వలయు మాడయు మఱి వాతిపాతికయు
వల నొప్పఁ గొని రమ్ము వడి నిట.' కనినఁ;—
దన ప్రాణనాథు సత్యవ్రతంబునకు
మనమున నలరి, యమ్మహిపతి కాంత
తనయు నక్కడఁ బెట్టి, తగ నప్పగించి,
మనుజేశునకు మ్రొక్కి మసలక మరలి,

ఱంకించి = పొగడి. వివరింపుము = విచారింపుము.

—కౌశికుఁడు చోరుని సృజించుట.—

పురవీథి నేఁగునప్పుడు;—కౌశికుండు
తరలాక్షిఁ జంపింపఁ దలఁచి, యా క్షణమె,
మెఱపు వెండ్రుకలును మదరు మీసములుఁ
గఱకు నల్లని మేనుఁ గల చోరు నొకనిఁ
దడయక పుట్టించి, ధాత్రీతలేశు
పడఁతిఁ జంపింప నుపాయంబుఁ గఱపి,
పోరిఁబోరిఁ బొమ్మన్నఁ; బోయి, తలాక్రవి
చిర ముండ్ల బంతియు సెలకట్టె కత్తి
బలపంబు భ్రమరాలఁ బట్టిన క్రోవి
యొలికి లోపలి బూది యొగి మైల మందు
మఱునీలికాసెయుఁ గొంకి నారసము
నెఱపు గాఁ బూని వాఁ డుక్కున నేఁగి,

—చోరుఁడు కాశిరాజ శిశువుం జంపి నగలం గొనుట.—

యా వారణాసిపురాధీశు నగరు
వావిరిఁ గన్నంబు వడి వేసి చొచ్చి,
మిసమిస మనుచుఁ గ్రొమ్మెఱుఁగులు వాఱు
పసిఁడికుండల మేడపై, నంద మైన
తూఁగుటుయ్యెలలోనఁ దొలుకారు మెఱుగుఁ
దీఁగబాగున నొప్పి దీపించు దాది
చెలువ మై మించిన సిబ్బెంపుగబ్బి
వలుఁదపాలిండ్లలో వదనాంబుజంబు
గదియ నిద్రించు చక్కని రాచపట్టిఁ

భ్రమరాల క్రోవి = దీపముమీఁద పడు పురుగులు గల గొట్టము.
ఒలికి = సొద.

* గదలక మెదలక కాలితో నూఁది,
కుదియంగ వెసఁ బట్టి, కుత్తుకఁ బిసికి,
తోరంపుదివియలతో మాఱు మండు
హీర మణీ శోభి తాభరణములఁ
గళవళం బందక కైకొని పోయి,

—.చోరుఁడు ఆనగలను చంద్రమతి కిచ్చుట.—

మలఁగుచు నాచంద్రమతి సనుదెంచు
తెరువున కడ్డంబు దిగ్గన వచ్చి,
గరువంబు మీఱఁ, దస్కరుఁ డిట్టు లనియె.—
'నీ వేళ నీ వెంట నెవ్వరు లేక
† యీ వేల నీరీతి నేఁగెద వొంటి?
నలుగక చెప్పు మె. మ్మ'న్న;—జిత్తమునఁ
గలఁగుచు నిలిచి, యక్కమలదళాక్షి
వెగచి, యేడ్చుచుఁ, దన వృత్తాంత మెల్లఁ
దగఁ జెప్పుటయు;—లేని దయ దాల్చి వాఁడు—
'నా చెల్లెలవు నీవు నలినదళాక్షి,
యీ చందమునఁ గుంద నేల కో. మ్మ'నుచుఁ,
బన్నుగాఁ దనచేతి పసిబిడ్డ తొడవు
లన్నియు ముడి గట్టి యం దిచ్చునంత;—

—, రాసుతుని మృతిని దాది చేటికి తెల్పుట.—

దాది మేల్కని, రాచతనయునిఁ గాంచి,
మదిలోన శోకంబు మానక యపుడు

తోరంపు = పెద్ద. కళవళంబు=కలవరము. మలంగుచుణ్ = తిరుగుచు. తొడవులు=నగలు.

---

* 'కాలున.' † 'నీ వేల'

చనుదెంచి, యంతయు జననాథునకును
వినిపించినను;— గడు విస్మయంబంది,
కడువేగమునఁ బుత్త్రికడకు నేతెంచి,
కడఁకతోఁ దనదు దుఃఖము వెల్లి విరియఁ,
'గొనకొన వీనిని గుదియంగఁ బట్టి
వనరంగఁ జంపినవాఁ డెవ్వఁ?' డనుచు,
వల నొప్పఁగాఁ దలవరులఁ బిల్పించి,
వెలయు వారలకు స్వవిధ మెఱిఁగింప;—

—.రాజునానచే తలారులు దొంగను వెదకుట.—

మెఱుఁగుఁగైదువుల క్రొమ్మెఱుఁగులు దిశల
* నిఱిసినచీఁకట్ల నెడలంగ జడియ.
కాలకింకరుల బింకపుఁ దలవరులు
కోలదివ్వెలవారిఁ గొంచు నవ్వీథిఁ
'బదపదఁ డిదె దొంగపదపంక్తి చొప్ప
వదలకుం డని రాఁగ; వారికి మున్నె

—.దొంగ చంద్రమతిని పట్టిచ్చుట.—

దొంగ నాచేతికి దొరకె, మీ రేల
వెంగలులై జాడ వెదకెద?' రనుచు,
వడిఁ జోరకుఁడు తలవరులలోఁ గలసి,
తొడిఁబడఁ గృప మాలి తోయజనేత్ర
† పెడకేలు బిగఁ గట్టి పెలుచ నందంద

వెల్లివిరియఁగ=ఉబుకఁగా. వనరంగ=విలపింప. ఇఱిసిన = దట్టమయిన. ఎడలంగ=తొలఁగిపోవునట్లు. జడియఁగ=భ్రోయఁగా. వెంగలులై=వెఱ్ఱివారై.

* 'నెఱసిన' † 'బిగఁబట్టి' 'సమ్ముఖమునఁ బెట్టి'

పిడికిళ్లఁ బొడుచుచు బిట్టు తిట్టుచును,
బ్రిదులక గొనిపోయి, భీషణుం డనెడి
మొదలి తలారి సమ్ముఖమునఁ బెట్టి
నూడిద పట్టి, తా నరిఁగె నా చోరుఁ.

—తలారి చంద్రమతిం గాశిరాజు మ్రోలం బెట్టుట.—

డప్పుడు భీషణుం డా చంద్రమతిని
నిప్పులు గన్నుల నిగుడ నీక్షించి,
కోఱమీసము నుల్చికొని, 'తన బారిఁ
బాటి పో మ్మ'నుచు, నుద్భటవృత్తి లేచి,
జంకించి చేవాలు జళిపించి, ప్రేయు
నంకించి, శంకించి, 'యువిద వధించు
రట్టు నా కేటికి? రాజు ముందఱనె
పెట్టెదఁ గా. క'ని, పేరోలగమునఁ
* గొడుకును బలవించుకొను మహీపాలు
కడ నిల్పి, నవరత్న కాంతుల మించు
తొంగలించెడు వాలు తొడవుల మూట
ముంగల నిడిన;—'హా! ముద్దుల పట్టి!
హా! కుమారక!' యంచు నట వక్షమందు
డాకొన నొత్తి నేత్రముల నందంద
తొరఁగు నశ్రులఁ దొప్పదోఁగి, శోకాగ్ని
నెరియుచు, విలపించు, చెట్టకేలకును

బ్రిదులక = తప్పించుకొనకుండునట్లు. నూడిద=కానుక. కోఱమీసము = పెద్దమీసము. తనబారిక్ = నామ్రోలనుండి. జంకించి = బెదిరించి. తొంగలించెడు=వ్యాపించెడు. డాకొనక్ = కదియునట్లు.

* 'కొడుకుకుఁ'

గొంత ధైర్యము దెచ్చుకొని, హరిశ్చంద్రు
కాంతాశిరోమణిఁ గనుఁగొని, పలికెఁ.—
"గటకటా! నిన్ను నెక్కడి దురాత్మకుఁడు
కుటిలుఁడై యిటు సేయఁ గోరి ప్రత్తెంచెఁ?
దొడవులకై కెంపుతోఁ బ్రాణములకుఁ
దొడికి ముద్దులపట్టిఁ దునుమ నేమిటికి?
నను వేఁడుకొనిన నింతకు మేలి మైన
వినుతభూషణములు వెలఁది నీ కిడనె?
సుకుమారు నత్యంతసుందరాకారు
నకట! చంపఁగఁ జేతు లాడెనే నీకుఁ?
'బురుషులకంటె నెప్పుడు నాలుగుణము
లరయ సాహస మెక్కు డతివల క'నిన
యమరిన నీతివాక్యము నిజ మయ్యె.
రమణిరో దానవురాలవు గాక!'

—. కాశిరాజు చంద్రమతికి శిరశ్ఛేదము విధించుట .—

* యని చాలఁ గోపించి, యప్పు డా భూపుఁ
డనుమాన మేల? చయ్యన ధర్మ మెన్న,
దీనితో భాషింప, దీనిఁ గన్గొనిన,
† నూనుఁ బాతక. మ'ని, యుల్లంబులోన
నంతంత నడరు శోకావేశమునను
వింతగా 'భీషణ విను' మని పలికెఁ.—
'§ బడఁతుక నాక నాపట్టి పాదముల
కడ నిల్పి యీ బాలఘాతిక శిరము

తొడికి = ఒడసిపట్టి. అడరు = వ్యాపించు. నాక = అనక.

*'యప్పుడా రాజు । ననుమాన' † 'మని యుర్వీశుఁడాత్మ' §'బడఁతుక నాకన్న'

వేసఁ ద్రుంపు మని చెప్ప వీరబాహునకు.
మసలకు; మిదియె ముమ్మాటికి సెలవు;
'హా!మ్మ'న్న ;— నప్ప డాభూపాలుఁడేమి
* 'ముమ్మరంబుగ మది ముప్పిరిఁ గొనెను
వగపు లన్నియుఁ బాయు వర మిచ్చె దైవ.
† నగల నేటికిఁ జావ' నని తలపోసి,
తల వాంచి, తన కల్లతనము దీపింప,
నిలిచి యూరక యుండె నేల వ్రాయుచును.
పోఁడిగా నత్తఱి భువనముల్ వొగడ
నేఁడు హరిచంద్ర నృప శేఖరుండు
శ్రీకర నిజ రాజ్య సింహాసనంబు
నీ క్రియ విలసిల్ల నెక్కె నన్నట్లు
లాలిత నిజ మండల స్ఫూర్తి మెఱయ
బాలభానుఁడు తూర్పు పర్వతం బెక్కె.

—చంద్రమతిని వధ్యభూమికిం గొనిపోవుట.—

నంత నాభీషణుఁ డను తలారియును
బంత మేర్పడఁగ నా భానుకులేశు
కాంతఁ దోడ్కొని పోవఁగా, రాజవీథి
నంతంత డగ్గఱి యా పౌరసతులు
గమి గూడి చూచి, 'యక్కట! దాది చన్ను
నిముక నేరని చిన్ని నెత్తురుఁ గందు
బంగారువంటిపాపని మెడఁ బిసికి,
త్రింగ నెచ్చటనుండి మృత్యు వై వచ్చె!

ముమ్మరంబుగన్=అధికముగా. అగలన్=దుఃఖింప. నిముకన్=కుడువ.

* 'ముప్పిరి గొనఁగ' † 'నేటికిఁ జావు కని.'

నాఁడుదొంగలు దఱ చైరి పో భువిని!
బోఁడిగా బిడ్డలఁ బొరుగిండ్ల నుంచి
నిదుర వోవఁగఁ బాసె నేఁటితో మనకు.
నిది మహాపద పుట్టె నీపట్టణమున.
వదలక నిటువంటివారికి నెల్ల
బెదరుగా దీనిఁ జంపినఁ గాని పిదప
ధాకగా. దనువారు; 'తగ దాఁటదాని
నే కల్ల సేసిన నిటు పట్టిచంప;
నాలికి ద్రిప్పుచు మేన నొక చోటు గోసి
తలఁగి పొమ్మందురు తనభూమి వెడలి.
యీ లోకకల్యాణి కీ మానవతికి
నే లీల నీ నింద యొసఁగెనో కాని,
పరికించి చూడ నేపట్టున నైన
బరమాణు వంతపాపము గాన. మిన్నఁ
దులుకుచు దొంగ దా నొకచోట నుండు,
నెలయు నవిశ్వాస మొకచోట నుండు.
నాఁటదానికి వశ మమ్మ యీ మేటి
కోటలు దాఁటి, యీ గోడలు దాఁటి,
తాళంబు లెడలించి, తలుపులు దెఱచి,
కేళిమై రొప్పు జాగిలముల మొఱఁగి,
దాది వాకట్టి, భూతలనాథుపట్టి
నాదట నీరీతి నఱ్ఱొత్తి చంప?
నూహింప, నెవ్వాఁడో యొకకన్నగాఁడు
సాహసంబునఁ బోయి, చంపి, యీ తొడవు

ధాక = అడలు. అవిశ్వాసము = అపనమ్మకము. అచటక్క = అక్క-ఱతో. అఱ్ఱొత్తి = మెడ పిసికి.

లనువొందఁ గొనిపోక, నంత నారికులు
తనఁగూడ ముట్టినఁ దరలాక్షి మీఁదఁ
జొప్పు పుట్టంగ నా సొమ్ములు వైచి,
తప్పించుకొని పోయెఁ దనప్రాణభీతి.
నేరము దనమీఁద నెగసిన, లజ్జ
గూరి, భూపాలుని కొలువులోపలను
నిలిచి భాషింపఁగ నేరక చాక
నలుగక చనుమన్న. ద'నువారు గొంద;
‘ ఇది బాలఘాతకి యెద నెన్ని మాప
నిది వధూవధ, దీన నెట్లాడ నెట్లొ?
దోష మేవెంటను దొడరదునూ? చనదు
దూషింప భూషింపఁ దుది నెంతపట్టు?
తప్పును నొప్పును దైవ మెఱుంగు.
నొప్పు నూరక చూచు చుం.' టనువారు.
పలువు రీగీతిని బలుచందములను
బలుకంగ, నా వీరబాహునికడకు
వదలక కొనిపోయి, వసుధేశుఁ డాత్మఁ
జెదరక మును మూఁడు నెలవుల నొసఁగి
యాన తిచ్చినచంద మంతయుఁ దెలియ
వానికిఁ జెప్పి, యవ్వనజాక్షి నపుడు
బెడిదంపు బావురుఁ బిల్లివాతికిని
దొడిఁబడ రాచిల్కఁ ద్రోయుచందమునఁ
దగ నప్పనము సేసి, తలవరుల్ దాను
మగిడి భీమణుఁ డేఁగె మనుజేశుఁ గొలువ.
వీరబాహుండును విభునాజ్ఞ సేయఁ

చొప్పు=గుర్తు.

గోరి చయ్యన నతిక్రూరవర్తనులఁ
గ్రొవ్వాఁడి మృత్యువు కోఱలఁ బోలి
మవ్వంపు మెఱుఁగులమాడ్కి మేలైన
బిత్తరంబులు సిమ్ము బెడిదంపువాలుఁ
గత్తులు గల భయంకరులఁ కింకరుల
వీక్షించి, 'మీ రెల్ల వెసఁ బ్రేతభూమి
కక్షీణగతి నేఁగి, యచ్చోట నున్న
వీరదా సను నెఱవీరునిచేతి

—చంద్రమతిని వధింప వీరదాసుని నియమించుట.—

కీ రమణీమణి నిచ్చి, చంపింపుఁ
డ'నుటయు;—వార లయ్యతివఁ దోడ్కొనుచుఁ
జని, వీరదాసునిసన్నిధి నిలిపి,
పతియానతియు వీరబాహునిపంపు
నతిచిత్రముగఁ జెప్ప;—నది విని యలికి,
వెఱఁ గంది 'బాపురే! విధిచేఁతఁ గడవ
నెఱవాదు లెవ్వరు నిఖిలలోకముల!
నేఁటితోఁ గడముట్టెనే కౌశికుండు
గాటంబుగా సల్పు కపటనాటకము!
వెఱచినవానిని - వెన్నిచ్చి యోడి
పఱచినవానిని - భయమునఁ బూరి
గఱచినవానినిఁ - గైదువుఁ బూన
మఱచినవానిని - మఱి దిక్కు లేక
మఱుగుఁ జొచ్చినవాని - మదిలోనఁ గరుణ

మవ్వంపుమెఱుఁగులమాడ్కిన్ = కోమలంపు మెఱపుఁ దీఁగలవంటి. బిత్తరంబులు = ప్రకాశములు. బెడిదంపు = భయంకరమైన. వాలుఁగత్తులు = వాఁడికత్తులు. అలికి = భయపడి.

నెఱయఁ బ్రోచుట నాకు నియమవ్రతంబు
పరికింప నిట్టిచో బడలిన యబలఁ
దెరలక ఘోరాసిఁ దెగ వ్రేయు మనుము,
నాకడ కంపించినాఁడు నా సామి.
నా కేల వగ పన్న? నాకేలు సాఁగ
దీ కీడుఁ గావింప. నిది తప్పఁ ద్రోవ
యే క్రియ గల? దింక నేమి సేయుదును?
సుతుని దగ్ధ్మప్రతికి నేడ్చుచు నసతీమూర్తి
* నతిఁ గృపాణాహతిఁ జంపఁ బాలైతి.'
నని యశ్రు లొలుక మోమున వాంచి యున్న
నను జేకొనకుఁ జంద్రమతి యిట్టు లనియె.—
'నిజకులాధీశ నీ వెఱుఁగని యట్టి
వినుతధర్మంబులు వే ఱొండు గలవె?
మున్న స్వామిద్రోహి మోసలే ననుచుఁ
బన్నగతల్పుతోఁ బలికె భూదేవి.
తన్ను మోచినచోటఁ దగ వట్టి పెట్టి
మిన్నక సురిఁగిన మెత్తురే జనులు?
ఈ పురీశ్వరుఁడు ని న్నేలిన సామి
† యీపని విధియించి. ఇది గాక, నాథ
§ రూడిగా రాకుమారునిఁ జంపె ననెడి

తెరలక = వెనుదివియక. ఘోర అసిన్ = భయంకరమైన కత్తిచే. తప్పద్రోవ = తప్పనట్టి యుపాయము. పన్నగతల్పుతోడన్ = శేషుఁడు పఱుపుగాఁ గల విష్ణునితో. మోచిన = సంబంధించిన. తగవు = ధర్మమును. రూడిగాన్ = గట్టిగా.

* 'జంపఁ బాలయ్యె' † 'విధియించె నిది' § 'రూఢిగా' అని కొన్ని ము 'రూఢి'కి వైకృతము 'రూడి'; శబ్దరత్నాకరమును చూ. 'సీ. రూడి నెన్నిక గన్న నాఁడెంపుఁదెలుఁగంటి చిగురాకుఁ బోఁడులఁ జెఱలు దెచ్చి.' అన్న ఆ. రామా.

యాడిక తలఁ గూడె, నభిమాన మెడలె.
నటు గాన ననుఁ జంప నర్హ మీ వేళ.
కటకటా! నీ వేల కరుణ దాల్చెదవు!
తక్కిన నీచవర్తనులచేఁ జావ,
కిక్కడ నా జీవితేశుఁడ వైన
నీచరణంబులు నెమ్మితోఁ గొల్చి,
నీచేత మృతిఁ బొంది, నీ పొందు మీఁద
నే పొందఁగాఁ గందు. నెట్టి సౌఖ్యంబు
లీ పొందు గా. వింక నెడ సేయ నేల?
నరులును మునులుఁ గిన్నరులును సురలు
నరు దంది యిందును నందును బొగడఁ,
దల ద్రెంపు. మ'ని తెంపు దలకొనఁ బలికి,
జలజాక్షి తనచీర చక్క నమర్చి,
ప్రాణేశు వలగొని పదముల కెఱఁగి,
పాణిపల్లవములు భక్తితో మొగిచి,
యనుదిన రక్తపంకారుణం బగుచుఁ
గనుపట్టి జేవురుగట్టు చందమున
నున్న యా వధ్యశిలోపరిస్థలిని
జెన్నారి, చిఱునవ్వు సెలవిఁ దళ్కొత్తఁ,
బద్మాసనంబునఁ బడఁతి గూర్చుండి,
పద్మినీవల్లభుపైఁ జూడ్కి నిలిపి
' లోకలోచన, సర్వలోకైకవంద్య,
నాకు వేవేల జన్మంబులయందు

ఆడిక=నింద. ఏపు ఒందగాఁ=అతిశయముగా. ఇందును నందునుఁ=ఇహపరములందు. వలగొని = ప్రదక్షిణించి. ఎఱఁగి=నమస్కరించి. పద్మినీవల్లభు=సూర్యుని.

సతతపుణ్యుని హరిశ్చంద్ర భూవిభునిఁ
బతిగా నొసర్పు. మీ పార్థివేశ్వరుని
యాపద లన్నియు నడఁచి, సత్యంబు
దీపింపఁ జేయు మే తెఱఁగున. నను,
వినయంబు నెక్కొన వేఁడి చిత్తంబు
తనపతిపైఁ జేర్చి, తలఁ పొందు లేక
యున్నంత బంధంబు లూడ్చి పో వైచి,
యున్న రేఁద్రుఁడు జగదాశ్చర్య మెసఁగ,
బహు సరి త్సాగర పర్వత ద్వీప
మహిత మహీమహీమండల భార
మురుతరఁ లీలఁ గేయూర విభాతి
భరియించు నపసవ్య బాహుదండమున
సకల విరోధి రాజన్య కోటీర
నికర కీలిత మణి నికషణ దీప్త
శాత ధా రాభీల చటుల ఖడ్గంబు
భూతముల్ భీతిల్ల ముష్టి సమర్చి,
చండ మార్తాండ దుస్సహ దుర్నిరీక్ష
మండలప్రభలతో మానొక్కని మండు
మెఱుఁగు లుగ్రంబుగా మిన్నులఁ బర్వ
నొఱ వాయఁ బెఱికి, మహోగ్రతఁ బూని,
జళిపించి, జీవితేశ్వరి మెడ మోపి,
కలఁగక తెగ వ్రేయ గమకించునంతఁ;—

బంధంబులు=తగులములు. కేయూరవిభాతిన్=బాహుపురివలె. అపసవ్య=కుడి. కోటీర=కిరీట. నికషణ=ఒరయికచేత. దీప్త=మెఱుఁగెక్కిన. శాత=వాఁడి-ధారా=వాదరచేత-ఆభీల = భయంకరమైన. ముష్టిన్=పిడికిట. జళిపించి=ఆడించి.

—. విశ్వామిత్రుఁడు ఎడ సొచ్చుట. —

బ్రహ్మలు నెడ సొచ్చి ఖడ్గంబుఁ బట్టి
యమ్మనుజేశుతో ననియెఁ గౌశికుఁడు.
'చాలు! మోహహా! యిట్టి సాహసకృత్య
మేల కైకొంటివి? నరేశ్వర, నిన్ను
వీక్షింప దోషంబు, విచరింప మనుజ
రాక్షసుండవు గాక, రాజవా నీవు?
వాలువైరులమీఁదఁ వాలు నీ వాలు
వాలుఁగంటులఁ ద్రుంప వాలె యీ వాలు?
భామలఁ జంపఁ బాపము లేదటంచు
నేమించెనే మున్ను నిను వసిష్ఠుండు?
క్రమమున ధర్మార్థకామమోక్షములు
నమరు నీకుఁ దగునట్టి యీ సాధ్వి
జననుత సౌందర్య సంశోభితాంగి
నినుపముల్కికి నేల యీఁ దలంచెదవు?
భువనవిఖ్యాతమై పొలుపొందునట్టి
రవివంశమునఁ బుట్టి రాజసం బుడిగి
బతిమాలి వెనుమాలబంటవై నీచు
గతిఁ గాడు గాచె. దీ కష్టంబు దగునె?
కులసతితలఁ దెగఁగొట్టి యేలోక
ముల కేఁగి సౌఖ్యంబుఁ బొందఁ జూచెదవు?
ఆలికై దత్తుని నడఁపఁడే శివుఁడు?
పాలింప నీకంటె బుద్ధిహీనుండె?

విచరింపన్=విచారింపఁగా. వాలు=అతిశయించుచున్న. వాలు నీ వాలు=పడునట్టి నీకత్తి. వాలుఁగంటులన్ = విశాలాక్షులను - స్త్రీల ననుట. వాలె=వాఁడియా.

సతి లేని గృహ మేల? సౌఖ్యంబు లేల?
సతి లేని సుతు లేల? సంపద లేల?
సతియుఁ గల్గినఁ గల్గు సకలధర్మములు,
సతియుఁ గల్గినఁ గల్గు సకలపుణ్యములు,
సతి గల్గినను గల్గు సత్పుత్త్రిచయము,
సతి గల్గినను గల్గు సద్గతిత్రోవ.
అటు గాన విడువు మీ యాగ్రహబుద్ధిఁ.
గటకటా! నీ వివేకం బెందుఁ బోయె!
నా బుద్ధి వినక నందను జంపుకొంటి,
నా బుద్ధి వినక నీ నాతి నమ్మితివి.
మాను మీ గుణ మన్న, మానక దురభి
మానంబె పెంచెదు మానవాధీశ.
నామాటఁ గైకొని నాకొమారితల
నా మాల మగువల నర్ధి కరింపు.
నీ సుతుప్రాణంబు నీ రాజ్యసుఖము
నీ సతితోఁ బొందు నీ తొంటి పెంపుఁ
బడయుము మీ వింక. నీపదను దప్పినను,
గడపట నీవు తెక్కలిఁ జత్తు. వనుచుఁ ;—
వెక్కసందమ్ములఁ బ్రియమును భయము
నెక్క బోధించు మునీంద్రునిఁ జూచి,
పకపక నవ్వి; 'యీ భవసాగరంబు
నొకదరిఁ జేర్చుచు నున్నాఁడు శివుఁడె.
యితరునివలె నది యిది యని కాని
గతులు నీచేతఁ దార్కాణింపఁబడెను.
రాసి నీ కెను రుత్తరంబులు పల్క

పదను = సమయము. తెక్కలిక = వంచనచే రాసిక = మొత్తమునకు.

నా సరోజాక్షుండు నలుకు. నే నెంత?
మును నీవు చెప్పిన బుద్ధులె కాక,
ఏనఁ గ్రొత్త లేడివి వివరించి చూడ?
వీరబాహునిమది విశ్వాసఁ మొదవఁ
గోరి నేఁ జేసినఘోర ప్రతిజ్ఞ
మఱచి, సత్యము మట్టుపఱిచి, లోలోన
* జరిగి పో నిత్తునె స్వామికార్యంబు?
సుతు నొల్ల, సతి నొల్ల, సురలోక మొల్ల,
బతిమాలి నీ విచ్చుపడఁతుల నొల్ల.
సత్యంబు గలిగినఁ జాలు. వేయేల?
సత్యమే జయ మని చాటు వేదములు.
విడువు ఖడ్గం బింక. వేంచేయు మిట్టి
యెడ నుండఁ జనదు మునీశ, నీవింక.'
నావుడు;—వెఱఁ గంది నరలోకనాథు
పావన సత్య సంపద కాత్మ నలరి,
బొంకించునాసలఁ బో వీడి మాని
పొంకంబు చెడి తలపోయుచు నుండె.

—కత్తి చంద్రమతిమెడను పూమాల యగుట.—

నప్పుడు దేవత లంబరవీథి
నుప్పొంగి వేడ్కల నువిదలుఁ దారు
బహురత్న దీప్తుల భాసిలుచున్న
మహనీయదివ్యవిమానంబు లెక్కి,
వెఱఁ గంది క్రందుగా వీక్షించుచుండ;
నెఱతెంపుమై ధారుణీతలేశ్వరుఁడు

సరోజాక్షుండు=విష్ణువు.

* 'బఱిపిపోనిత్తునె' అని యుండనేమో? బఱటి = సైఁగగా గోఁకి.

భిదురంబుఖంబెను బెడిద మై చదల
నదరులు సెదర భయంకరలీల
వాలు వా లెత్తి యా వామాక్షికంఠ
నాళంబు తెగ వ్రేయ నది కలు కన్నక
తాఁకినవ్రేటు పూదండ యై చెన్నుఁ
గైకొని పూఁబోడి గళమున నున్నఁ;
దల యూఁచి, సతిఁ జూచి తనకేలి కత్తి,
ధళధళ మను ఖడ్గధార వీక్షించి,
‘ గారి దప్పెనో? కాక, ధవళాక్షి కిప్పు
డీ రీతి కౌశికు నింద్రజాలంబో ?
వా తప్పినదో? చేతివడి దప్పి చనెనో?
మాత యీతోయ మీచోద్య? మీలీల
నసి పోవ వచ్చునా యసి పోక?’ యనుచు,
వెసఁ బూన్చి మఱియును వ్రేయఁ జూచుటయు;—

## —. విశ్వనాథాదులు ప్రత్యక్షమగుట. —

శ్రీవిశ్వనాథుఁ డాశ్రితపారిజాతుఁ
డా వేళఁ గరుణ నిండారుచిత్తమున
వడి గొని మూఁడుస్రోవలఁ బాఱు నేఱు
తొడరి కెంజడలలోఁ దుంపురుల్ గురియఁ,
జిన్నగా నొదలఁ జేరిన మించు

భిదురంబు=వజ్రాయుధము. బెడిదము=భయంకరము. చదలన్=ఆకాశమునందు. అదరులు=మిణుంగురులు. గళమునన్=మెడయందు. వా=కత్తివాదర. ఈతోయము=ఈమాయ. అసిపోక=కత్తియొక్క గతి. అసిపోవ వచ్చునా=గురి తప్పి పోవచ్చునా. మూఁడుస్రోవలఁ బాఱు నేఱు=గంగ.

క్రొన్నెలతళ్కు చకోరాళిఁ బిలువ,
నఱక పువ్వులవిల్తు నొకజుత్తుఁ గొన్న
చుఱుకుచూపులకన్ను చోద్యమై మెఱయఁ,
దనర నేనుఁగుమోము తనయునిఁ గన్న
వనజాక్షి దాపలివంక శోభిల్ల,
మేలి మువ్వన్నెల మెకము మైతోలు
చేలఁ గట్టినకాసెచెఱఁగు దూలాడఁ,
బోఁడిగా మెఱుఁగులపోల్కి దీపించు
మూఁడుముల్కలవాలు ముష్టిచే నమర
వెస ఖణిల్లున ఱంకె వేసి కుప్పించు
బసవరాయని నెక్కి, పార్శ్వభాగమునఁ
బాలును నీరు నేర్పఱుచువాహనపు
వేలుపు డగ్గఱి వింజామ రిడఁగఁ,
దివిరి నెమ్మదిఁ దూర్పు దెస నేలురాజు
ధవళాతపత్రంబు ధరియించి నడువ,
ముట్టి వేల్పులఁ గొట్టి మొనసినబిరుదు
పట్టెంబువీరుండు పడవాలు గాఁగఁ,
గిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగవరులునుఁ బ్రమథులుఁ గొలువ,
శుక కుంభసంభవ సుబల కణ్వాది
సకల సన్ముని గణ సంస్తుతు లెసఁగ,
ననుపమ భూతి లిప్తావదాతాంగ

మువ్వన్నెల మెకముతోలుచేలక = పెద్దపులితోలు వస్త్రముతో. పాలు... వేలుపు=హంసవాహనుఁడైన బ్రహ్మ. బిరుదు పట్టెంబు వీరుఁడు=గొప్ప కత్తిగల జోదగు కుమారస్వామి. పడవాలు = సేనాపతి. కుంభసంభవ=అగస్త్య. అవదాత=తెల్లని.

జనిత నిర్మలకాంతి చంద్రికవలన
నయ మార నఖిల విజ్ఞాని విశాల
నయనోత్పలముల కానంద మెసంగఁ,
బరమయోగీంద్రులు భావంబునందుఁ
బరికించి కానని పరమాత్మమూర్తి
యావేళఁ దనకుఁ బ్రత్యక్షమై 'సైఁపు
భూవర.' యనిన;—నద్భుతముఁ దత్తఱము
భయము సంభ్రమమును భక్తియు నయముఁ
బ్రియమును బెనఁగొనఁ, బెల్లుగా మేనఁ
బులకలు గొబ్బునఁ బొడమ, నానంద
కలితాశ్రుకణములు గన్నులఁ దొరఁగ,
నవనిఁ జాఁగిలి మ్రొక్కి, యడుగుల కెరఁగి,
సవినయంబుగఁ గరజలజముల్ మొగిచి,
'కాలకంధర, లయకాలాగ్నిరుద్ర
కాలసంహార, మహాకాళీనివాస,
వాసుదేవప్రియ, వాసుకివలయ,
వాసవార్చిత, కృత్తివాస, మహేశ,
నాగశోభితమస్త, నాగాసురారి,
నాగ నాగాంతక నాగేంద్ర వంద్య,

చంద్రిక = వెన్నెల. కాలకంధర = నల్లని కుత్తుకగలవాఁడా. కాలసంహార=యమునిఁగొట్టినవాఁడా. వాసవార్చిత = ఇంద్రునిచేతఁ బూజింపబడినవాఁడా. కృత్తివాస=తోలువలువవాఁడా. నాగశోభితమస్త=పాముచే ప్రకాశించుచున్న శిరముకలవాఁడా. నాగాసురారి=గజాసురుని శత్రువా. నాగ నాగాంతక నాగేంద్రవంద్య=పాములకును ఆదిశేషునికి గరుడునికిని వాసుకికిని వందింపఁదగినవాఁడా.

కమలాసనస్తుత్య, కమలాప్తనేత్ర,
కమలారి సురసరిత్కమలకపర్ది
గిరిశరాసన, రౌప్యగిరి శృంగనిలయ,
గిరికన్యకాప్రియ, గిరిభేది జనక,
వేదమస్తకముల వెలయునీదివ్య
పాదపద్మములు నా ఫాలంబు సోకఁ
నరయఁ గృతార్థుండ నైతి లోకముల,
దురితంబు లన్నియు, దొలఁగింపఁ గంటి.'

—.శివాదులు వరము లిచ్చుట.—

నని పెక్కుభంగుల నభినుతి సేయ,
జననాథువలనఁ బ్రసన్నుఁడై శివుఁడు
'రాజేంద్ర, నీవంటిరాజు నాయేలు
నీజగంబులలోన నెవ్వఁడు లేఁడు.
మేలు నీసత్యంబు! మేలు నీతెంపు!
మేలు నీధైర్యంబు! మెచ్చితి. నడుగు
వరము లే మంట, వేఁడు వలసిన' దనుచుఁ,
గరమున మే నంటి గారవం బమరఁ

కమలాసనస్తుత్య = బ్రహ్మచే స్తోత్రము సేయఁదగినవాఁడా. కమలాప్తనేత్ర = సూర్యుఁడు కన్నుగాఁగలవాఁడా. కమలారి = చంద్రుఁడును - సురసరిత్కమల = గంగానది తామరలును - అనువాని తోడి - కపర్ది = జటాజూటముగలవాఁడా. గిరిశరాసన = కొండయే విల్లుగాఁగలవాఁడా. రౌప్యగిరిశృంగనిలయ = వెండికొండశిఖరము వాసస్థానముగాఁగలవాఁడా. గిరిభేదిజనక = క్రౌంచపర్వతమును భేదించిన కుమారుని తండ్రీ. వేదమస్తకములన్ = వేదశిరస్సులగు నుపనిషత్తులందు. జననాథువలనన్ = రాజునందు. ఏమి అఁట = ఏమికావలసినను.

కలకంఠములచాయ గల తనకూర్మి
కలకంఠివంకకై కడకంటిచూపు
నిగిడించుటయు, సిగ్గు నెక్కొని విభుఁడు
* మొగము వ్రాలఁగ వైచి మునుకక యున్న;
వానితలంపు భావంబున నెఱిఁగి
యానీలకంధరుం డనియె నవ్వుచును:—
'సోదల నీఱలఁది, యచ్చుగఁ దోలు గప్పి,
పాదివి నిచ్చలు బహుభూతముల్ గొలువ,
నీ వల్లకాటిలో నిటువిహరింప,
నావంటివాఁడ వైనాఁడవు నీవు.
ఇది గాధిపుత్త్రు మహేంద్రజాలంబు.
విదితంబు గా నీకు వివరింతు వినుము.
మసనంబు గాదిది మఖశాల గాని,
యెసఁగు శల్యములు గా యిధ్మముల్ గాని,
పడినపుర్రెలు గావు పాత్రలు గాని,
యడరునెత్తురులు గా వాజ్యంబు గాని,
మొలయుకొర్వులు గావు యూపముల్ గాని,
తలవెండ్రుకలు గావు దర్భలు గాని;
వెఱవక నిన్నేలు వీరబాహుండు
మఱియుఁ గాలుఁడు గాని మాలఁడు గాఁడు,
వినుము నీకూర్మి దేవిని నేలువాఁడు
కలఁగక కపటమార్గమునఁ జరించు

కలకంఠ=కోకిలముల. కలకంఠి=మధురవాణి-సుందరి యనుట. మునుకక = ఉత్తరము చెప్పక. సొదలనీఱు = చితియందలి బూడిద. మసనంబు=వల్లకాఁడు. మఖశాల=యజ్ఞశాల.

* 'మునుకుచునున్న.'

కలిరాజు గాని తాఁ గాఁడు బ్రాహ్మణుఁడు.
మతి నింక నీ కనుమాన మేమిటికి
ధృతిఁ జూడు. మ'ని దివ్యదృష్టి నిచ్చుటయు;
నంతయు విస్మయం బడర వీక్షించి,
సంతోషమునఁ బొంది సతియును దాను
సొక్కుట సాష్టాంగ మొనరించి, భక్తి
నెక్కొనఁ 'బరమేశ, నీప్రసాదమున
నరిగె దుర్మోహమదాంధకారంబు,
పరఁగె సమ్యగ్జ్ఞాన భాస్కరోదయము;
ఈభవబంధము లిన్నియుఁ బాపి,
నీ భక్తుగా నేలి నీ సేవ మరపి,
నన్ను మన్నింపవే నమ్రవిధేయ,
నన్ను రక్షింపవే నాగకేయూర;
నీకు మ్రొక్కఁగఁ గంటిఁ, నినుఁ జూడఁ గంటిఁ,
బ్రాకటంబుగ జన్మఫల మబ్బె నాకు.
నిండు నెమ్మది నిన్ను నిలుపుట దక్క
నొండువరంబు నే నొల్ల నీ యాన.'
యనః— నప్పు డారాజానర్ధాంగలక్ష్మిఁ
దనకృపాదృష్టిఁ గాత్యాయని చూచి
'రా, చంద్రమతి పతివ్రత వౌదు వీవు.
నీచరిత్రంబు వర్ణింప నచ్చెరువు?
సుదతి నీమంగళసూత్రంబు గాదె
పదివేలబాములఁ బాపె నీపతికి?
సౌభాగ్యవతివి గా సకలసామ్రాజ్య
వైభవంబుల మించి వసుధ నేలుచును
పెద్దగాలమునకుఁ బ్రిద్ధుఁడును నీవు

నెద్దిక వచ్చి మాయొద్దనే యుండుఁ.'
డని కుస్తరించి 'నీ వడిగినవరము
కొను మిత్తు' మనిన; నక్కొండరాచూలి
పదముల వ్రాలి, 'భూపాలబాలకుని
బ్రదికించి నానిందఁ బాపి రక్షింపు,
సకల జగన్మాత శాంభవి.' యనుడు,
వికసితవదనారవింద యై గిరిజ
'నీ చిత్తశుద్ధికి నెఱయ మెచ్చితిని.
రాచపాపఁడు మున్ను బ్రతుకు, లోహితుని
ప్రాణ మిచ్చితి, వారు పంపున.' ననిన;
మాణిక్య కీలిత మంజు మంజీర
కంకణ కింకిణీ కాంచన వలయ
ఝంకృతు లాలయ, వజ్రపుటంటుజోడు
తళుకులు మెఱుఁగుటద్దంపుఁజెక్కిళ్లఁ
దళుకు దళు క్కని తఱచుగా మెఱయఁ,
గదలు బంగారు చిల్కల రావిరేక
పొదలి నెన్నుదుట సొంపుగ నటియింప,
గోమేధికపుఁ బులిగోరు నేవళము
ప్రేమమై నురమునఁ బెనఁచి తూఁగాడఁ,
బరఁగ నుంగరముల పచ్చని డాలు
బెరసి ముద్దులవ్రేళ్లఁ బెనఁగ, నేతెంచు
సుతు లోహితాస్యునిఁ జూడ నానంద్ర
మతికిఁ జన్నులు సేఁపె. మమత నాయింతి
యానందబాష్పంబు లందంద రాల
గా నక్కుతో నొత్తి కౌఁగిటఁ జేర్చి,

పులిగోరు నేవళము=పులిగోళ్లు గల హారము. డాలు=కాంతి.

## —. కౌశికుఁడు హరిశ్చంద్రునికి మరల రాజ్యము నిచ్చుట.—

ముద్దాడు చుండ;— నప్పుడు కౌశికుండు
తద్దయు లజ్జించి, తల వంచుకొనుచుఁ,
గడుఁ జిన్నఁబోయి, యాగ్రహ మెల్లఁ బోవ
విడిచి, శంకించుచు, వెఱఁగున మునిఁగి,
'తప మను తనమూలధనము ప్రతిజ్ఞ
నెపమునఁ జెడి పోయె నేఁడు నా కకట!
పాకశాసనుఁ డేల ప్రశ్న గావించె?
నాక్రియ మును లెల్ల న ట్లూరకుండఁ,
బాలెడిబండ్లకుఁ బదములు సాఁచు
వీటిఁడిపగిది వివేకంబు మాలి,
పని లేనిజగడంబు పైకి రాఁ దిగిచి,
యనఘు వసిష్ఠ మహామునిసింహుఁ
గలఁచి నాదెస కేల గవియించుకొంటి?
వల దని సుర లైన వారింపరైరి!
జగతిలోపల హరిశ్చంద్రభూవిభుఁడు
పొగ డొందె నేమి? తాఁ బొగడొందఁ డేమి?
బొంకకుండిన నేమి? బొంకిన నేమి?
కింకిరిపడి పరికింప నా కేల?
నేలకు నింగికి నెతి సూత్ర పెట్టఁ
జాలెడు నా బుద్ధి సమసె నే' ననుచు,
నొగి వ్రేటు దప్పుటయును జోహా రనెడు
పగిది, సన్నిధి యైన భర్గాది సురులఁ

వీటిడిపగిదిఁ = వెఱ్ఱివానివలె. కింకిరిపడి = అసూయపడి. జోహారు = నమస్కారము.

గని మ్రొక్కి, పార్థివుఁ గౌఁగిటఁ జేర్చి,
మనమున హర్షించు మాటలు పలికి,
'బడలితి వెంతయు! భానుకులేశ,
జడమతిఁ బూని నీ సత్యంబు పెంపు
* సొలయక యొరసి నేఁ జూచుట కిట్లు
నలఁకువఁ బొందించి, నాతిని నిన్ను
వేవేల విధముల వెతలఁ గుందించి,
కావరంబునఁ జాలఁ గల్ల చేసితిని.
లోలత నా తప్పు లోఁగొని, మనసు
జాలిఁ బో విడిచి, యీ సామ్రాజ్యలక్ష్మి
నెమ్మదిఁ గైకొని నెఱి మహీప్రజల
నిమ్ముల రక్షింపు మిఁక.' నన్న;—నవ్వి
"యకట మునీంద్ర, యి టానతీఁ దగునె?
సకల జగన్నుత చరితుండ వీవు.
నీ కేటి తప్పులు? నిఖిల లోకముల
నీకతంబున మించె నేఁడు నాకీర్తి:
ఘన మైన నీ యనుగ్రహమునఁ గాదె
చనుదెంచె ననుఁ బ్రోవఁ జంద్రావతంసుఁ?
డీ దేవతలు మును లీ యోగివరులు
నీ దయఁ గాదె మన్నించిరి నన్నుఁ?
జల్లనినీకటాక్షంబు నామీఁద
నుల్లంబులో మోద ముప్పొంగఁ జేసెఁ,
బరితాపముల నెల్లఁ బాపె, సౌఖ్యములఁ
బురికొల్పె. నింక నో మునిచంద్ర, నిన్ను
వెఱచుచు నొకమాట వేఁడెద నేను.

---

'* సొలవక.'

మఱచియు రాజ్యంబు మరలఁ గొమ్మనకు.
'మెలమితో మున్నొక్కఁ డిచ్చినదైన,
బొలుపొందఁ దా దార పోసిన దైన,
సూది మోపెడు నంత చోటు నాభూమి
లే దని కడపిన, లెక్కింప, వాఁడు
ఘనతర మగునరకమున వేయేండ్లు
మునుఁగుచుఁ గ్రిమిరూపమున వసియించు.'
ననుధర్మశాస్త్రవాక్యార్థంబు గొంత
మనమునఁ దలపోయుమా మునినాథ.
యేకాతపత్రమై యొసఁగు నీవసుధ
నీ కిష్ట మగువారి నిలిపి యేలింపు. "
మనుటయు 'మే లయ్యె నట్లు చేసెదను.
జననాథ నాకు నీ సకలరాజ్యంబు
నీచేత నేలింప నిక్కంబు వేడ్క
నా చిత్తమునఁ జాల ననిచిన దిపుడు.
బొంకితి నని పొమ్ము, పో కున్న వట్టి
శంకలు మాని నాజాడ నే రమ్ము.
దేవేంద్రుఁ డాదిగా దేవసంఘములు
నా వామదేవాదు లైనసన్మునులుఁ
జెవులార విన మున్ను చేసినప్రతిన
శివశివ! తప్పునే? చెచ్చెర నిన్ను
నిల నెంతకాలంబు నేలింతు ననుచుఁ,

సూది మోపెడునంతచోటున్ = ఎంత కొంచెపు భాగము నయినను. ఆభూమిన్ = ఆయిచ్చినభూమిలో. లే దని = ఇయ్య లే దని - లేక - ఇచ్చినదానిలోనిది కా దని. కడపినన్ = అప హరించినయెడల.

బలికితి నందాఁక బాలింపు వసుధ
మఱి మీఁద దేవేంద్రుమాటట గద్దె
నెఱి నెంతగాలంబు నిలుపుదు నంటి,
నంతకాలము నుండు మమరలోకమున.
వింత గా దీమాట. విశ్వేశునాన.'
నావుడు నొం డాడ నలికి భూనాథుఁ
'డేవెంట నేదోష మెసఁగునో' యనుచుఁ,
జింతించు చున్నంత;—శిష్యులు గొలువ
సంతోషచిత్తుఁడై చయ్యన వచ్చి
తనతేజ మెల్లెడఁ దనర వసిష్ఠుఁ
డనుపమభక్తి భర్గాదిదేవతలఁ
గని, మ్రొక్కి, ప్రస్తుతిఁ గావించి, యప్పు
డినకులాధీశుని నీక్షింప; నృపుఁడు
మ్రొక్కి చేతులు మోడ్చి 'మునినాథ, నీవు
మిక్కిలి కరుణ నామీఁదఁ గావించి,
తోడఁబడఁ బరుసంబుతో నిన్ను సోకి
కడువడి మేల్మి బంగార మైనట్లు
లీలని నన్నుఁ బరీక్షింపఁ జేసి
ఖ్యాతి నొందించితిఁ గాదె. నీ విపుడు
ఘన తపోధనుఁడైన గాధేయు తలఁపు
మనమున నెఱిఁగి, సమ్మతిఁ బ్రోవ నిందు
వచ్చితిఁ గాన, జీవము వచ్చె నాకు.
నచ్చుగా మీతలం పాన తీ వలయు.'
ననిన;—హరిశ్చంద్రు నావశిష్ఠుండు
గనుఁగొని తనపెంపు గాన రాఁ బలికె.—

భర్గ=శివ. పరుసంబుతోఁ = స్పర్శవేధితో.

'జగతి నిక్ష్వాకువంశజులసత్కీర్తి
మిగులంగ నీచేత మెఱుఁగు వాటిల్లె.
నా పురోహితుఁ డని నను బెద్దఁ జేసి
నా పూన్కి చెల్లించినాఁడ వీ వనఘ.
ఇట్టిసత్యవ్రత మిట్టియౌదార్య
మిట్టితెంపును గాన మెవ్వరియందు.
నెలమితోఁ గౌశికుం డేపని వనిచె
నలవడఁ గావింపు మదియె నాతలఁపు.'
నావుడుఁ దనగురునాథువాక్యములఁ
ద్రోవక గాధిపుత్త్రునిమాట సేయ
ననుమతించె నరేంద్రుఁ, డట శివ శక్ర
వనజాసనుల మునివరుల పంపునను
దివ్యగంధంబుల దివ్యమాల్యముల
దివ్యభూషణముల దివ్యాంబరములఁ
గులసతితోఁ గూడఁ గువలయేశ్వరుని
గొలమి నచ్చర లెల్ల నెమ్మిఁ గైసేయ
నాసమయమునఁ బూర్వాద్రిశృంగాభ
భాసురం బగు చున్న భద్రపీఠమున
రమణీయ మగు హేమరత్నకుంభముల
నమరనదీజలం బమరఁ దెప్పించి
శ్రీకరంబుగ నభిషేకంబు చేసి
'శ్రీకంఠకరుణావిశేషంబువలన
ధరణీతలం బెల్లఁ దగ నేలు.' మనుచుఁ
గర మొప్పఁ బట్టంబు గట్టి రావేళఁ.
గమలాసనుం డాదిగా మునివరులు

సత్కీర్తి = మంచియశస్సును సందు. అమరనదీ = గంగా.

నమర దీవించి మంత్రాక్షత లిడిరి.
తిరముగా ఘోషించె దేవదుందుభులు,
పోరిఁ బోరి వర్షించెఁ బుష్పవర్షములు,
పాడిరి గంధర్వభామిను లెలమి,
నాడిరి వేడుక నప్సరఃస్త్రీలు,
చల్లనై విభుమీఁదఁ జందనానిలము
నుల్లంబు వికసింప నుయ్యాన నొలసెఁ.
బరమేశుఁ డప్పు డాపార్థివేశ్వరునిఁ
బరఁగ దీవించి, 'నీపట్టణంబునకు
భూనుతవైభవంబున నేఁగు.' మనుచుఁ,
దానును సురలు నంతర్ధాన మాయె.

—. హరిశ్చంద్రుఁ డయోధ్య కేఁగుట .—

అంత నావృత్తాంత మానారదుండు
వింతగాఁ జెప్పిన విని సత్యకీర్తి,
యానందరసభరితాత్ముఁ డై యపుడు
భూనాయకుని రాక పురిఁ జాటఁ బనిచె.
నావార్త వీనులకమృత మై సోఁక
వారిఁ దమతమవాడవాడలను
బురిగొన్న సంభ్రమంబునఁ బౌరసతులు
పరువడి బహువిధభవనమాలికలఁ
దనరు ముంగిళుల ముందఱిమాజారములఁ
గనుపట్టు నగరుపంకంబునఁ బూని
సిరిగందమున నూలిఁ జిగు రొప్పఁ జల్లి,

పరువడిన్ = క్రమముగా. అగరుపంకంబునన్ = అగరుగంధపుఁ బూఁతతో. భవనమాలికలన్ = ఇండ్లవరుసలయందు. గందమునన్ = శ్రీగంధముతో.

సురుచిరకర్పూరసూత్రముల్ నిగుడఁ
బలుచనిచాఁదునఁ బట్టెలు దీర్చి
థళథళ మెఱయుచిత్తరువు వ్రాయించి,
కర మొప్పఁ గమ్మని కస్తూరి నలికి,
సరస మౌ పన్నీట జలకముల్ సల్లి,
యాలయంబుల నెల్ల సాణి ముత్తెముల
లీలమై రంగవల్లిక లొప్పఁ దీర్చి,
ప్రమద మారఁగ నెఱపట్టుఁబుట్టములఁ
గమనీయ మగు మేలుకట్లు గట్టించి,
తావు మంజిష్ఠ పుట్టములు తేరులను
ఠీవి మీఱఁగ సంఘటించి, కుంభములఁ
జెలు వారఁగా వన్నెచీరలు గట్టి,
కలువడంబులు గట్టి, కాంచనదండ
కలితపతాకలు గ్రందుగా నెత్తి,
విలసిల్లఁగాఁ బురవీథి మార్గముల
స్ఫురదురుకాంచనపూర్ణ కుంభములఁ
బరువడి నెత్తి, పుష్పంబులు నెరపి
ప్రవిమలరత్న దర్పణతోరణముల,
రవిదీప్తులకును మార్పడ నమరించి;
కర మిట్లు పురము శృంగారించి. రంత.—
నరయంగ వివిధవాద్యంబులు మ్రోయఁ,
దేరులఁ గరులను దేశాలిభటుల
శూరుల వీరులఁ జుట్టాల హితుల

రంగవల్లికలు=ముగ్గులు. పుట్టముల=వలువలతో. తావుమంజిష్ఠ =చక్కనియెఱుపు. కలువడంబులు=బంగారు కలువపూదండలను. దేశాలి=నానాదేశపు(?)

దొరల సామంతుల దుర్గాధిపతుల
సరసుల సత్కవీశ్వరులఁ బాఠకుల
నందఱఁ దోడ్కొని, యాసత్యకీర్తి
వందిమాగధజయధ్వను లుల్లసిల్ల,
నెదురుగా నేఁగి, యయ్యినకులేశ్వరుని
పదపంకజములకు భక్తితో మ్రొక్కి
యొనరఁ జేతులు మోడ్చి, 'యో హరిశ్చంద్ర,
దినకరవంశ ప్రదీపక, నీకుఁ
బ్రతిసేసి కొనియాడ రాజులు గలరె?
సతత సత్యవ్రతాచార సంపదలఁ
దొడరి వసిష్ఠునితో రాయిడించి
తడయక తన ఘోరతపము పెంపునను
బడయ దుర్లభ మైన బ్రహ్మఋషిత్వ
మడరంగఁ గైకొని యఖిలలోకములఁ
బొగ డొందు కౌశికముని వెఱఁగంద.
నెగడించి మించితి నీ సత్యమహిమ.
వసుమతీవల్లభ వన్నె రెట్టించె,
నెగడె నీకతమున నీవంశ మెల్ల.
సన్నుతం బైననీసామ్రాజ్య లక్ష్మిఁ
బన్నుఁగా గైకొని ప్రజలఁ బాలింప
విచ్చేయుఁ డీఁక.' నని విన్నవించుటయు; —
నచ్చుగా దగహాస మల్లన నెలయ
సమయోచితప్రియ సంభాషణములఁ
గొమరార మంత్రిముఖ్యుని నాదరించి,
సన్నుతకాంచనాచలమును బోలె
నున్నతం బై మించు నొకరథం బెక్కి,

చతురంగబలము లసంఖ్యలు గొలువ,
మితి లేని వాద్యముల్ మిన్నంది మ్రోయ,
మానిత మాగధ మధుర గానములు
వీనుల కింపుగా విలసిల్లి పొలయఁ,
దలకొని వందిబృందములు నుతింపఁ,
జెలఁగి పుణ్యాంగనల్ సేసలు చల్ల,
వెన్నెల వెదచల్లు వింజామరములఁ
బన్నుగా డగ్గఱి భామలు వీవ,
వాలారుఁగన్నుల వారకామినులు
లీలమైఁ బసిఁడిపళ్లెరములలోనఁ
గమనీయ మణిదీపకళికలు మెఱయ
నమరించి- మెయి దీఁగె లల్లన సొలయ
ఘనకుచంబులు చిక్కఁ- గరములరుచులు
గనుపట్ట-దరహాసకాంతులు నిగుడఁ-
గలికిచూపుల మించుగములు రాణింప -
నిలిచి నివాళింప, నిండారువేడ్క-
బురముఁ బ్రవేశించి, భూప్రజ లెల్ల
బరువడి జయ పెట్టఁ బార్థివేశ్వరుఁడు
వసుమతి నిజరాజ్య వైభవలీల
యెసగంగఁ జిరకాల మేలుచు నుండె.—
ననుచు మార్కండేయుఁ డాధర్మజునకుఁ
దెనుపొంద మున్ను సెప్పిన మార్గమునను
సత్యసంధుఁడు హరిశ్చంద్రునిచరిత
నిత్యసత్కీర్తులు నెగడ రచించి
భ్రమరా ప్రసాద సంప్రాప్త కవిత్వ
సమహిత సామ్రాజ్య సుఖపరాయణుఁడు

చతుర సాహిత్య లక్షణ చక్రవర్తి
ప్రతివాది మదగజ పంచాననుండు
మతిమంతుఁ డయ్యలమంత్రి పుంగవుని
సుతుఁడు గౌరనమంత్రి సుకవిశేఖరుఁడు
కవు లెన్న నుత్తరకథ రచియించె.
ఎవరు పఠించిన, నెవ్వరు వినిన,
జనులకుఁ బుణ్యముల్ సమకూడు సిరులు,
మనుము గా నాయుష్యములు గొన సాఁగు.
దారుఁ బుత్త్రిలు నన్నదమ్ములు సఖులుఁ 2920
దామరతంపరై ధరణిఁ బెక్కండ్లు
వేమాఱు నోములు వెలయఁ బెండిండ్లు
సేమ మేర్పడ నెందుఁ జేయుచుందురు.

హరిశ్చంద్రోపాఖ్యానము

సమాప్తము

---

పంచాననుండు = సింగమైనవాఁడు. పుణ్యముల్ సిరులు = పుణ్యము లయినసంపదలు. మనుము గాఁగ = దీర్ఘము గా.

# శోధనపత్రము.

| పుట. | పంక్తి. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 15 | 285 | జర్జరల. | జజ్జగల. |
| 20 | 400 | మఱి. | మరి. |
| 228 | శీర్షిక. | పట్టిచ్చు ఇట. | పట్టి ఇచ్చుట. |

